# ప్రత్యేక ఆంధ్రమహాసభ చెన్నపురి





## విశేషసంచిక

## విషయసూచిక

# మనవి

చాల అవ్యవధిగా ఈ విశేష సంచిక ప్రచురణ కార్య భారమును వహించవలసి వచ్చింది. వ్యాసకర్తలు, ముద్రాపకులు, తదితర మిత్రుల అవ్యాజమైన అభిమానము, అమూల్యమైన సహాకారము లేనిపక్షమున రసూరమి వారము దినములలో ఈ విశేష సంచిక బయల్పడేందుకు సాధ్యమయ్యేది కాదు.

శ్రమకోర్చి, అడిగినదే తడవుగా వ్యాసములను దయచేసిన రచయితల కందరకు కృతజ్ఞతా పూర్వక వందనములు. అవ్యవధిగా పనులనన్నిటిని నిర్వర్తించవలసి వచ్చినందున ఇందు అనేక దోసగులు దొరలి ఉండవచ్చును. సహృదయులూ, గుణగ్రహణ పారీణులైన పాఠకులు వానిని మన్నించ వేడుతన్నాను.

కె. అప్పారావు,

సన్మాన సంఘ అధ్యక్షుడు.



శ్రీ భోగరాజు పట్టాభి సీతారామయ్య పంతులు



శ్రీ టంగుటూరి ప్రకాశంపంతులు





ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు అధ్యక్షులు

ఆచార్య రంగా





మహర్షి

శ్రీ బులుసు సాంబమూర్తి









శ్రీ బెజవాడ
రామచంద్రారెడ్డి





రావుబహద్దరు
శ్రీ బి. వి. నారాయణస్వామినాయుడు









శ్రీమతి
అమ్మన్న రాజా





శ్రీమతి
ఆచంట రుక్మిణీ లక్ష్మీపతి







శ్రీ రాజ ఎం. ఆర్: అప్పారావు ఉయ్యూర్ కుమారరాజగారు, ఆంధ్ర మహాసభాధ్యక్షులు.

ఆంధ్రమహాసభ ఆహ్వానసంఘ కార్యదర్శి



శ్రీ తట్ట వెంకటరాఘవాచారి




మద్రాసు నూతన మంత్రివర్గం



ప్రకాశం మంత్రివర్గం



శ్రీ గుర్రం సుబ్రహ్మణ్యం



శ్రీ మామిడి వజ్ఝల కృష్ణశర్మ



శ్రీ మామిడిపూడి వెంకటరంగయ్య

శ్రీ భావరాజు వెంకటకృష్ణారావు





కీ॥ శే॥ గురజాడ అప్పారావు



శ్రీ డి. దేశికాచార్యులు



కీ॥ శే॥ వేమవరపు రామదాసుపంతులు



పండిట్ డి. గోపాలాచార్యులు



శ్రీ వి. నాగయ్య



శ్రీ డి. వి. సుబ్బారావు



శ్రీ గోవిందరాజు
వెంకటసుబ్బారావు

# జాతీయగీతిక

జయము! జయమ్మాంధ్ర జగజ్జననీ! మముగన్నతల్లి!
జయజయ హే! ద్వీపాంతర చలితలలిత కీర్తివల్లి!

నీపురాప్రభంధలంచి, నీపదముల పూజలుంచి,
పూజించెద మెదల మేము! తేజోమయ విగ్రహమ్ము!
తరళ కృష్ణవేణీ గోదావరీ హృదయహారా!
చరణోచ్చల సాగరమణి కిరణోజ్జ్వల మంజీరా! జయము.

నిఖిలాంధ్రమ్మొక గళముగ, నీఘన జయమంగళముగ,
స్థాపించెద మనుదినమ్ము! మాపూర్వ ప్రాభవమ్ము!
వీరరెడ్డి నృపతి మనోహారి మధూత్సవ తోరణ!
భారత కవితారుణ మందార మాలికా భరణా! జయము.

దిగ్దిగంత జలనిధులన్ దిగ్దంతి శ్రుతిగతులన్
భోరనుగా కాంధ్ర యశోభేరీ గంభీరఘోష!
శాసితాంధ్ర రాణ్మహేంద్ర జనపతి పూజిత చరణా!
సార్వభౌమ కృష్ణరాయ జయనీరాజిత వదనా! జయము

శ్రీ పిలకా గణపతిశాస్త్రి

# ★ తెలుగువారి విజయగాధ ★

## శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మ



తెలుగుదేశము వీరభూమి; తెలుగుబిడ్డడు మేటిజోదు.

కత్తి పట్టి కేడెము దాల్చి చండప్రచండుడై విక్రమించినాడా తెలుగుజోదు వీరవిహారానికి తిరుగులేదు; మరుగులేదు. అతడు రౌద్రమూర్తి కదలినంత మేరా కదనరంగమే. వింట బాణము సంధించి లక్ష్యము చూసి వేసినాడా అది శ్రీరామబాణమే; దానికి అడ్డములేదు; ఆకలేదు. ఏకాంగివీరులలో ఎంతటివాడూ అతనికి లెక్క. యుద్ధభూమి అతని క్రీడారంగము. తెలుగుతల్లి వీరమాత.

రాజ్యము వీరభోజ్యము. తెలుగునాడు పిరికిమట్టిలేని శౌర్యపుగడ్డ. ఈ తెలుగునాటి రాజ్యములు ఎన్నో మొలకెత్తినవి; ఎన్నో రాజ్యములు అవురుసవురై కుప్పకూలినవి. రాజ్యములు వెలయించుటా, రాజ్యములు పాలించుటా రాజనీతి పారంగతులైన ఆంధ్రచాణక్యులకు అలవోకలేని వినోదక్రీడ. కాకపోతే, ఈ తెలుగునాట చరిత్రాకాశమున తూర్పురేకలు తోచిన వేకువజామునుంచే, ఉషాకుమారి రంగురంగుల ఉడుపులు దాల్చి ప్రత్యూష పవనకుమారునితో గొంతుకలిపి నీరవ మధుర గీతిక మురయించి మోహనలాస్యము చేసిన శుభముహూర్తమునుంచే శతవృద్ధ కృష్ణవేణ్ణాతరంగిణి పారాడిన పుణ్యసీమల దివ్యనగరము అమరావతికి విజ్జోడు అమరావతీనగర ఆంధ్రరాజ ప్రాసాద ప్రాంగణమంటపాల ఆ మంగళవాద్య ఘోషమేమిటి? ఆ వైతాళిక బృందము మేలుకొలుపు లేమిటి?

ప్రాతస్స్నానముచేసి శుచియైవార్చి అనంతయాత్రలో కర్మసాక్షికి మందహాసురబాధా నివారకముగా అర్ఘ్యప్రదాన మాచరించే వైదికాంధ్రావలిని తన అనంత వీచికా కరకమలములను పైకెత్తి కృష్ణవేణీమతల్లి ఎట్లా ఆశీర్వదిస్తున్నదో? కనబడుట లేదూ? ముసలియవ్వ గంగాభవాని ఆశీర్వచనము ఫలించినది. ఆంధ్రుల క్షాత్ర తపోజీవనము దివ్యవాహినిగా తరంగితమై అనంత ఫలప్రదమైనది. అందువల్లనే చరిత్రకు దొరికిన తెలుగుజోదు మెల్లన అల్లవల్లన కనువిచ్చి మందహాస ప్రభాపాళికలు తరంగలించే ప్రసన్న వీక్షాప్రసారము చేసేనాటికే ఆంధ్రవీర కుమారునికి మహారాజ్యాధిపత్య యోగమూ, సకలైశ్వర్యాభ్యుదయ యోగమూ పట్టినది. ఎంతటి అదృష్టవంతుడు ఆంధ్ర కుమారుడు! దక్షిణాపథాన అతని నొసటనే పొడిచినది ప్రొద్దు.

వెళ్లు నీవు వెళ్లు, విశాలమైన ఈ యాంధ్ర దేశములో ప్రాచీనవైభవము రూపరిపోయి చివికి శిథిలమై చీపర పాపరైన ప్రాచీనాంధ్రుల పెనుకోట కొమ్మలలో, కూలి క్రుంగారుతూవున్న బోడిగోడల చాళ్ళలో, కోట దిబ్బల ఎగుడు దిగుడులలో, బొరియలందు, పొదిగిళ్లను మారుమూలలను నడుము విరిగి లేవలేక, లేచి నిలువలేక ఈడ్చుకొంటూ తారాడుతూవున్న శతశతాధిక వయస్క, ఆంధ్రరాజ్య రమాధిదేవత ముసురుమూలుగు తెలుగు రాజసపు గాలివారలలో తేలియాడుతూ వీనులకు లీలగానైనా వినబడును. వినవయ్యా, చెవియొగ్గి. ఇంచుక ఆలకించు ఆ రవసవ్వడి.

నిన్ను నీవు విస్మరించుకొని నన్ను కాదన్నటులు రొమ్ము విరుచుకొని పరువులు పెట్టి నేమి లాభము? మహా మొనగాడవు. నీయాత్మస్వరూపమును నీవు గుర్తుకు తెచ్చుకో దాసశిఖామణీ! చింత చచ్చినది కాని నీకు మిగిలినది పులుసుమాత్రమే! శోచనీయస్థితి కాదూ నీది?

### సంభావించు నీపూర్వజన్మముల గాధలు :

రాజ్యచక్రము అలవోకగా త్రిప్పి దేశదేశములు జయించినావు. రాజవే కాదు, రాజాధిరాజవు, రాజపరమేశ్వరుడవు అయినావు. సామంతులే కాదు, అన్యదేశాధి నాధులుకూడా నీచరణకమలములకు తమ అనర్ఘ రత్నకిరీట కాంతులతో నీరాజనములిచ్చి నీకు ప్రణమిల్లినారు. నీకటాక్ష వీక్షణము తమపైని ఎప్పుడు ప్రసరించునాయని చేతులు కట్టుకొని వేచియుండేవారు. తిరుగులేనిదికదా నీశాసన మానాడు. నీక్రోధానలాభీల జ్వాలా

శిఖావళికి గురియై బ్రతికి బయటపడిన వాడేడీ? నీ యమృత ప్రసాద వీక్షణా పారానికి ఆశలు చిగిరించి మారాకు తొడిగి సుమనో మనోజ్ఞత సంతరించుకోని వాడేడీ ఆనాడు నీపరిపాలనలో? ద్విసహస్ర వర్ష జీవివి నీవు.

వంగదేశానికి వెళ్ళి శతశతాబ్దుల క్రిందటే వీరాతి వీరు లనిపించుకొన్నారు నీపూర్వులు. మగధకువెళ్ళి పాటలీపుత్రాన సామ్రాజ్య పట్టభద్రులై భద్రతగన్నారు నీపూర్వులు; వారి పచ్చపైకము అక్కడ నేటికీ కన బడుతుంది. దక్షిణాపథేశ్వరులుకామా నీపూర్వులు పూర్వ పశ్చిమ సముద్రాధిపతులు రాజ్యరమా ధురంధరులు.

ఒకటా రెండా వారు మలచి మహికెత్తిన రాజ్య సౌధాలు? తెలియదూ నీకు ఆంధ్రరాజ్య రమారమణి పదటు బంగారు చిరుగజ్జియల మేలిభూషలు దాలిచి ఒయ్యారములు పోతూ అడుగులలో ఒకుపులూ, గాత్ర ములో తీరు తీయములూ, సొగసైన భంగిమములూ దిద్దు కొంటూ నర్తించిన నాట్యకూటములు మన రాజధానీ నగరములు. కళింగనగరము, పీఠాపురము, ద్రాక్షారామము, రాజమహేంద్రవరము, కోరుకొండ, కొలనుపురము, వేంగిపురము, విజయవాడ, విజయపురి, ఓరుగల్లు, భోన గిరి, రాజుకొండ, దేవరకొండ, కొండపల్లి, కొండవీడు, ఉదయగిరి, విక్రమసింహపురము, గండికోట, కందనోలు, పెనుగొండ, విజయనగరము, చంద్రగిరి—ఇట్లా ఒకటా రెండా—అనేకములు. మనపూర్వపు ఆంధ్రుల ప్రజ్ఞా పౌరుషాలను, ప్రతిభను కైసేసికొని కీర్తివహించిన ఆ పుణ్య క్షేత్రములు సందర్శించావా? అక్కడి భూత ధాత్రిని ఇంత తీసి నీ నొసట తిలకముగా దిద్దుకొని ఆంధ్రజాతికి యశస్సంపద గడించిపోయిన వీరులు నీ పూర్వులకు నీ కవోష్ణాశ్రుజలముల నివాపాంజలు లిచ్చినావా?

ఆ రాజధానీ నగరములు మనకు మహా పుణ్యక్షేత్ర ములు. వాటి సందర్శనము మనకు ఉత్సాహశక్తి సంవర్ధ కము. మన ప్రాచీన జీవనవైభవస్మృతి ప్రబోధకము. మన జాతీయ వీరుల పాదచిహ్నములతో ముద్రితమైన పుణ్యభూములవి; మన ప్రాచీ నేతిహాసగాథలు తరగత్తి కాల శైలము తాకి శీర్ణమై చిరుసురువులై పాంపరికుం పరులై గాలిలో కలిసిపోయి తెరలు తెరలుగా పొరలు పొరలుగా కదలాడుతూ మనలో ప్రాచీన మధురస్మృ తులు రేపే వాతావరణము అక్కడిది. దాని కెంతటి బలము, ఎంతటి మాధుర్యము! ఆ దివ్యమధురస్మృతులు రేపే ప్రాచీనగాథల అంతరార్థము నూహించి సంభా వించు నీపూర్వులే అక్కడ మహాదుర్గాలు నిర్మించి రాజ్యమేలినవారు. వారంతటి శక్తిసంపన్నులూ, యశో మహితులూ అయినప్పుడు వారిసంతతి వాడవేనే నీవు ఎంతటి ప్రతిభావంతుడవూ, ప్రజ్ఞాధురంధరుడవూ కావాలి? లే. ఆంధ్రమాతను సందర్శించు; ప్రబోధము పొంది ఆత్మసాక్షాత్కారము చేసుకో. ఆంధ్రజాతికి శుభోదర్కమైన కల్యాణముహూర్తమిది.

—౨—

తెలుగు బిడ్డ మహారాజు. తెలుగునాయకుడు ప్రధాని. తెలుగుదొర సైన్యాధిపతి. తెలుగు శాస్త్రవేత్త మహా రాజునకు ఉపదేశకుడు. తెలుగుజోదు విజితసీమలకు రాజప్రతినిధి. ఎఱుగుదువా తంజావూరు, మధురలు ఒక నాడు తెలుగువారు ఏలిన రాజ్యములు. తెలుసునా పుదు క్కోట, తిరువాన్కూరులు ఒక కాలములో తెలుగు వారి సామంత రాజ్యములు. ఆనాడు తెలుగు రాజభాష- ఒక్క మన తెలుగు దేశములోనే కాదు, దక్షిణదేశ మంతటాను. సామంతులైన ద్రవిడదేశాధిపతులు తెలుగు కవుల నాదరించారు; తెలుగుకావ్యములు కృతిపొంది నారు. తెలుగువారు వ్రాసిన సంస్కృత గ్రంథములు, తెలుగు కావ్యములు తమ గ్రంథాగారములలో భద్రపరిచి చదివి వినిపించుకొని ఆనందించిన ద్రవిడ సామంతు లున్నారు. గేయము లల్లిన, కీర్తనలు చెప్పిన, యక్ష గానములు రచించిన ఆంధ్రేతరు లున్నారుకూడా తెలు సునా? తెలుగువారి ఆటలు, తెలుగువారి పాటలు నేర్వడము ఒకనాడు దక్షిణాదిని గౌరవముగా తలచే వారు; దక్షిణాది కొలువుకూటములలో ఒక కాలాన తెలుగు సంస్కృతి సింహపీఠ మలంకరించినది. సింహాళ ములోకూడా తెలుగు నాయకుల పాదుపత్తేమే. ఒక నాడు దాక్షిణాత్యరాజ విద్యామంటపాలు తెలుగు కవుల

కావ్యగీతి వినోదాలతో గుబాళించిపోయినవి. ఆకాల మట్టిది—తెలుగువారు పట్టినదల్లా బంగారమైనకాలము, తెలుగువారి భాగ్యరేఖ బంగారుపంట పండినకాలము.

మన తెలుగువారికి రాజ్యము పోయి రమారమి మూడువందల సంవత్సరములైనది. రాజ్యభ్రష్టత కలిగి మూడువందల సంవత్సరాలుకాని ఆయుధైక జీవనము పోయి నూటయాభై సంవత్సరములే.

వందలకొద్ది సంవత్సరాలనుండి రాజ్యములు నిర్మించి దేశదేశము లేలిన తెలుగువాడు క్రిందపడినా పైచేయి అతనిదే. ఓటమి యెరుగని బ్రతుకు అతనిది. సంతత రాజ్యాధిపత్య యోగమేకాదూ? అతడు రాజ్యమేలిన కాలములో అతడెన్నిదేశముల కెత్తివెళ్లినాడు, ఎన్నెన్ని జైత్రయాత్రలు చేశాడు, ఎన్నిదేశములు జయించినాడు? అజేయములనుకొన్న మహాదుర్గము లెన్నిటిని సాధించినాడు? ఆనాడు దక్షిణాపథమునందంతటా అతని వీర గాథలే; తెలుగు జోదుల ప్రజ్ఞాపాటవాల సాహసకథలే. పూర్వము భోగిమంటల దగ్గర కూర్చుని తెలుగుతాతలు సంక్రాంతి రోజులలో మనుమల కీకథలు చెప్పేవారు. వసంతోత్సవములలో యుద్ధవిజేతలైన వీరులు తమ ఆప్త బంధుమిత్రులకు ఆజైత్రయాత్రలలో, కోటలు సాధించుటలో, పరరాజ్యములు కూల్చుటలో తాము చూపిన పగ్గాలు చేసి మాపి వినోదవర్ణనచేసి అక్కజము గొలిపేవారు. శరద్రాత్రుల పుచ్చపూవెన్నెలలో తమ మనుమరాండ్రకు తెలుగు అవ్వలు ఆంధ్రవీర నారీమతల్లుల సాహస పరాక్రమాల కథలుచెప్పి జోకొట్టి నిద్రపుచ్చేవారు. తెలుగు నాయకుడెంతటి పరాక్రమవంతుడో తెలుగు నాయికామణి అంతటి సాహసురాలు—సైంధవ శిక్షు, సాముగరిడీలు నేర్చిన వీరవనిత ఆమె. తెలుగు రాజ్యములు పాలించిన తెలుగువనితామతల్లులు కూడా ఉన్నారు—విన్నావా? అంతా తెలుగువారిది ఆవో బృహత్కథ. తెలుగువారి ఔదార్యము, తెలుగువారి దయాధర్మపరత, తెలుగువారి శౌర్యప్రతాపములు, తెలుగువారి క్రౌర్యము, తెలుగు జోదుల త్రాచుపగ, తెలుగువారి తెంపరితనము—ఒక విషయమేమిటి,—తెలుగు తనమునుగురించిన జీవితగాథలు చరిత్రాంశములై కథలై మహారాష్ట్రమున ప్రచారముగన్నవి; కర్ణాటకమున విరియబ్రాకినవి; ద్రవిడదేశము వాటికి ఆలవాలమే యైనది. ఇక మన తెలుగుదేశములోని వీరగాథలకు లెక్క ఎక్కడిది?

అటువంటిది మన తెలుగుజాతి దాస్యపు సంకెలలో బంధితులము కాగానే మనము, మనము కాకుండా పోయినాము. మన జీవితమే తారుమారయినది. మనకథలే మరచినాము; ఉజ్జ్వలమైన మన ఇతిహాసమే విస్మరించినాము. సృష్టి ఆరంభమునుంచీ మన మిట్టి దాస్యపు బ్రతుకే బ్రతికినట్టనిపిస్తున్నది; ఒకరికి విధేయులమేకాని మన మెప్పుడూ ఒకరిని శాసింపనే లేదనిపిస్తున్నది. నేల మీద అలుముకొనుటేకాని హిమవన్నగశిఖరాగ్రమెన్నడూ మన మందుకొననే లేదనిపిస్తున్నది. మన పూర్వ చరిత్రానుభవము పూర్తిగా మరచినాము; ఆత్మ స్వరూపజ్ఞానమే పోయినది; ఎంతటి పతనము, ఎట్టి దుర్గతి, ఎంతటి విస్మృతి—పాతాళకుహరాలను కూడా అందుకొనేటంత గాఢమైన విస్మృతి. సంభావించు నీపూర్వకథ, ఒక కొన్ని ఘట్టములు జ్ఞాపకము తేనా?

విన్నావు కాదూ నీవు ఈ యుపశ్రుతి :

కొండవీడూ మండేరా
కొండపల్లీ మండేరా
కాదని ఎవ్వడు వాదుకు వస్తే
కటకందాకా మండేరా.

విజయనగరాధీశ్వరుడు శ్రీ కృష్ణదేవరాయలు పూర్వ దిగ్విజయయాత్ర చేయదలపెట్టి ఉపశ్రుతిపరిజ్ఞానానికై రాత్రివేళ మారువేషములో నగరములో తిరుగుతూ వుండగా ఒక మడివాలు ఇంటిదగ్గర ఈ పాట వినబడినదట. పూర్వము రాజులు దండెత్తి వెళ్ళబోయేముందు అప్పటికి ప్రజల మానసికపరిస్థితి ఏవిధముగా ఉన్నదీ రాత్రులు ప్రచ్ఛన్నవేషముతో తిరిగి తెలుసుకొనేవారట. అదొక ఆచారము కాబోలు.

ప్రజల ఉత్సాహము ఆవిధముగా ఉన్నప్పుడు ప్రజానేత సాధించలేని కార్యమేమున్నది? ప్రజలే అతని బలము. అందులోను తెలుగువారు మొదటినుంచీ వరపతులేయయ్యె. వారి సైన్యములో కాల్బలము వేలాది

కాదు లక్షలాదే. ఇక శ్రీకృష్ణదేవమహారాయలా ప్రజా హృదయము తెలిసిన ఇంగితజ్ఞుడు; యుద్ధతంత్ర విద్యా విశారదుడు, ఇంతేకాదు, విషమ ఘట్టములలోనే, క్లిష్ట పరిస్థితులలోనే త్రిపదాత్మక శక్తిరేఖ తటిద్వల్లరిలాగ తెల్లమెరసి ఆ మహారాజు సాహస విక్రమార్కుడై పరాక్రమ స్ఫూర్తితో విజృంభించే వాడు. జలదుర్గమయేది, గిరిదుర్గమయేది, వనదుర్గమయేది, స్థలదుర్గమయేది, ఇంక ఆ మహారాజు విలయ జంఘామారుతాడంబర విజయ ధాటీ సమాటీకనానికి క్రుంగి కూలారడమేకాని తిరుగ తేరి తెప్పరిలడమేది?

శ్రీకృష్ణదేవరాయల యీ పూర్వ దిగ్విజయయాత్రను ఆ మహారాజు ఆస్థానకవులు అల్లసాని పెద్దిరాజుగారు, ముక్కు తిమ్మన్నగారు ఎంత మనోహరముగా వర్ణించినారో చూడు. ముందు పెద్దయ్యగారి యీ వర్ణన విను:

తొలుదొల్త నుదయాద్రి శిలఁదాకి తీండ్రించు
 నసిలోహమున వెచ్చనై జనించె
మఱి కొండవీడెక్కి మార్కొని నలిరైన
 యల కసవాపాత్రు నంటి రాఁజె
నటసాగి జమ్మిలోయఁబడి వేగ దహించెఁ
 గోనఁ బట్టెర్చెఁ గొట్టానఁ దగిలెఁ
గనకగిరి స్ఫూర్తిఁ గరఁచె గౌతమిఁ గ్రాచె
 నవుల నాపొట్నూర రవులుకొనియె

మాడెములు వ్రేల్చె నొడ్డాది మసియొనర్చె
గటకపురిఁ గాల్చె గజరాజు కలఁగి పఱవఁ
దోఁక చిచ్చన నార యుద్ధురతఁ గృష్ణ
రాయబాహు ప్రతాప జాగ్రన్మహాగ్ని.

ఈ విజయ విలాసమే తిమ్మన్నగారు వర్ణిస్తున్నారు: చూడు వారేమంటున్నారో:

ఉదయాద్రి వేగనత్యుద్ధతి సాధించె
 వినుకొండ మాటమాత్రన హరించెఁ
గూటముల్ పెదరంగఁ గొండవీ డగలించె
 బెల్లముకొండయు చ్చెల్లఁ జెఱిచె
వేలుపుకొండ నుద్వృత్తి భంగము సేసె
 జల్లిపల్లె సమగ్రశక్తిఁ గూల్చెఁ
 గినుకమీఱ ననంతగిరి క్రిందుపడఁజేసెఁ
 గంబంబుమెట్టు గ్రక్కున గదల్చె

బలనికాయము కొలుమట్టుల నడంచుఁ
గటకమును నింక ననుచు నుత్కల మహీశుఁ
డనుదినమ్మును వెఱచు నెవ్వనికి నతఁడు
రాజమాత్రుండె శ్రీకృష్ణరాయ విభుఁడు.

కృష్ణదేవరాయ లొక్కడే కాదు, అంతటి పరాక్రమవంతులు తెలుగువారు అనేకులు పూర్వులూ ఉన్నారు. రాజమహేంద్రవరాధిపతియైన వీరరెడ్డి అన్నగారూ, అల్లాడరెడ్డి కొడుకూ అయిన వేమారెడ్డి మాత్రము ఏమి సామాన్యుడా? కృష్ణదేవరాయల విజయధాటితో సరి సమానమైన ధాటి ఆరెడ్డికిడ్డనిది కూడా. అతడెంతటి ప్రతాపవంతుడో చూడు: ఒకకవి అంటున్నాడు.

దండయాత్రఘోష తమ్మట ధ్వనులచే
 గంతులు వేయించెఁ గప్పకొండ
కీలవకాలాభీల కీలానలముచేత
 నేలపాంగఁడ గించెఁ బాలకొండ
ఆరట్ట జాదట్ట (?) హయఘట్టములచేత
 మట్టి తూగ్రొత్తించెఁ బొట్టునూరు
భూరిప్రతాపాగ్నిఁ బటసులు వెట్టించె
 విద్వేషులను గరాకెండి పురిని.
అనఁగ నుతికెక్కలేర కేశాదిరాయ
యరుల పండువ మండువా యవనహరణ
బలియ ఘూళియ మాళువ బందికార
విజయ రఘురామ! అల్లాడ విభుని వేమ!

పూర్వము మన తెలుగువారికి శత్రువిజయము ఒక వినోదలీల కాబోలు, కాకపోతే అందరూ కృష్ణదేవ రాయలవంటి వీరవిక్రమాదిత్యులే అవుతారా? అల్లయ వేమారెడ్డి తమ్ముడు దొడ్డారెడ్డికూడా ఎంతటి గొప్పరెడ్డి దొరో చూడు: ఇతడుకూడా ఉత్తరాన చిలుక సరస్సు దాకా జయించి ఆ సరస్సు వొడ్డున జయస్తంభము నిలిపినాడట. శ్రీనాథకవి సార్వభౌముడు వర్ణిస్తున్నాడతని విజయ పరంపరలు వీనుల విందుగా వింటావా?

ఔరా! అల్లయరెడ్డి దొడ్డ వసుధా
ధ్యక్షుండు ధాటీచమూ
భేరీభీంకృతి ఘోర ఘోషమున
నిర్వేదించె నొడ్డాది శ్వాం

గారం కోటయు లోఁకు గొడ్డయును
నుద్ఘాటించె నత్యుద్ధతిన్
క్షీరాంభోధి తటంబున న్నిలిపె
దిక్సీమాజయ స్తంభముల్.

కొండవీటిరెడ్డి మన్నీల కాలమునుంచీ తెలుగు జోదులకు ఉత్కల దేశములోని కటకముదాకా జయిస్తూండడము ఒక క్రీడే అయినది. కొండవీటిని పరిపాలించిన కుమారగిరిరెడ్డి ప్రధాని ప్రతాప కాటయ వేమారెడ్డి కూడా కటక విజేతే. ఇతడు కటక చూఱకారుడట - (కటకమును కొల్లగొన్న వాడట). అతనిమీద కవులు ప్రశంసా ప్రమాణాలు ఎట్లా చల్లుతున్నారో గమనించు.

భూపాలాన్నమయన్ ప్రజాన్నియమయన్
కాంతాజనం కామయన్
భూదేవాన్ రమయన్ రిపూన్ విరమయన్
మిత్రాణి విశ్రామయన్
కీర్తిం స్వాంభ్రమయ న్నఘాని శమయన్
ధర్మం సమా...మయన్
సోయం వేమమహీపతి ర్విజయతే
కాటావనీశాత్మజః.
యః కటక చూఱకారః ప్రఖ్యాతః
పాండ్యరాజ గజసింహః
జగరక్షపాలకా నేయమండలి
కరగండః జగదగోపాలః.

పూర్వ దిగ్విజయమే కాదు, దక్షిణ దిగ్విజయ యాత్ర కూడా అమోఘముగా సాగించినారు పూర్వము తెలుగువారు. తంజావూరు, మధురలు తెలుగు రాజ్యములే అయినప్పుడు యిక వేరే నిదర్శనము లెందుకు ? ఇవి ఇటీవలి వంటావా, చాలా కాలానికి పూర్వమేవారు ఈ దక్షిణ దేశము జయించినట్టు నిదర్శనాలు ఉన్నాయి. విజయ నగరాధీశ్వరులకూ, రెడ్డిమన్నీలకూ పూర్వమే మన తెలుగు రాచబిడ్డలకు

ఉదయగిరీ మందేరా
సింహపురీ మందేరా
కాదని ఎవ్వడు వాదుకువస్తే
కాంచీపురమూ మందేరా.

అని ఉపశ్రుతి ఏనాడో వినబడే ఉండాలి. ప్రజలలో ఆవిధమైన ఉత్సాహము పొంగి పొర్లి కలై ప్రవహించింది గనుకనే విజయనగర రాజ్యసంస్థాపన కాలానికి చాలా పూర్వమే కాంచీపురము ఓరుగంటి కాకతి రాజన్యులకు వశమైనది. అయితే కాకతి రాజన్యుల కింకా చాలా పూర్వమునుంచే ఆనగరము ద్రవిడాధిపతులకూ, ఆంధ్రాధిపతులకూ కలహకారణము. ఉభయులూ దాని నిమిత్తమే చాలాసారులు పోరాడినారు. చోళవంశ్యులయిన నెల్లూరి రాజులు అనేకులు కాంచీపురవరేశ్వరులే. విజయ నగరాధీశ్వరులకు పూర్వమా నగరము ద్రవిడాధిపతుల వశములోకాని ఆంధ్రనరేశ్వరుల వశములోగాని శాశ్వతముగా ఉండలేదు. అది చాలా తడవలు చేతులు మారుతూ వచ్చింది. నెల్లూరి మనుమసిద్ధి భూపాలుని తండ్రి తిరుకాళమహీపతి కాంచీపురము నేలినవాడే. కాకతి రాజన్యులలో గణపతి క్ష్మాపాలుడు కాంచీపురము జయించి పాలించినవాడే. మళ్ళీ అది వారి అధికారములోనుంచి జారిపోతే దానిని తిరుగ జయించినవాడు కాకతి ప్రతాపరుద్ర చక్రవర్తి. ప్రతాపరుద్ర దేవుని సైన్యాధిపతి ముప్పిడి నాయకుడు వెలమ, రెడ్డి కమ్మదొరలతో దండుగూర్చుకొని వెళ్ళి కాంచీపురమును ఆక్రమించుకొన్న మధుర పంచపాండ్య భూవరులతో భయంకరయుద్ధముచేసి వారినోడించి పారదోలి కాంచీపురము పట్టుకొన్నాడట. నాటినుంచి రెడ్డిమన్నీలూ, వెలమ నాయకులూ పాండ్యరాజ గజసింహ, పంచపాండ్య దళవిభాళ బిరుదాలతో విభూషితులైనారు. సామాన్యులా వారు ! ఈ కాంచీపుర మహా సంగ్రామములో వెలమ నాయకులుచూపిన శౌర్య ప్రతాపములు అనుపమానమైనవట. అందుకు సందేహమేమిటి ? కూకటి ముడికి కురులు కూడని పిన్నటి నాటి నుంచీ వెలమ బిడ్డకు

కదనమె బొమ్మరిల్లు చెలి
కత్తెలె వీరజయాంగనా మణుల్
మదకరి మస్త కుంభములు
మాటికి దొంతులు సంగరస్థలిన్
గుడికొనివడ్డ రాహుతుల
క్రొవ్వులు గుజ్జనగూళ్లు

నట - విన్నావా ? ఈ వెలమ వారిలో రేచర్ల దాచానాయడట విజయశ్రీ సంపాదించినవాడు. ఈతని సంతతివారు ఈతని యీ విజయాన్ని ఎట్లా అభివర్ణించారో చూడు :

యో బాణైర్మండలం కృత్వా
గజవేద్యాం జయశ్రియా
తేజోనవై పాండ్యదర్పం
హృత్వా హస్తం సమగ్రహీత్.

దాచానాయని సంతతివారు ఆవిధంగా అతనివల్లనే విషయము చేపడిందని చెప్పినా ఇతర నాయకులెవ్వరూ ఏమీ శక్తి సామర్థ్యాలు చూపలేదనుకోవడము పొరపాటు. తెలుగు నాయకులందరూ పులిపిల్లలే; అందువల్లనే పంచపాండ్య దళాలను పంచబంగాళము చేయడము సుకరమైనది. అంతేకాదు, పాండ్య ధరావగులను తిరుచునాపల్లి జిల్లాదాకా తరుమగొట్టినారు తెలుగు నాయకులు. ఈ విధముగా తరుమగొట్టినవారిలో సర్వసేనాధిపతి ముప్పిడినాయకుని ప్రధానసేనాని దేవరినాయనింగారు ముఖ్యులు. దేవరినాయనింగారి శాసనము తిరుచునాపల్లి తాలూకా తిరువానైక్కావల్ గ్రామములోని జంబుకేశ్వరస్వామి ఆలయములో గ్రంథాక్షరములతో తెలుగు భాషలో వ్రాసి ఉన్నది. (ఈ శాసనము చెడిపోయింది కొంత.) దానిని ఈ క్రింద పొందుపరుస్తున్నాను. ఇది అసమగ్రము.

౧. .........మేశ్వర కాకతీయ ప్రతాపరుద్రదేవ మహారాజులు.

౨. .........ముగాను పృథివీరాజ్యం సేయుచుణ్డగాను ఆ రాజే.

౩. .........శ్రీ మత్కాకతిరాయ స్థాపనాచార్య స్వామి.

౪. .........గారి కొడుకు దేవరినాయనింగారు దక్షి.

౫. ...............వచ్చి ఏ (?) నుగులు మోహరిఇచ్చిన పోట్టిలాట్ట.

౬ .........తిరువది కుట్ట్రాము వీరక్షేత్రానను వీర పాణ్డ్యని....మలైయాళ తిరువడి.

౭. ...............నుకులాను సహ శ్రీజనిశ్యని (?)చు (సు?) న్దర పా—

కాకతి ప్రతాపరుద్రదేవ చక్రవర్తి నాటి ఆంధ్రవీరుల పౌరుషప్రతాపాలకు తిరువానైక్కావల్‌లోని జంబుకేశ్వరస్వామియే సాక్షి. తెలుగువారికి పూర్వకాలము నుంచీ తూర్పున ఉత్కలులతోను, దక్షిణాన ద్రావిడులతోను కటిక, కాంచీపుర ప్రాంతములు జగడము కల్పిస్తూనే ఉన్నవి. ఇది వింత కాదు ?

## ౪

ఇదీ మన పూర్వులు తెలుగువారి విజయగాథ.

ఆ తెలుగు జోదుల సంతతివారము మనము ఇప్పుడెట్లాగున్నాము ? గుండెమీద చేయివేసికొని స్థిమితముగా ఆలోచించుకో నీవు.

ఒకప్పుడాశ్రయ మిచ్చినవాడవు ఇప్పుడాశ్రితుడవు; ఒకప్పుడు శాసించినవాడవు ఇప్పుడు శాసితుడవు; ఒకప్పుడు స్వతంత్రుడవు ఇప్పుడు దాసుడవు; ఒకప్పుడు సర్వశక్తి సంపన్నుడవు; ఇప్పుడు శక్తిహీనుడవు.

ఇప్పటి నీ పరిస్థితికి ఏమిటి కారణము ?



# భాషాప్రయుక్తరాష్ట్రములు

**శ్రీ కళా వెంకటరావు**

భాషాప్రయుక్త రాష్ట్రముల పునర్నిర్మాణ విషయమై సర్. బి. రావుగారు ఈమధ్య ప్రచురించిన ప్రణాళిక క్రొత్తదిగాదు. వారి సలహాలీ తీరుననే యున్నవని నాలుగైదు నెలల క్రితమే పత్రికలల్లో ప్రకటింపబడినది. రాష్ట్రముల పునర్నిర్మాణ సమస్య, పలుభాషా సమాఖ్యగల రాష్ట్రములయందు తీవ్రరూపమును దాల్చినది. ఈ తీవ్రభావములను, మాంటాంగు, ఛెంసుఫర్డు నివేదికలోను, సైమన్ కమిషన్ రిపోర్టులోను, గుర్తించియే యున్నారు. ఆ సందర్భములనుగురించిన వివరములు ఇదివరకే పత్రికా ముఖమున ప్రకటించియే యున్నాను. 1919 గవర్నమెంటు ఆఫ్ ఇండియా చట్టములో 1935 గవర్నమెంటు ఆఫ్ ఇండియా చట్టములోను రాష్ట్రములను పునర్నిర్మాణముచేయుటకు అనువు కల్పించియున్నను, రాష్ట్ర ప్రభుత్వములుగాని, భారత ప్రభుత్వముగాని ఈసందర్భమున చర్యతీసుకొనియుండకపోవుట కడు విచారమగు సంగతి.

నూతన భారత రాజ్యాంగ విధానమును చిత్రించుటకు రాజ్యాంగ పరిషత్తు నేడు కృషి చేయుచున్నది. ఈ సందర్భములో ఇట్టి ప్రధాన సమస్యను ఎదుర్కొని సాధించుట యుక్తమగునుగాని, సర్. బి. యన్. రావుగారు సూచించినటుల, మధ్య పంథాలను త్రొక్కుట అవివేకము, అన్యాయము, అని స్పష్టీకరింపవచ్చును.

సర్. బి. యన్. రావుగారియొక్క స్కీము వలన నూతన రాష్ట్రములకు ఆర్థికముగగాని, రాజకీయముగగాని ప్రత్యేక లాభము చేకూరదు: పలుభాషలుగల రాష్ట్రములలో, భాషా ప్రతినిధులకు కలుగబోవు సంఘర్షణ ప్రస్తుత పరిస్థితులకన్న తీవ్రతరము కాగలదు: ఒకే గవర్నరు యుండుటవలన ఖర్చు తగ్గగలదన వచ్చును; సరిహద్దుల సమస్య చులకన కాగలదనవచ్చును: కాని యివి పాటింపదగిన విషయములు కావు:

రాబోవు రాష్ట్ర రాజ్యాంగ చట్ట స్వరూపములలో ప్రస్తుత పద్ధతిని హెచ్చు జీతమును, ప్రత్యేక రాజ్యాధికారములునుగల, గవర్నరు పదవులుండునని అనుకొనుటకు వీలులేదు. నూతన రాజ్యాంగములో రాష్ట్రపతి ప్రజలచే ప్రత్యక్షముగా నెన్నుకొనబడి, నియమితాధికారములను మాత్రమే కలిగియుండును. కావున ఒకే గవర్నరు క్రింద, ఆంధ్ర తమిళ రాష్ట్ర భాగములను సమీకరించవలసిన ఆవశ్యకత యుండదు. రాబోవు భారత సమాఖ్యలో, అంతర్భాగమగు, ప్రతి రాష్ట్రమును సంపూర్ణ స్వరూపముగల ప్రజాస్వామ్యము (రిపబ్లిక్) గానే నుండుటయె యుక్తము.

ఏర్పడబోవు రాష్ట్రముల సరిహద్దుల నిర్ణయించుటలో కష్టముగలదని, అందువలన కలుగబోవు ప్రజాందోళన, వైషమ్య కారణమని యూహించుటకూడ సరియైనదికాదు. సరిహద్దు

లను నిర్ణయించుట విషయమై నిర్ణీతమైన సిద్ధాంతములున్నవి. ఆ సిద్ధాంతముల ననుసరింప వచ్చును: ద్విభాషా ప్రాంతములును, రాజధానీ నగరసమస్యయు గలవు. ఇవి రెండు పద్ధతులపై పరిష్కరించవచ్చును: ఒకటి పంచాయతీకి అంగీకరించుట; రెండు అచ్చటి ప్రజల వోటుతీసుకొని మెజారటీ అభిప్రాయమును అంగీకరించుట. ఈ రెండు పద్ధతులకును ఆంధ్ర తమిళనాయకులలో పలువురు ముఖ్యులు అంగీకరించియే యున్నారు.

కావున సర్. బి. యన్. రావుగారు, ఊహించిన కష్టములును లేవు: ఉన్నను పైన చెప్పినటుల పరిష్కరించను వచ్చును:

ఫెడరేషన్ సంస్థాపించునపుడు, అంతర్భాగములగు రాష్ట్రములకు ఒక ప్రత్యేకత, వ్యక్తిత్వ పూర్ణ విభజనవలననే చేకూరగలదు. లేనిచో, ఆస్ట్రియా - హంగేరీలోను, జుగోస్లావియా, క్రోషియాలోను, యితర ఐరోపా రాష్ట్రములలోను జరిగిన విషాద సంఘటనలే మనకు ప్రాప్తించగలవు. రావుగారి ప్రణాళికకు మూల సూత్రములు, పైనచెప్పిన దేశముల రాజ్యాంగ ప్రణాళికలే. కావున ఆసూత్రములు మనకు నచ్చవు: లాభింపవు:

రాజ్యాంగ పరిషత్తునకు, భారత సమాఖ్యలో ఏ రాష్ట్రము లుండవలెనో పేర్కొనే హక్కు సహజముగా, గలదు. ఇట్టి హక్కు లేదనుట హాస్యాస్పదము: ఈ సంగతి రాజ్యాంగ పరిషత్తులోని ప్రధాన నాయకులు గుర్తించిరి. మనమిపుడు యీ సందర్భమును పూర్తిగా వినియోగించుకొని, స్వయంపోషకముగను, భాషా ప్రయుక్తముగను నిర్ణీత స్వరూపముతోను, ప్రజాస్వామికముగను నూతన ఆంధ్ర రాష్ట్రమును నిర్మించుకొనుట భావ్యముగాని, సర్. బి. యన్. రావుగారు సూచించిన తృతీయ పంథాను అంగీకరించుట యెంత మాత్రము పాడిగాదు. సత్వ రాంధ్రరాష్ట్ర స్థాపన సాధ్యము: తథ్యము: నిశ్చయము: పెద్దలు పిన్నలు ఏమరుపాటులేకుండ యుండుట మాత్రమే కావలసినది.



# ప్రత్యేక ఆంధ్రమహాసభ సమావేశము

## చెన్నపురి

## ఏప్రిలు 4, 5 తేదీలు 1947

### అధ్యక్ష శ్రీ రాజా రంగయ్యప్పారావు బహద్దరు, ఎం. ఏ.,

### ఉయ్యూరు యువరాజా అధ్యక్షోపన్యాసము :

ఆంధ్ర సోదర సోదరీమణులారా !

భారత రాజకీయములు విశేషముగా పరివర్తన నొందుచున్న సమయమున ప్రత్యేకముగా ఆహ్వానింపబడిన ఈ మహాసభకు అపారమైన ప్రేమాభిమానములతో నన్ను అధ్యక్షునిగా ఎంచుకొనిన తమ యెల్లరకును కృతజ్ఞతాభివందనము లర్పించెదను.

నిరుడీరోజులలో గుంటూరులో జరిగిన ఇరువదినాల్గవ ఆంధ్రమహాసభకు పిమ్మట ఈ కొలదికాలములో దేశ నాయక ప్రముఖులు కొందరు పరమపదించినారు. హైందవ సంస్కృతికి అఖండమైన ప్రోదిచేసిన మహనీయుడు పండిత మదనమోహన మాలవ్యాజీ ఈ సందర్భమున ముఖ్యముగా స్మరింపదగినవాడు. ఆధునికాంధ్ర సారస్వత వృద్ధులలో పన్నెకెక్కిన కవిచక్రవర్తి చిలకమర్తి లక్ష్మీనరసింహముగారును; పత్రికా సంపాదకుడుగ, రచయితగ, వాణిజ్య నిపుణుడుగ, చలనచిత్ర దర్శకుడుగ, నిర్మాతగ, ఎనలేని ఖ్యాతిగాంచిన సమర్థుడు సరసుడునగు గూడవల్లి రామబ్రహ్మముగారును; ఆంధ్ర నట లోకమునకు అతిమాత్రమగు అంతర్జాతీయ యశమునార్జించిన ఆంధ్ర నాటక కళాప్రపూర్ణులు రావుసాహెబు తాడిపత్రి రాఘవాచార్యులుగారును అస్తమించినారు. లక్ష్మీనరసింహముగారు పండుపండిన పెద్దలేగాని వారి లేఖినికిమాత్రము నవశము తలుగలేదు. రామబ్రహ్మముగారిది కేవలము అకాల మరణము. మదరాసు ఆంధ్రులలో వారు లేని లోటు నేడు స్పష్టముగా గోచరించుచున్నది. నాటకకళా ప్రపూర్ణుని యశోధ్వజముగా ఆంధ్ర నాటక కళాపరిషత్తు విజయవాడలో 'రాఘవ కళామందిరము' నిర్మింప తీర్మానించి తనధర్మము లెస్సగా నిర్వహించుచున్నది.

ఐతరేయ బ్రాహ్మణమునకు పూర్వమునుండియు అభ్యుదయ పరంపరాభివృద్ధిగ వచ్చుచున్న ఆంధ్రజాతి ప్రాచీనతనుగూర్చి గాని, శాలివాహనునివంటి శకపురుషునిగని, కనకవర్షములు కురిపించిన ఆంధ్రజాతి చరిత్ర ప్రశస్తిని గూర్చిగాని, బోధాయన ఆపస్తంబాది సూత్రకారులను, విద్యారణ్యాది భాష్యకారులను మల్లినాథాది వ్యాఖ్యాతలను, కౌటిల్యాది శాస్త్రకారులను, విద్యానాథ పండితరాయాద్యలంకారికులను కన్న ఆంధ్రజాతి దిషణాధురంధరతను గూర్చి గాని, ఖండాంతర విఖ్యాతిగాంచిన ఆంధ్రుల నౌకావాణిజ్య సంపదనుగూర్చి గాని, మగధనుండి మధుర తంజావూరుల వరకును, విజయనగరమును నిర్మించి విశాలాంధ్ర సామ్రాజ్యమును పాలించిన ఆంధ్రుల సాహసౌదార్య విక్రమ విశేషములగూర్చి గాని, అజంతా ఎల్లోరా నాగార్జునగిరి అమరావతీ హంపీ విజయనగరాది చిత్రశిల్పముల రచించి నిర్మించిన నాగార్జున జక్కనాచార్యాది మంత్రద్రష్టలగు శిల్పబ్రహ్మలను గన్న ఆంధ్రజాతి శిల్పమహత్వమును గూర్చి గాని, త్యాగరాయాది వాగ్గేయకారులను గన్న ఆంధ్రజాతి లలితకళా వైభవమునుగూర్చి గాని; Italian of the East అని పాశ్చాత్యశబ్ద తత్త్వవేదులగు పండితులచేతను, 'దేశభాషలందు తెలుగు లెస్స'యని శ్రీనాథాది మహాకవి సార్వభౌములచేతను స్తుతింపబడి, నన్నయ తిక్కనాది కవీశ్వరులగన్న ఆంధ్రభాషాలాలిత్య విలాసముల గూర్చి గాని, ఏతంగుణ గణవిశిష్టమైన ప్రాచీనాంధ్రసంస్కృతీ వైభవము నెవ రేవిధముగా ప్రస్తావన చేయబూనినను దానికి భరతవాక్యమనుమాట ఉండదు. పూర్వమును స్మరించుకొన్న ఆంధ్రులకు గర్వకారణము కానిదిలేదు.

ఆంధ్రులకు ఆంధ్రరాష్ట్రము జన్మస్వత్వము. భారతీయులకు స్వరాజ్యమెట్లో ఆంధ్రులకు స్వరాష్ట్రమట్లు. ఇది ఆంధ్రులకే కాదు, అన్నిభాషల వారికిని; భాషా ప్రయుక్తములగు అన్ని ప్రాంతములవారికిని. దీనికి పూర్వపక్షములేదు. ప్రభుత్వము, కాంగ్రెసు, ప్రజలు ఏకవాక్య

ముగా దీని నంగీకరింతురు. కాని ఆంధ్రులకు ప్రత్యేక రాష్ట్రము ప్రయత్నించిన కొలది దూరమగుచున్నది. బలమునందు గాని, బలగమునందు గాని, ఏ యంశమునందును మనకు సాటిరాని, సింధు ఒరిస్సాలవారికి అందు అయాచితముగ నొకరికి, అల్పప్రయత్న మాత్రమున నింకొకరికి రాష్ట్రములు సిద్ధించినవి. నిజమునకు, మనము ఆంధ్రరాష్ట్రోద్యమము నారంభించునాటికి వారికా చైతన్యమే లేదు. ఎంత తక్కువగా జూచినను ఆంధ్రరాష్ట్రములో చేరదగిన 67,500 చతురపుమైళ్ల వైశాల్యముగల భూమి, 2½ కోట్ల జనసంఖ్య, ఎనిమిదికోట్ల ప్రభుత్వాదాయము, అపారమగు ఆర్థిక ఖనిజ సంపద, జలాధారములు కలిగి ప్రత్యేకాంధ్రరాష్ట్రము స్వయంసమృద్ధమని ఋజువు చేయబడినది. భాషాయోగ్యత సామాన్యమైనది కాదని లోకమే గుర్తించినది. ఇవిగాక, ఇంకను కావలసిన సౌకర్యములు సమస్తమును గలవు. అయిన నేమాయె? అంగడిలో నన్నియుగలవు, "అల్లుని నోటశని" యన్నట్లు ఇన్నియుండియు మనకు రాష్ట్రములేదు. మన తిండి మనము తిని మన బ్రతుకు మనము బ్రతుకుటకు స్వతంత్రతలేదు. మన కష్టమునకుగాని మన సుఖమునకు గాని మనము యజమానులము గాము. ఈ దుస్థితికి కారణము మన దురదృష్టమో మన పురాకృతఫలమో లేక మన యసాధారణ ప్రవృత్తిఫలమో చెప్పలేము.

ఇది యిట్లుండ, మన రాష్ట్రవాంఛను పాకిస్థాను వాదముతో ముడిపెట్టి కొందరు విపరీతముగా వాదించుచుందురు. ముస్లిములు భారతజాతికంటె భిన్నజాతివారను సిద్ధాంతము లేవదీసి భారతదేశమునుండి విడిపడి సర్వతంత్ర స్వతంత్ర రాజ్యమును స్థాపించు నుద్దేశముతో ప్రచారమునకు వచ్చినది పాకిస్థానువాదము. ఆంధ్ర రాష్ట్ర సమస్య అట్టిదికాదు. చాల పురాతన సమస్య. హార్డింజిప్రభువు నాటనుండి అనగా 1911 నుండి ప్రభుత్వామోదము పొందిన భాషాప్రయుక్త రాష్ట్రసిద్ధాంతము ననుసరించునది. ఆంధ్రులు తాము భారతజాతికంటె భిన్నుల మనుటలేదు. భారతరాజ్యాంగమునుండి విడాకులు పుచ్చుకొని ఆంధ్రరాష్ట్రమును సర్వతంత్ర స్వతంత్రరాజ్యముగా నిర్మాణము చేయ గోరుట లేదు. భాషాప్రయుక్తరాష్ట్ర విభజనము నిట్లు ప్రభుత్వము, కాంగ్రెసేగాక, హిందూ మహాసభ, ముస్లిం లీగు, కమ్యూనిష్టు, సోషలిష్టు, రాడికల్ పక్షములు మున్నగు మతరాజకీయ సంస్థలుకూడ ఆమోదించుచు, ఈ సిద్ధాంతము ననుసరించియే తమ తమ సంఘముల నిర్మాణము చేసికొనుచుండుట ప్రత్యక్ష ప్రమాణమే గదా! పాకిస్తాను వాదమునకును ఆంధ్రరాష్ట్రవాదమునకును సంబంధ సాదృశ్యము లెక్కడనో యోచింపుడు!

రాష్ట్రనిర్మాణమునకై మనము చేయుచున్న ఆందోళనమున రాయలసీమసోదరులు మనస్ఫూర్తిగ, ఏకగ్రీవముగ కలిసిరాకుండుట శోచనీయము. బుద్ధి పూర్వకములు కానివి, సమాలోచనతో, సమరసభావముతో సవరించుకొనదగినవి ఏవేవో చిన్నచిన్న లోపములు ప్రజారంగములం దనుభవమునకు వచ్చినంతమాత్రమున రాష్ట్రనిర్మాణమునకు వారు విముఖులు కారాదు. ఆంధ్రులైనవారు ఆంధ్ర రాష్ట్రములో నుండినప్పటికంటె, ఆంధ్రరాష్ట్రము కాదని సాధింపగల మేలు లవలేశమును ఉండబోదు. ఈ వాస్తవికసత్యమును గ్రహించిన అచటి సోదర ప్రముఖులు పలువురు ఆంధ్రోద్యమమునకు అఖండమగు బలసంపత్తి చేకూర్చుచుందురు. రాయలసీమ సోదరు లెల్లరును వారి మార్గమునే అనుసరింతురు గాకయని ఆశింతును.

ద్వితీయ ప్రపంచసంగ్రామ సమయమున ఆంధ్రరాష్ట్ర నిర్మాణసమస్య యుద్ధానంతరకార్య ప్రణాళికయందు విశేషప్రాముఖ్యము వహించునని ప్రభుత్వమే యిందుకు ముందుగా నడుముకట్టునని నమ్మినవారు గలరు. అందువలననే యుద్ధసమయమున రాష్ట్రసమస్యను గూర్చి ప్రభుత్వమును ఒత్తిడి చేయరాదను భావము కొందరిలో వ్యాపించియుండెను. యుద్ధము ముగిసినది. మిత్రమండలికి విజయప్రాప్తి కలిగినది. అనేక రాజకీయ సమాలోచనలు రాయబారములు తత్ఫలితముగా తీవ్రములగు నెన్నో మార్పులు జరుగ సాగినవి. తుదకు, బ్రిటిషు రాజనీతిజ్ఞుల ఔదార్యమువలననో, అంతర్జాతీయ రాజకీయ ప్రభావమువలననో దేశములో కాంగ్రెసు ప్రభుత్వములు నెలకొన్నవి. కేంద్రమున కాంగ్రెసు పట్టముక్రింద పండిట్ నెహ్రూ ఆధిపత్యమున తాత్కాలిక జాతీయప్రభుత్వ

యేర్పడి అంతర్జాతీయ ప్రశస్తినందుచు ముందుకు సాగిపోవుచున్నది. భారతదేశ భవిష్యద్రాజ్యాంగమును నిర్మించుటకు రాజ్యాంగనిర్మాణసభ యేర్పడి కొంత కలాపము నడపినది. రాజకీయ వాతావరణమున నెప్పుడేమి జరుగునో చెప్పరానంత వేగముగా క్షణక్షణ పరిణామములు కలుగుచున్నవి. ఈ సందిగ్ధసమయములలో మొన్నటి వరకును సర్ విజయాగారు అధ్యక్షులుగానుండి భారత రాజకీయములయందు ఆంధ్రమహాసభ కొక విశిష్టస్థానమును సంపాదించిరి. ప్రజాహృదయములను మహాసభ వంకకును, రాష్ట్ర సమస్య వంకకును అమితముగా ఆకర్షించిరి. ప్రభుత్వాధికారవర్గముల భావప్రపంచములలో మన ఉనికికి స్థావరము కలిగించుటకు వారుచేసిన విరామమెఱుగని ప్రయత్నము లెంతయు స్తవనీయములు.

ఏ కాంగ్రెసు మహాసభ భాషాప్రయుక్త రాష్ట్ర సిద్ధాంతము చిరకాలము క్రిందటనే ఆమోదించి, తదనుగుణముగ రాష్ట్రసంఘముల నిర్మాణముగావించి యింత కాలము నుండియు వ్యవహరించుచున్నదో ఆ కాంగ్రెసే గదా నేడు ప్రభుత్వము చేయుచున్నది! కాంగ్రెసుతో మన ఉద్యమమునకు గల సంబంధముకూడ అత్యంత సన్నిహితమైనదిగదా! మన కోరిక తీరుటకు, మన రాష్ట్రము సిద్ధించుటకు ఇంతకంటె అనుకూలసమయమేముండును? ముప్పది యేండ్లనుండియు మనము చేయుచున్న కృషి ఫలోన్ముఖమగు తరుణము వచ్చినది. దీనిని మించిపోనీయక మహాసభ సమర్థముగ సర్వశక్తి సంపన్నముగ పనిచేసి, ఆంధ్రరాష్ట్రమును ఇప్పట్టుననే సాధించి తీరవలయును. కాంగ్రెసు అధినేతలును ప్రసన్నులై ఆంధ్రుల చిరకాల వాంఛితమును నెరవేర్చుట ధర్మము.

1941 వ సంవత్సరమున విశాఖపట్టణములో సర్ విజయాగారి నాయకత్వమున జరిగిన ఆంధ్ర మహాసభా సమావేశములో అప్పటికి రాష్ట్రీయశాసన సభలలో ఆమోదింపబడిన ఆంధ్రరాష్ట్ర నిర్మాణ తీర్మానమును గూర్చి తెరవెనుక జరిగిన కొన్ని యుదంతములు పూజ్యులైన శ్రీ ప్రకాశము పంతులుగారు ప్రకటించిరి. ఆనాడు పంతులుగారు వెల్లడించిన కథనములు వినుచుండిన సభ్యుల కెల్లరకును, అమితమగు వేదనతోపాటు ఈసారి పంతులుగారు ప్రధానిగైన పక్షమున ఆంధ్ర రాష్ట్రము సిద్ధించి తీరునను ఆశయు జనించినది. కాని, మన నాయకులైన ప్రకాశం పంతులుగారు రాష్ట్ర ప్రధానిగా యుండగా మనకు రాష్ట్రము సిద్ధించక పోవుటయు, రాష్ట్రము సిద్ధించక పూర్వమే ఇంతలో పంతులుగారు ప్రధానామాత్యపదవిని త్యజించవలసిన పరిస్థితులేర్పడుటయు నిజముగా మన దురదృష్టము. ఐనప్పటికిని, ఇదియూ నొక విధముగ ఆంధ్రులకు, ఆంధ్రోద్యమమునకు మేలను కొనవచ్చును. ఏమనిన, ప్రధానామాత్య పదవిలోనుండినప్పటి శృంఖలములు పంతులుగారి నిప్పుడు బాధించవు. కావున, విశాలతరమగు ప్రజారంగమునందుండి, తమ యనుభవములనన్నిటిని సమన్వయము చేయుచు రాష్ట్ర సంపాదనోద్యమమునకు నాయకత్వము వహించి ఆంధ్రుల చిరవాంఛితమును సఫలమొనర్చి అశేషాంధ్ర ప్రజానీకపు మన్ననలనంద గలరని ఆశింతును. నిరటు కాంగ్రెసు మహాసభా సందర్భమునను, కార్యవర్గ సమావేశములోను, రాజ్యాంగసభా సమావేశములయందును మన నాయకు లెంత శ్రమపడినను, ఆంధ్రరాష్ట్ర నిర్మాణ విషయము పొందుచున్న ఆదరము మిక్కిలి శోచనీయమగుచున్నది. ప్రసంగవశమున నిటీవల ఆంధ్రరాష్ట్ర నిర్మాణమున కింకను కొంత కాలవిలంబము తప్పదను భావముకూడ కాంగ్రెసు అధిష్ఠానవర్గము బహిర్గతము గావించెను. అది తడవుగా డాక్టరు పట్టాభి సీతారామయ్య పంతులుగారు అట్టి కాలవిలంబమున కావశ్యకము లేదనియు రాష్ట్రనిర్మాణ మవశ్య కర్తవ్యమనియు అపూర్వములగు ధైర్యోత్సాహములతో నుద్ఘాటించి, తదాది విరామము లేకుండ ప్రచార ప్రబోధముల గావించుచున్నారు. ఆచార్యరంగా గారును, ఢిల్లీలోనున్న రాజ్యాంగసభా ఆంధ్రసభ్యుల నందరను సమీకరించి తాత్కాలిక ప్రభుత్వోపాధ్యక్షులగు నెహ్రూజీ వద్దకు రాయబారము గొంపోయిరి. ఈ సందర్భమున కేంద్రములో పీఠము పెట్టుకొని, అటు కాంగ్రెసు అధిష్ఠాన వర్గమునందును, ఇటు రాజ్యాంగ సభయందును డాక్టరు పట్టాభి, ఆచార్యరంగా, కళా వేంకట్రావు, దుర్గాబాయి, అనంతశయనం ప్రభృతులు చేయుచున్న కృషి ప్రశంసార్హముగ నున్నది.

రాజ్యాంగ సభానియుక్తులైన సర్ బి. యన్. రావు కమిటీవారు భాషా ప్రయుక్తరాష్ట్ర నిర్మాణ సమస్యను

గూర్చి యొక ప్రణాళికను సిద్ధపరచిరి. చెన్ననగరమును తత్పరిసరములను ప్రత్యేకమండలముగా విడదీసి నగరమున కుత్తరభాగము నొకరాష్ట్రముగను దక్షిణభాగము నొక రాష్ట్రముగను విభజన చేయవలయునని ఈ ప్రణాళిక సూచించుచున్నది. దీనికి ప్రత్యేక శాసనసభలు, మంత్రివర్గములు నుండును. గవర్నరు మద్రాసులోనే యుండును. రెండు శాసనసభల నుండియు, మద్రాసు మండలము నుండియు వచ్చిన ప్రతినిధులతో నేర్పడిన సమష్టి శాసనసభయు, సమష్టి మంత్రివర్గమును ప్రభుత్వ నిర్వహణమున గవర్నరుకు తోడ్పడుచుండును. సమష్టి వ్యవహారములలో తప్ప, ఏరాష్ట్ర విషయములు ఆరాష్ట్ర మంత్రివర్గ సభ్యుల సలహాల ననుసరించి గవర్నరు పాలించుచుండును. ఏరాష్ట్రవాసులా రాష్ట్రీయభాషలో వ్యవహరించు కొనవచ్చు నటకూడ! ఇటీవల బెజవాడ పురపాలక సంఘమువారి సన్మానమునకు సమాధానము నొసగుచు మదరాసు గవర్నరుగా రిట్టి పథక మొకటి చర్చలో నున్నట్లు వెల్లడించిరి. బహుశః వారి ప్రకటనకీ ప్రణాళికాంశములే ఆధారములై యుండును. ఆంధ్రరాష్ట్రమా? తమిళరాష్ట్రమా? నామకరణము చేయలేదు తప్ప, ప్రస్తుతమున్న మద్రాసు రాష్ట్రమును చెక్కుచెదర నీయకుండ, భాషాప్రయుక్త రాష్ట్రవాదులమగు మనలను కొంతవఱకైనను తృప్తిపఱుప వలయునను ప్రయత్న మందు లేకపోలేదు. వీని ఫలితాంశ మేమన, మనకు కొన్ని క్రొత్తపదవులు, క్రొత్త అధికారములు, క్రొత్త అవకాశములు లభింపగలవేగాని, మనముకోరు ఆంధ్రరాష్ట్ర స్వరూపమందు పూర్ణముగ సాక్షాత్కరించుటలేదు. భారతదేశమున భాషాప్రయుక్త రాష్ట్రములుగా విభజింప బడవలసినవి, బొంబాయి, మద్రాసు రాష్ట్రములలోను, నైజాము, మైసూరు, తిరువాన్కూరు, కొచ్చిన్ సంస్థానముల యందును, వ్యాప్తములైయున్న ఆంధ్ర, తమిళ, కర్ణాటక, కేరళ, మహారాష్ట్ర ప్రాంతములు. సంస్థానముల వ్యవహారము పరిష్కరించు కొనుట ఇంతలో సాధ్యముకాదు గనుక, బొంబాయి, మద్రాసు రాష్ట్రములనైనను, భాషా ప్రయుక్తములుగా పునర్విభజన చేయవచ్చును. అమాత్య ప్రణాళికయందు 'ఏ' గ్రూపులోనున్న వీనికి ఒక రాజ్యాంగ విధానమును నిర్ణయించి భాషా ప్రయుక్త రాష్ట్ర నిర్మాణమునకు సన్నాహములు చేయవచ్చును. ఇప్పటికైనను మించిపోయినది లేదు. రాజ్యాంగసభయు, అద్దాని సూత్రధారణము వహించు కాంగ్రెసు 'అధిష్ఠాన వర్గమును మేలు దలంచెనేని రాష్ట్రనిర్మాణ మొక ఘనకార్యము కాదు.

శ్రీ శంకరరావుదేవు ప్రోద్బలమున నేర్పడిన భాషాప్రయుక్తరాష్ట్రసమితి సమాచారములును ఈ సందర్భమున ముఖ్యముగా గమనార్హములు, కాంగ్రెసును, రాజ్యాంగ నిర్మాణసభను సత్వరభాషాప్రయుక్త రాష్ట్ర నిర్మాణ కార్యమునకు అభిముఖము గావించి, ఏతన్నిర్మాణమును వేగిరింప జేయుటే దీని ఆశయము. ఢిల్లీలో ఇటీవల సమితి సమావేశమున జరిగిన తీర్మానములు ఎసెంబ్లీ నాయకులకు పంపబడినవి. శ్రీ శంకరరావుదేవు కాంగ్రెసు ప్రధాన కార్యదర్శియగుట దీని ఆశయ సంసిద్ధికి మిక్కిలి ఆనుకూల్య మేర్పడినది. ఈదేవు సమితి నిర్మాణారంభము నుండియు డాక్టరు పట్టాభి సారథ్యమును దీని కభిలషించుట డాక్టరుగారి సామర్థ్యమును, ఆంధ్రుల భాషాప్రయుక్త రాష్ట్రవాద ప్రాచీనతను గుర్తించియేనై యుండవలెను. వీరి ఉభయుల సారథ్యమున నీసమితి కాంగ్రెసు నాయకత్రయమగు పటేల్ నెహ్రూ కృపాలినీల ఆమోదమును సంపాదించి గమ్యము చేరగలదనుట నిశ్చయము. ఈ సందర్భమున ఆంధ్రమహాసభా మిత్రులు కొందరీసమితికి ఆంధ్రశాఖనుకూడ ప్రారంభించి అమితోత్సాహముతో నిర్వహించుచున్నారని తెలుపుటకు సంతోషమగు చున్నది.

రాజ్యాంగసభా సందర్భములందు కేంద్రస్థానమగు ఢిల్లీలో ఆంధ్రమహాసభా కార్యస్థానమును నెలకొల్పి నిర్వహింప కార్యవర్గము సంకల్పించినది. రాజ్యాంగసభయందలి ఆంధ్రసభ్యుల సహకార సంపత్తిని సంపాదించియు, ఏతత్సభా సభ్యులందరకును, అధ్యక్షులకును ఆంధ్రరాష్ట్ర నిర్మాణ ప్రోద్బలకములగు సమస్త సమాచార సామగ్రియును సమకూర్చి సమర్పించు చుండుటకును, ఈ కార్యస్థానమున కొందరు కార్యసచివులుందురు. ఇంతేకాక ఆంధ్రమహాసభాపక్షమున తాత్కాలిక ప్రభుత్వ మంత్రుల యొద్దకును రాజ్యాంగసభా

కార్యకర్తకడకును రాయబారములుపంపుటకు, ప్రత్యేక నివేదికలు సమర్పించుటకు ప్రయత్నములు జరుగుచున్నవి. అమిత వ్యయభరితమగు ఈ కార్యకలాపమంతయు నెఱపుటకు మహాసభచేసిన విజ్ఞప్తి నాదరించి కొందరు వదాన్యులప్పుడే విరాళవాగ్దానములు చేసిరి, జయపురము ఆంధ్ర మహాసభ వారిందు ముఖ్యులు. ఆంధ్ర జమీందారులు, భూస్వాములు, ధనికులు, ఎల్లరును, ఆంధ్రమహాసభ కిపుడు విరాళములిచ్చి తోడ్పడవలసి యుండునని విన్నవింతును. ఈ కార్యస్థానము పనిచేయుచుండినంత కాలమును ఆంధ్రులగు రాజ్యాంగ సభాసభ్యులును, నాయకులును, ఆంధరాష్ట్ర సమస్యను సర్వదా బలీయ మొనర్చు కార్యస్థాన నిర్వహణకు సర్వవిధ సహకారముచేయుట ధర్మమనియు విన్నవింతును.

సిద్ధాంతములను బట్టిగాని, అభిరుచులను బట్టిగాని, పోకడలను బట్టిగాని, మనలో మన కనేక భేదములుండవచ్చును. రాజకీయభావ భేదములుండవచ్చును. కాంగ్రెసు, హిందూమహాసభ ముస్లింలీగు, సోషలిష్టు, రాడికల్, అతివాద, మితవాద ప్రభృతి భిన్నభిన్న దృక్పథముల వారికెవరికైనను ఆంధ్రరాష్ట్ర సంపాదనావసరమున రెండభిప్రాయము లుండరాదు. ఆంధ్రులైన వారందరును త్రికరణశుద్ధిగ ఏకీభావముతో, ఏకాగ్రతతో అఖండమగు ఆందోళనము ప్రచారము చేయవలసిన సమయమిది. రాజ్యాంగసమావేశ దినములందు విశాలాంధ్రమునం దన్నిమూలలనుండియు ప్రజానీకము వేలకొలదిగ మహజరులు, టెలిగ్రాములు పంపి రాష్ట్రసంపాదనాసక్తమగు మన గాఢవాంఛను ఒక్కుమ్మడిగా వ్యక్తము చేయవలసి యుండును. ఇదియంతయు కేవలము లాంఛనప్రాయముగాదు. రాష్ట్రసంపాదనకు మనముచేయు తీవ్రప్రయత్నము.

సోదరులారా!

ఆంధ్రులమగు మనకు జనసంఖ్యయుండి, ప్రత్యేక ప్రాచీన సంస్కృతియుండి, చరిత్ర ప్రశస్తియుండి, విద్యావిజ్ఞానజ్యోతులుండి, సుజల సుఫల సస్యశ్యామల క్షేత్రసంపదయుండి, ఆర్థిక ఖనిజ నిక్షేపములుండి, పారిశ్రామిక వాణిజ్య సౌకర్యములుండి, రాజతంత్ర నిర్వహణశక్తియుండి, త్యాగముండి, ఔదార్యముండి అసమానమగు దేశభక్తియుండి సర్వసంపద్గుణగణసమృద్ధియుండి మన మేలరాష్ట్రముసంపాదించుకొన లేకున్నామో ఒక్కపరి యోచింపుడు! మనఉత్సాహమును, మనపట్టుదలను కడవఱకును సడలిపోనీయకుడు! మన ఔదార్యమును తన్నుమాలిన ధర్మము కానీయకుడు! మనలో ద్వేషవైరస్యములకు మారు సౌహార్దయ సామరస్యముల పెంపొందజేయుడు! లాఠీ దెబ్బలకు, తుపాకి గుండ్లకు, రొమ్ము లొడ్డుటయందును, కారాగృహ ప్రవేశ మహోత్సవములయందు, మనముచూపిన ధైర్యసాహసములకు, త్యాగశీలమునకు లోకము మెచ్చినది. నాయకులు మెచ్చుకొనిరి. ఇప్పుడు మనకుగల కార్యశూరత యెట్టిదో చూపి కృతార్థులము కావలె! కర్తవ్యోన్ముఖులు కండు!

ఆంధ్రవంశకర్తల ఆశీర్వచన బలమువలన ఆంధ్రమహాసభల రజతోత్సవ సమావేశములు ఆంధ్రరాష్ట్ర సంపాదన విజయోత్సవ సమావేశములుగా జరుపు భాగ్యము మనకు చిరకాలముననే ప్రాప్తించుగాకయని ఆశించుచు మహాసభా కార్యక్రమ నిర్వహణ కుపక్రమింతును.

ఓం సహనా వవతు
సహ నౌ భునక్తు
సహవీర్యం కరవావహై
తేజస్వినా వధీతమస్తు
మా విద్విషావహై.

# రాష్ట్రపతి అభిప్రాయం

# ఆంధ్రాశయాలకు గొడ్డలిపెట్టు

### ప్రత్యేకాంధ్ర మహాసభ ఆహ్వాన సంఘాధ్యక్షులు

## శ్రీ కర్లపాటి అప్పారావుగారి ఉపన్యాసం

ఆంధ్రసోదర సోదరీమణులారా! స్వాగతము, సుస్వాగతము. వ్యవధిలేకున్నను మా ఆహ్వానమును మన్నించి అనేక వ్యయ వ్యయాసలకు లోనై ఈ మహా సభకు అరుదెంచిన మీకందరకు ఆహ్వాన సంఘం తరఫున వందనములర్పిస్తున్నాను. నాకంటే వయస్సులోను అనుభవంలోను, ఆంధ్రరాష్ట్ర నిర్మాణంకోసం అనేక వత్సరాలుగా పాటుపడుతున్న పెద్దలు, మహామహులు ఎందరో ఉండగా, నన్ను ఆహ్వాన సంఘాధ్యక్షునిగా ఎన్నుకొని, గౌరవించినందుకు ఆహ్వాన సంఘంవారికి నా ప్రత్యేక వందనాలర్పింస్తున్నాను.

పరిపాలనాధికారం ప్రజలహస్తగతం కావటంతోనే భాషాప్రయుక్తంగా రాష్ట్ర విభజన జరుపుతామని కాంగ్రెసు అభయహస్తమిచ్చింది. భాషాప్రయుక్తంగా కాంగ్రెసు రాష్ట్రాలను సైతం నిర్మించి, ఆ సూత్రాన్ని ఆచరణలో పెట్టింది.

ఈ సూత్రాన్ని లక్ష్యమందుంచుకొనే ప్రత్యేకాంధ్ర రాష్ట్ర నిర్మాణంకోసం 1913 మొదలుకొని 24 మహాసభలద్వారా ఆందోళన చేస్తూ వచ్చాము. మదరాసు శాసనసభలలోను, ఎసెంబ్లీలోను అనేకసార్లు ఆంధ్ర రాష్ట్ర తీర్మానం ఆమోదించబడింది.

అయినప్పటికీ ఆంధ్రరాష్ట్రం ఇంతవరకు నిర్మాణం కాలేదు. జనసంఖ్య బట్టిచూచినా, ఆర్థికస్థితిని ఆలోచించినా, నైసర్గిక పరిస్థితులను పరికించినా, సంస్కృతీ సభ్యతలను తలపోసినా, పూర్వపు ఔన్నత్యమేకాదు నేటి అవసరమేకాదు, ఏవిధంగా చూచినా, ఆంధ్ర రాష్ట్ర నిర్మాణాన్ని కాదనటానికి వీలులేదు. ప్రత్యేక రాష్ట్ర నిర్మాణానికి ఆంధ్రులకున్న అవకాశాలు, సహజమైన సౌకర్యాలు తక్కిన వారెవ్వరికి లేవని చెప్పవచ్చు.

అయితే ఆంధ్రరాష్ట్రం ఇంకా అందని మానిపండుగానే ఉంది. మనకంటే ఎంతో వెనగ్గా రాష్ట్రోద్యమాన్ని ప్రారంభించిన ఉత్కళులకు, సింధు ప్రజలకూ, పత్యేకరాష్ట్రాలు సిద్ధించినవి. దీనికి కారణమేమి?

ఆంధ్రులలో దేశభక్తికి లోటులేదు. త్యాగానికి ఆంధ్రులు పెట్టినదిపేరు. కాంగ్రెసు ఆదేశాన్ని పాలించారు ఆంధ్రులు. మహాత్మాగాంధీ ఆజ్ఞలను శిరసావహించింది ఆంధ్రజాతి. అభ్యుదయ పరమైన అన్ని ఉద్యమాల్లోనూ ఆంధ్రలోకం ముందంజ వేసింది. స్వతంత్రం లేని స్వరాష్ట్రం పనికిరాదని, స్వరాష్ట్రం లేని స్వతంత్రం కూడా పనికిమాలినదని గ్రహించి, భారతదేశ స్వాతంత్ర్యానిక, ఆంధ్రరాష్ట్ర నిర్మాణానికికూడా ఏక కాలంలో పాటుపడుతూ వచ్చారు ఆంధ్రులు. అంతేకాకుండా స్వాతంత్ర్యంకోసం, స్వరాష్ట్రోద్యమాన్ని తాత్కాలికంగా వెనక్కి నెట్టటానికికూడా సంశయించలేదు. ఇందువల్ల ఆంధ్రులకు కలిగిన నష్టాలు, వాటిల్లిన కష్టాలు అనేకం అయినా వాటిని పాటించక అందరి బాగుకోసం పాటుపడ్డారు ఆంధ్రులు.

అయితే ఆంధ్రరాష్ట్ర నిర్మాణం ఇంతవరకు జరగకపోవడానికి ఆంధ్రులలో ఐకమత్యమనేది లేకపోవుటకు కారణమని మనవిచేయుటకు చింతిస్తున్నాను. ఈ అనైకమత్యం మూలాన్నే, రాష్ట్రం సిద్ధించకపోవటం అలా వుండగా, చేజిక్కిన ప్రధానామాత్య పదవిని సైతం మనం నిల్పుకోలేనివారమై, ప్రభుత్వంలో నాయకత్వాన్ని కోల్పోయినాము. ఈ పతితస్థితివల్ల ఇంతటనైనా మనం కన్నులు తెరిస్తే, కీడులో మేలుగా ఎంచవచ్చు.

భాషాప్రయుక్త రాష్ట్రనిర్మాణ సూత్రాన్ని ఏ నాటి నుంచో కాంగ్రెసు మహాసభయున్నూ, గాంధిమహాత్ముడున్నూ అంగీకరించి వుండగా, కాంగ్రెసు సంప్రదాయంలో పుట్టి పెరిగిన కాంగ్రెసు పెత్తనదారులు కొందరు

ఇప్పుడు ఈ ప్రధాన సూత్రాలకు వ్యతిరేకంగా మాట్లాడటం చాలా విపరీతంగా కనిపించకపోదు. ఈ మధ్యను రాష్ట్రపతి ఆచార్య కృప్లానీగారు చెన్ననగరంలో ఉపన్యసిస్తూ భాషాధారక రాష్ట్రవిభజన సూత్రాన్ని ఆక్షేపిస్తూ మాట్లాడినప్పుడు నా చెవులను నేను నమ్మలేకపోయినాను. ఇంతకాలం గడిచిన పిమ్మట, కాంగ్రెసు అధ్యక్షపీఠం ఆక్రమించివుంటే ఒక ఘననాయకుడు భాషాధారక రాష్ట్రసూత్రాన్ని మూలచ్ఛేదం చేస్తూ మాట్లాడటం ఆంధ్రాశయస్ఫూర్తికి గొడ్డలిపెట్టుగా మనం భావించక తప్పదు. ఇది ఆచార్య కృప్లానీగారి వ్యక్తిగతాభిప్రాయమే గాని, కాంగ్రెసు కార్యవర్గంవారి ఆమోదంతో, వారి పక్షాన వెల్లడించిన అభిప్రాయం కాదని నమ్ముతున్నాను.

మరొక్క విషయం మనవిచేసి, నా ఉపన్యాసాన్ని ముగిస్తాను. గత సంవత్సరం గుంటూరు ఆంధ్రమహాసభకు అధ్యక్షత వహించవలసిన సర్. విజయాగారు తమ అధ్యక్షోపన్యాసంలో చెన్ననగరపు తగాదా ఆంధ్రరాష్ట్ర నిర్మాణ సమస్యకు ఆటంకమైనట్టుంటే, చెన్ననగరాన్ని మనం వదులుకోవచ్చునని చేసిన సూచనకు హిందూ, ఎక్స్ప్రెసు మొదలైన పత్రికలు హర్షాంగీకారాలను ప్రకటించినవి. ఆంధ్రులకు చెన్ననగరంపైన గల హక్కులను గురించి నే నిప్పుడు చెప్పటం చర్విత చర్వణం అవుతుంది. చెన్ననగరమే గాక, తిరుపతివరకు కూడా తమిళదేశపు సరిహద్దు లుండవలెనని ఇటీవల ఈ నగరమందు సమావేశమైన తమిళనాడు రచయితల మహాసభవారు తీర్మానించారు. నేడు అమాత్యపదవుల నాక్రమించిన వారిలోకూడా కొందరీ అభిప్రాయాన్ని వెలిబుచ్చారు. సర్. విజయాగారు చేసిన సూచన ఈ సమస్య పరిష్కారానికి సాయపడదు. మద్రాసు ప్రభుత్వానికి అడ్వయిజరుగా పనిచేసిన సర్. నార్మన్ స్ట్రాతీగారు మద్రాసును ఢిల్లీవలె ప్రత్యేక రాష్ట్రంగా ఏర్పరచవలెనని ఒక సూచన చేసివుండిరి. ఉభయులకు ఉమ్మడి నగరంగా వుండవలెనని సర్. బి. యన్. రావుగారు మరొక సలహానిచ్చారు. కాబట్టి, నేటి మహాసభయందు సమావేశమైన పెద్దలు తామందరు ఈ విషయమై సావకాశంగా ఆలోచించి ఏదైనా ఒక నిర్ణయానికి రావలసిందని కోరుతున్నాను.

ఏమైనప్పటికీ, ఈ విషయం సరిహద్దు నిర్ణాయక సంఘం వారిద్వారా సమరసంగా పరిష్కరించుకోదగిందే గాని, మనలో మనం వివాదించుకోవలసిన అంశం కాదు.

మీరందరు మా ఆహ్వానాన్ని అంగీకరించి బహుశ్రమల కోర్చి విచ్చేసినందుకు మరొకసారి నా కృతజ్ఞతాపూర్వక వందనములను అర్పిస్తున్నాను.

# ఆంధ్రరాష్ట్ర పరిపాలన విధానం

424

శ్రీ మామిడిపూడి వెంకట

మన కోరికల ననుసరించి ఏర్పడబోయ్యే ఆంధ్రరాష్ట్ర పరిపాలన విధానం ఏలాగు ఉండవలెనను విషయము గురించి ఆలోచించుట అత్యవసరము. దీనినిగురించి విపులముగ చర్చించుట కిచట అవకాశము లేదు. ఈ చర్చలో ఏయే అంశములు ప్రధానములో సూచించుటయే నా ఉద్దేశము.

J1155

పరిపాలనాధికారములు :

నిర్మాణం కాబోయ్యే ఆంధ్రరాష్ట్రము అఖండ భరత ఖండములో ఒక రాష్ట్రముగ నుండునదేగాని, సంపూర్ణ స్వాతంత్ర్యముగల రాజ్యము కాదు. దీనిని పాలించువారు కొన్ని వ్యవహారములందుమాత్రమే సంపూర్ణాధికారము వహింతురు. తక్కిన వ్యవహారములన్నియు భరతఖండమునకు మొత్తముమీద ఏర్పడు కేంద్రప్రభుత్వముయొక్క అధీనమందుండును. ఏయే వవ్యహారములు కేంద్రప్రభుత్వపు అధీన మందుండవలసినదీ, ఏవి రాష్ట్రప్రభుత్వపు అధీనమందుండవలసినదీ కొంతవరకు బ్రిటిష్ మంత్రిత్రయము వారు గత సంవత్సరం మే తే 16 దీన ప్రకటించిన పథకములో సూచించియున్నారు. ఈ పథకము ననుసరించియే ప్రస్తుతము రాజ్యాంగపరిషత్తు వారు వారి కార్యక్రమమును సాగించుచున్నారు. ఈ పథకములో (1) దేశరక్షణ (2) విదేశ వ్యవహారములు (3) రాకపోకలకు కావలసిన సమస్త సాధనములు కేంద్రప్రభుత్వపు అధీన మందుండుట ఉత్తమమని చెప్పియున్నారు. ఇవిగాక, ఈ వ్యవహారములను చక్కగ సాగించుటకు కావలసిన ద్రవ్యోపపత్తి (Finance) కూడ కేంద్రప్రభుత్వమున కుండవలెనని వారు సూచించిరి. ఈ నాలుగు అధికారములు మినహాగా తక్కిన అధికారము లన్నియు రాష్ట్రప్రభుత్వములకు ఉండవలెనని వారి ఉద్దేశము.

కాని ఇట్టి విభజన శ్రేష్ఠముకాదని అనేకుల అభిప్రాయము. పై నాలుగు అధికారములే గాక మరి కొన్ని కూడ కేంద్రప్రభుత్వమున కుండుట అత్యావశ్యము. ముఖ్యముగా చెలామణి (Currency), బ్యాంకింగ్, ఆర్థిక ప్రణాళికలను తయారుచేసి అమలులో నుంచుట, కేంద్రప్రభుత్వపు అధీనములో ఉండవలెను. చెలామణి విషయములో—అనగా రూపాయలు, నోట్లు మొదలగు వాటి విషయములో - భరతఖండములోని ఒక రాష్ట్రమునకును ఇంకొక రాష్ట్రమునకును భేదముండినయెడల వర్తకవ్యాపారములకు అనేక చిక్కులు సంప్రాప్తించును. కాని ఈ విషయమునుగురించి ఎక్కువగ ఇచ్చట ప్రస్తాపించుటకు అవకాశము లేదు. రాజ్యాంగపరిషత్తు వారు దీనినిగురించి ఆలోచించుచున్నారు. పరిషత్తులో ముస్లింలీగువారు చేరి కార్యకలాపంలో పాల్గొనే పక్షాన కేంద్రప్రభుత్వ అధికారాలు మిక్కిలి తక్కువగ నుండును. వారు పాల్గొనని పక్షమున అవి కొంత అధికము కాగలవు. ఈ సంవత్సరం ఫిబ్రవరి తే 21 దీన అట్లీచేసిన ప్రకటనలో పరిపాలనాధికారమును ఒక కేంద్రప్రభుత్వపు వశముచేయక, అవసరమైనయెడల 1948 జూన్ నాటికి ఏర్పడు రాష్ట్రప్రభుత్వముల వశము చేయుటకు బ్రిటిషువారు సంసిద్ధులుగ నున్నట్లు తెలుపబడినది. ఆ కారణముచేతనే లీగువారు వారి అధికారమును పంజాబులో స్థాపించుకొనుటకు సర్వవిధముల ప్రయత్నము చేయుచున్నారు. ఇట్టి ప్రయత్నమే తమకు అనుకూలముగ నుండుననియు, దేశమున కంతకు వర్తించు రాజ్యాంగ విధానమును ఏర్పరచు రాజ్యాంగపరిషత్తులో తాము చేరుట అనవసరమనియు వారు తీర్మానించుకొన్నినయెడల భరతఖండమునకు పరిషత్తువారు ఏర్పరచు రాజ్యాంగ విధానములో కేంద్రప్రభుత్వమునకు ఎక్కువ అధికారములును, ఆంధ్రరాష్ట్రమునకును - అదేవిధముగ తదితర రాష్ట్రములకును - గల అధికారములు కొంత తక్కువగను ఉండునని చెప్పవచ్చును. గనుక ప్రస్తుత సందిగ్ధ పరిస్థితులలో ఆంధ్రరాష్ట్రమునకు ఏయే వ్యవహారములపై పరిపాలనాధికారముండునో నిర్ణయించుట కష్టసాధ్యము.

### రాజ్యాంగ విభాగము :

రాష్ట్ర ప్రభుత్వమువారు పాలించవలసిన వ్యవహారములు ఎక్కువైనను తక్కువైనను పరిపాలన సవ్యముగ జరుగుటకు ప్రధాన అంగములు కొన్ని ఉండవలెను. ఈ కాలపు సాంప్రదాయముల ననుసరించి (1) ఒక రాష్ట్రపతి (2) ఒక శాసనసభ (3) ఒక మంత్రివర్గము (4) ఒక న్యాయస్థానము (5) ఒక ఉద్యోగవర్గము ఉండవలెనని చెప్పవచ్చును. ఇవి గాక పరిపాలన విధానమును నిర్ణయించునపుడు పౌరుల ప్రాథమిక హక్కుల ప్రణాళిక నొకదానిని చేర్చుటకూడ ఈ కాలమున మామూలు.

### రాష్ట్రపతి :

ప్రతి రాష్ట్రమునకు ఒక రాష్ట్రపతి యుండుట అవసరము. ప్రస్తుతము గవర్నరు ఈపదవిలోనున్నాడు. ఇతనిని ఇంగ్లీషు ప్రభుత్వమువారు నియమించుచున్నారు. వారి ఆజ్ఞలకు లోబడి అతడు తన అధికారమును చెలాయించుచుండును. ఇతని ఉద్యోగకాలము అయిదు సంవత్సరములు. 1948 జూన్ నాటికి బ్రిటిష్‌వారు వారి అధికారమునంతను వదలుకొనుటకు నిశ్చయించియున్నారు. అటుతర్వాత మన మిష్టపడినయెడల బ్రిటిష్ సామ్రాజ్యములో నొక అంతర్భాగముగ ఉండవచ్చును; లేని పక్షమున విడిపోవచ్చును. బహుశః విడిపోవుటయే జరుగును. అట్టి సందర్భములో రాష్ట్రపతిని బ్రిటిష్ ప్రభుత్వమువారు నిర్ణయించుట అను సూత్రము వర్తించబాలదు. అతనిని రాష్ట్రములోనివారే నిర్ణయించుకొనవలసి యుండును.

ఈ నిర్ణయము ఎట్లు జరుగవలెను అను విషయమున ఇంకొక క్లిష్టసమస్యను మనము ఎదుర్కొనవలసి యుండునని తోచుచున్నది. మనము నిర్మాణము చేయదలచిన ఆంధ్రరాష్ట్రములో ప్రస్తుతము బ్రిటిష్‌పాలనలో ఉన్న జిల్లాలుమాత్రము కలిసియుండునా? లేక హైదరాబాదు సంస్థానములోని జిల్లాలుకూడ కలియునా? మనది "విశాల ఆంధ్రరాష్ట్ర"మా, కాదా? అనునదియే ఈ సమస్య. బ్రిటిష్‌పాలనలోని రాష్ట్రములుమాత్రమే కలిసి ఆంధ్రరాష్ట్రము ఏర్పడినయెడల—బహుశః ప్రస్తుతము ఇట్టి రాష్ట్రముమాత్రమే ఏర్పడునేమో—రాష్ట్రపతిని రాష్ట్రవాసులు ఎన్నుకొనుటయే మంచిది. అతడు ప్రజలందరి ప్రతినిధిగ నుండవలసినవాడు. గనుక ప్రజలచే ఎన్నుకొన తగినవాడు. శాసనసభలలోను మంత్రివర్గములలోను ఏర్పడు కక్షలను ప్రమాదకరములు కాకుండ మధ్యవర్తిత్వమునకు అతడప్పుడు పూనవలసియుండును. ప్రజ లెన్నుకొనిన రాష్ట్రపతియే అట్టి బాధ్యతను వహింపగలవాడుగ నుండును. ప్రధానమంత్రి గాక రాష్ట్రపతి ప్రత్యేకముగ మరియొక డుండవలెనా? అను సంశయము కొందరికి కలుగవచ్చును. కాని ప్రత్యేక రాష్ట్రపతి ఉండుట అవసరము. మంత్రులు తరుచుగ మారుచుండెదరు. అట్టి మార్పులేక, ఒక నిర్ణీతకాలమువరకు అధికారములో నుండి ప్రజలందరి తరఫున మాట్లాడుటకు ప్రాతినిధ్యము వహించుటకును అర్హుడగు రాష్ట్రపతి యుండుటయే శ్రేయస్కరము. అట్టివానిని ప్రజలు ఎన్నుకొను ప్రచారము యునైటెడ్ స్టేట్సులోనున్నది. కొన్ని దేశములలో కేంద్రప్రభుత్వమువారు రాష్ట్రాధిపతులను నియమించు ఆచారము కలదు. కాని మనము దానిని అనుసరించ కూడదు. అది రాష్ట్ర స్వాతంత్ర్యమునకు భంగకరముగ నుండును. అయిదు సంవత్సరముల కొక పర్యాయము ప్రజలే రాష్ట్రపతిని ఎన్నుకొనుట వాంఛనీయమగు విధానము.

### విశాలాంధ్రరాష్ట్రపతి :

సంస్థానముల భావి పరిస్థితులు ఎట్లుండగలవో ప్రస్తుతము సూచించుటకు వీలులేదు. బహుశః కొంత కాలము వరకు సంస్థానములు సంస్థానాధీశులు ఉండుట తప్పనిసరి యేమో? అట్లే జరిగినయెడల హైదరాబాదులోని ఆంధ్ర జిల్లాలు ఆంధ్రరాష్ట్రములో కలియుట జరుగదు. అటు తర్వాత ఎప్పుడైన కలిసినయెడల ఎట్టి పరిస్థితులలో అవి కలియునో మనమిప్పుడు సూచింపలేము. హైదరాబాదులో గొప్ప విప్లవము సంభవించి దాని ఫలితముగ ఆ జిల్లాలన్నియు ఆంధ్రరాష్ట్రములో కలిసినయెడల అట్టి పరిస్థితులలో నైజాంయొక్క పరిపాలన నిలుచునో నిలవదో చెప్పజాలము. నిలవని పక్షమున ప్రజలెన్నుకొనినవాడె అఖిలాంధ్రమునకు రాష్ట్రపతి కాగలడు. నైజాం పరిపాలనము నిలిచి, సామరస్యముతో విశాలరాష్ట్ర మేర్పడినయెడల నియమద్ధమగు అధికారముతో ఇంగ్లీషురాజు ఇంగ్లండును పాలించునట్లు నైజాం విశాలాంధ్రమునకు రాష్ట్రపతి కావచ్చును.

కాని ప్రస్తుత పరిస్థితులలో ఇంతటి ఊహలనుచేసి, భావనా ప్రపంచమును కల్పించుకొనుట మంచిదికాదేమో.

## శాసనసభ ఒకేశాఖ :

ప్రతిరాష్ట్రమునకు శాసనసభ యొకటి ఉండవలెను గదా! కాని ప్రస్తుతము మద్రాసు రాష్ట్రములోనుండు శాసనసభ రెండు శాఖలతో కూడుకొని యున్నది. మనము ఆంధ్రరాష్ట్రమునకు ఏర్పరచుకొను శాసనసభలోకూడ రెండు శాఖలుండవలెనా ? లేక ఒకేశాఖ చాలునా ? అన్నది మొట్ట మొదట మనము నిర్ణయించుకొన వలసిన విషయము. ప్రస్తుతముకూడ పంజాబు మధ్య పరగణాలు సింధురాష్ట్రము, ఒరస్సారాష్ట్రములందు ఏకశాఖాన్విత శాసన సభయే ఉన్నది. రెండుశాఖలు అవసరము లేద నియే విషయజ్ఞు లనేకులయొక్క అభిప్రాయము. శాసన సభయందు ఒకేశాఖ ఉండినయెడల శాసనములను చక్కగను నెమ్మదిగను ఆలోచించి చేయుట సంభవించ దనియు, రెండవ శాఖయొకటి ఉన్నయెడల మొదటి శాఖలోని లోపములను సద్దుబాటు చేయుటకు వీలగు ననియు, మొదటి శాఖలో ప్రాతినిధ్యము సంపాదించ లేని ప్రముఖులు విద్యావంతులు వ్యవహారదక్షులు రెండవ శాఖలో ప్రాతినిధ్యము సంపాదించి తద్వారా దేశసేవ చేయగలవా రగుదురనియు కొందరి వాదము. కాని ఎన్నిక లన్నియు పార్టీలద్వారా జరుగు ప్రస్తుతకాల ములో పార్టీ అధికారులను కాదని ఏ ప్రముఖుడుగాని ఏ విద్యావంతుడుగాని శాసనసభలో సభ్యత్వము సంపా దించుట కష్టము. ఇట్టి సందర్భములో రెండు శాఖ లున్నంత మాత్రముచేత ప్రముఖులు శాసనసభాసభ్యులు కాగలరని చెప్పుటకు వీలులేదు. ఏకశాఖతో కూడిన శాసనసభ తొందరపడి శాసనములను చేయుననుటకు కూడ ఆధారములేదు. అట్టి తొందరపాటు లేకుండా చేయుటకు ఉపాయాంతరము లనేకములున్నవి. గనుక మన మేర్పరచుకొను ఆంధ్రరాష్ట్రములో శాసనసభ ఒక్కశాఖతో కూడినదిగ నుండిన చాలును. రెండు శాఖలు అవసరములేదు.

## ఎన్నిక హక్కు :

శాసనసభలోని సభ్యులను ప్రజలు ఎన్నుకొనవలెను. ప్రజాస్వామ్యమును స్థాపించదలచిన ప్రస్తుత కాలమందు శాసనసభను నిర్మించుటకు వేరొక మార్గములేదు. శాసన సభ్యులను ఎన్నుకొనుహక్కు యుక్తవయస్సు వచ్చిన ప్రతి మొగవానికి, స్త్రీకి ఉండవలెను. ఆస్తినిబట్టి, ఆదాయమునుబట్టి, చెల్లించు పన్నులబట్టి, విద్యనుబట్టి ఎన్నిక హక్కును నిర్ణయించుట యుక్తముకాదు. ఈలాటి నిర్ణయము మూలమున అధికారము ప్రజలందరి యందు ఉండుటకు బదులు ఏ కొద్దిమంది చేతులలో ఉండుట సంభవించును. ప్రజలందరికి లాభకరముగ పరిపాలనము జరుగుటకు బదులు ఏ కొద్దిమందికి మాత్రమో అధికారముండును. గనుక యుక్తవయస్సు వచ్చిన స్త్రీ పురుషులందరికి ఎన్నికహక్కు ఉండవలెను. ఇదిమూల సూత్రము. దీనిని అందరు ఆమోదింపగలరు.

## నియోజక వర్గములు (1) స్థానికములు :

కాని, శాసనసభ్యులను ఎన్నుకొనువారిని ఎట్టి నియో జక వర్గములుగ నేర్పరచవలెను ? అన్న విషయమును గురించి అనేక అభిప్రాయభేదము లున్నవి. నియోజక వర్గములను (1) స్థానికములుగ (Territorial) గాని (2) వృత్తినిబట్టి గాని (3) మతమునుబట్టి గాని ఏర్పరచ వచ్చును. ప్రస్తుతము మనదేశములో ఈ మూడు రకము లగు నియోజకవర్గము లున్నవి. ప్రజాస్వామ్యము గల మరి ఏ దేశమందుకూడ ఇట్టి విధానములేదు. అన్ని దేశములందును నియోజకవర్గములు స్థానికములే. అనగా సామాన్యముగ శాసనసభలో ఎందరు సభ్యులుండెదరో అన్ని భాగములుగ రాష్ట్రమునంతను విభజించుటయు, ఒక్కొక భాగములోని స్త్రీపురుషు లందరు—వారివృత్తి ఏదైనను, వారి మతము, కులము జాతి ఏదైనను—ఒకే నియోజక వర్గముగ ఏర్పడి, వారందరు కలిసి ఆ భాగ మున కొక ప్రతినిధిని ఎన్నుకొను పద్ధతికి స్థానిక నియోజక వర్గ పద్ధతియని పేరు. శాసనసభ్యులను ఎన్నుకొనుటలో వృత్తిభేదములు కులభేదములు పాటించుట అసంగతమను సిద్ధాంతమే ఈ పద్ధతికి ఆధారము. శాసనసభలో చర్చించ బడు విషయములు, అందులో నిర్మింపబడు చట్టములు ఏదో ఒక వృత్తికిగాని, ఒక కులమునకుగాని, ఒక మత మునకుగాని సంబంధించునవి కావు. అవి రాష్ట్రములో ప్రజలందరి సమష్టి శ్రేయస్సుకు సంబంధించి యుండును. గనుక శాసనసభ్యులను ఎన్నుకొను వారి దృష్టి తమ వృత్తిమీద గాని, మతముమీద గాని ప్రసరించక, ఈ సమష్టి శ్రేయస్సుమీద ప్రసరించవలెను. అట్టి మనో భావము వారిలో పుట్టుటకును వృద్ధిగాంచుటకును స్థానిక నియోజక వర్గములే సాధనములు.

### వృత్తి నియోజక వర్గములు :

కొందరు ఈ విధానమునకు అంగీకరించుట లేదు. ఎన్నిక హక్కుగల స్త్రీ పురుషులందరు వారి వారి వృత్తులనుబట్టి ప్రత్యేక నియోజక వర్గములుగ ఏర్పడవలెనని వారి వాదము. వ్యవసాయదార్లు భూస్వాములు, వడ్రంగులు, పాలెవాండ్రు, ఫ్యాక్టరీకూలీలు, రైల్వే కూలీలు, వైద్యులు, ఉపాధ్యాయులు, వర్తకులు— ఈ విధముగ ఎన్ని వృత్తులు రాష్ట్రమునందున్నవో అన్ని నియోజక వర్గములు ప్రత్యేకముగ ఏర్పడవలెనని వీరు చెప్పుచుందురు. వడ్రంగులందరుచేరి ఒక నియోజక వర్గముగను, రైతులందరుచేరి ఇంకొక నియోజక వర్గముగను, ఉపాధ్యాయులందరు మరియొక నియోజక వర్గముగను, ఇట్లే ఇతర వృత్తుల ననుసరించువారు ఇతర నియోజక వర్గములుగను ఏర్పడి, ఆయావృత్తులకు సంబంధించిన వారిని శాసనసభ్యులుగ నెన్నుకొనుట ఉత్తమ మార్గమని వీరి అభిప్రాయము. కాని ఇందులో అనేక చిక్కులున్నవి. ఏయే వృత్తికి ఎందరు శాసనసభ్యులుండవలెను? అనుదానిని నిర్ణయించుటకు వీలులేదు. ప్రధాన వృత్తులకు ఎక్కువ ప్రాతినిధ్య ముండవలెనని, అప్రధానములకు తక్కువ ప్రాతినిధ్యము సరిపోవునని కొందరు చెప్పెదరు. కాని ఈ ప్రాధాన్యమును నిర్ణయించుట ఎట్లు? ఈ విధముగ ఎన్నుకొనబడిన వారు సమష్టి శ్రేయస్సును గమనింపజాలరు. వడ్రంగుల ప్రతినిధి వడ్రంగుల శ్రేయస్సునే కోరువాడగును; ఉపాధ్యాయుల ప్రతినిధి వారి శ్రేయస్సునే కోరును. ఇది మిక్కిలి సంకుచితమైన దృష్టి. ఎవరి లాభమును వాడు వృద్ధిచేసుకొనుటయు, అందుకుగాను శాసనసభలో బేరసారములు జరుగుటయు సంభవించును. ఇదిగాక శాసనసభలో చర్చకువచ్చు విషయములు ఒకో ఒక వృత్తికి సంబంధించి యుండవు. వడ్రంగమునుగురించి చర్చలు జరిగినపుడు వడ్రంగుల ప్రతినిధి ఏదైన చెప్పగలవాడగునుగాని, వ్యవసాయమునుగురించిగాని, విద్యనుగురించిగాని చర్చలు జరిగినపుడు అతని ప్రాతినిధ్యము ఎందుకు పనికివచ్చును? అతడు నోరుమూసుకొని ఉండవలసినదే. వోటు చేయవలసిన సమయములో అతడు విషయమును గ్రహించి వోటు చేయుటకు బదులు, చర్చ ఫలానిదియని తెలుసుకొనక చేతులెత్తువాడగును. వృత్తులగురించి సమస్యలను అప్పుడప్పుడు శాసనసభ పరిష్కరించవలసిన అవసరము లేకపోలేదు. కాని అట్టి సమయములలో ఆ వృత్తికి సంబంధించిన వారిని కొందరిని ప్రత్యేకముగ ఆహ్వానముచేసి వారి అభిప్రాయములను తెలుసుకొనవచ్చును. ఈ కాలములో వృత్తి సంఘములు కార్మిక సంఘములు అనేకము లేర్పడియున్నవి. అవసరమైనపుడు ఆ సంఘములవారు మంత్రివర్గములోను శాసనసభ్యులతోను సంప్రతించి, వారి కష్టములను చెప్పకొని, వారి అభిప్రాయానుసారముగ పరిపాలన జరుగుటకు అవకాశము లేర్పరచుకొని యున్నారు. గనుక ఎన్నిక నియోజక వర్గములు వృత్తినిబట్టి నిర్ణయించవలసినది లేదు.

### మతము ననుసరించి నియోజకవర్గములు :

మతమునుబట్టి హిందువు లందరిని ఒక నియోజక వర్గముగాను, మహమ్మదీయుల నందరిని ఇంకొక నియోజక వర్గముగాను, అట్లె క్రైస్తవులను, పార్శీలను, ప్రత్యేక నియోజక వర్గములుగాను ఏర్పరచుట ప్రమాదకరము, అనర్థదాయకము. శాసనసభ మతములలోని గుణదోషములను నిర్ణయించు పరిషత్తుకాదు. ఏ మతము ఉత్కృష్టమైనది, ఏది కాదు అని నిర్ణయించు పరిషత్తులో వివిధ మతములకు ప్రాతినిధ్య ముండుట అవసరము. కాని ఆర్థిక రాజకీయ విషయములను చర్చించి పరిష్కరించు శాసనసభలో మతమునుబట్టి సభ్యత్వము నిర్ణయించుట అసంగతము. మద్యపానమును నిషేధించుచుగాని, వ్యవసాయాభివృద్ధి ఉద్దేశించిగాని, శాసనసభ చట్టము చేసినయెడల, దానిమూలమున హిందువులు ఒకవిధముగను మహమ్మదీయులు ఇంకొక విధముగను లాభనష్టములను పొందుట సంభవించదు. ఇట్టి నియోజక వర్గముల మూలమున మతవైషమ్యము, కులవైషమ్యము, జాతి వైషమ్యము అభివృద్ధి గాంచినదని గత ముప్పై సంవత్సరముల అనుభవమునుబట్టి మనకు తెలిసియున్నది. కొసకు హిందువులొక జాతివారు, మహమ్మదీయులు మరియొక జాతివారు, వారికి వీరికి ఎట్టి సంబంధములేదు, దేశమును హిందూస్థానమని పాకిస్థానమని రెండు స్వతంత్రరాజ్యములుగ విభజించినగాని మహమ్మదీయులకు సంతృప్తి కలుగజాలదను వాదమున కంతకు ఈ ప్రత్యేకమత నియోజకవర్గములే కారణము. దీని మూలమున అనేక రాష్ట్రములలో ప్రజలందరి క్షేమమును అభివృద్ధి పరచగల మంత్రివర్గములను ఏర్పరచుట కష్ట

సాధ్యమయ్యేను. గనుక రాష్ట్రరాజ్యాంగమందు ఏమార్పులు జరిగినను జరుగక పోయినను నియోజకవర్గముల విషయమై తప్పక ప్రస్తుత విధానము రద్దుకావలసియున్నది. లేనియెడల దేశమందు మతవైషమ్యము ఇప్పటికంటె విపరీతమగును. ఐక్యభావము అడుగంటును. మతమునుబట్టి భాషనుబట్టి ఒక పౌరునికి ఇంకొకనికి ఎన్ని భేదము లున్ననూ రాజకీయముగ అందరు ఒక్కరే అన్న భావము దేశమందు వృద్ధిగాంచ వలసియున్నది. దానికి సంయుక్త స్థానిక నియోజకవర్గములే సాధనము. ఆంధ్ర రాష్ట్రమునకు ఏర్పడనున్న రాజ్యాంగ విధానమునకు ఇది ప్రత్యేక లక్షణముగ నుండ తగియున్నది.

## అధిక సంఖ్యాకులు, అల్ప సంఖ్యాకులు:

దేశములోని ప్రజలను అధిక సంఖ్యాకులు అల్ప సంఖ్యాకులని విభాగముచేసి, వీరిమధ్య ద్వేషమును బ్రిటిషవారు వృద్ధిచేసిన విషయము అందరికి తెలిసినదే. కాని ఈ విభాగము కృత్రిమమైనది. స్వాభావికము కాదు. హిందువులను సవర్ణులని అవర్ణులని విభాగము చేయుటకూడ ఇట్టిదే. నిజముగ పరిశీలించినయెడల అధిక సంఖ్యాకు లెవ్వరులేరు. హిందువులలో ఎన్నో కులము లున్నవి. ఒక్కొక్క కులమును ప్రత్యేకముగ గమనించినయెడల అది అల్ప సంఖ్యాక వర్గములో చేరును. సవర్ణులందరుకలసి అవర్ణులను బాధింతురనిగాని, హిందువులందరుచేరి మహమ్మదీయులను బాధింతురనిగాని, అనుకొనుట హాస్యాస్పదము. ఇది ఇప్పటివరకు జరుగలేదు. ప్రాచీనకాలపు సాంప్రదాయములు, నమ్మకములు శిథిలము లగుచుండు ప్రస్తుత కాలములోను భవిష్యత్తులోను ఇది జరుగనే జరుగదు. సంయుక్త స్థానిక నియోజకవర్గముల విధానమును మహమ్మదీయులకు హరిజనులకు ప్రాతినిధ్యము లభించ జాలదని అనుకొనుట పొరబాటు. అందరి సానుభూతి ఉన్నగాని మనము స్థాపింప బూను కొన్న ప్రజాస్వామ్యము స్థిరపడదు. రాజకీయరంగమున ప్రవేశించి పనిచేయు వారందరు అన్నిమతములవారికి ప్రాతినిధ్యము కల్పించుటయే భావ్యమని ప్రవర్తింతురు. ఇందుకుగాను ప్రత్యేక చట్టములు అనవసరము. సంకుచితదృష్టితో సవర్ణులు హరిజనులను బాధింప దొడగినయెడల దానికి ప్రతిక్రియ ప్రత్యేక నియోజకవర్గములు కావు. అప్పుడు మాత్రము హరిజనులు శాసనసభలో అధిక సంఖ్యాకులు కాగలరా? మహాత్మాగాంధీగారు సూచించిన దౌర్జన్యరాహిత్యమగు సహాయ నిరాకరణ విధానము ఇట్టి పరిస్థితులలో బ్రహ్మాస్త్రమువలె పని చేయును.

## మంత్రివర్గము :

అన్ని కాలములందు శాసనసభలకన్న రాచకార్యములను దినేదినే నిర్వహించు మంత్రివర్గమునకే ఎక్కువ ప్రాధాన్యము. ఎవరు మంత్రులుకావలెను? ఎంతకాలము వారు మంత్రులుగ నుండవలెను? వారికిని శాసనసభకును ఎట్టి సంబంధ ముండవలెను? అను విషయములను ఆంధ్ర రాష్ట్రమునకు సంధించిన వరకు మనము నిర్ణయించవలసి ఉన్నది.

## రాష్ట్రపతియో ప్రధాన మంత్రి :

ఒకపక్షమున ప్రజలెన్నుకొనిన రాష్ట్రపతియే ప్రధాన మంత్రిగనుండి, తనకిష్టము వచ్చినవారిని మంత్రులుగ నియమించుకొని, రాచకార్యములను నడుపుట చక్కగ నుండునని చెప్పవచ్చును. అమెరికాలో పరిపాలన విధానమంతయు ఇట్లే జరుగుచున్నది. కాని ఇందులో రెండు మూడు లోపములున్నవి. శాసనసభకు మంత్రివర్గమునకు ఏలాటి సంబంధము లేకపోవుట మొదటి లోపము. రాష్ట్రపతిగాని ఇతర మంత్రులుగాని శాసనసభలో సభ్యులుగ నుండరు. వారి సూచనలను శాసనసభవారు ఆమోదింతురన్న నమ్మకము లేదు. ఒక్కొక్కప్పుడు ఒక రాజకీయ పార్టీవారు శాసనసభలో మెజారిటీగా ఉండుటయు ‘విరోధిపక్షమునకు’ చెందినవారు మంత్రివర్గములో నుండుటయు సంభవించుటగలదు. అప్పుడు ఈ రెండు సంస్థలమధ్యన సంఘర్షణ గలిగి, పరిపాలనమంతయు స్తంభించుటకూడ కద్దు. గనుక ఈపద్ధతి అంత ప్రశంసనీయము కాదు. ఇదిగాక గతముప్ఫయిసంవత్సరముల నుండి మన రాష్ట్రములలో కొంతవరకు ఈ అమెరికన్ పద్ధతికి భిన్నమైన ఇంగ్లీషుపద్ధతి అమలులోవున్నది. దానికి మనము అలవాటు పడియున్నాము. ఈ పద్ధతినే మనము స్వతంత్ర ఆంధ్రరాష్ట్రమందు అనుసరించిన బాగుండునేమో.

## ప్రత్యేక ప్రధాని :

ఇంగ్లీషు పద్ధతికి బాధ్యతాయుత పద్ధతియని (Responsible Government) పేరు. ఇందులో ఏ పార్టీకి శాసనసభలో మెజారిటీవుంటే ఆ పార్టీ నాయకుడు ప్రధానమంత్రిగ నుండుటయు, అందులోని ఇతర ప్రముఖులు అతని అనుమతిన మంత్రులగుటయు, పార్టీ

యొక్క విశ్వాస మున్నంతవరకే ఇట్లేర్పడిన మంత్రి వర్గము అధికారములో ఉండుటయు, దానిని కోల్పోయి నపుడు అధికారమును వదులుకొనుటయు జరుగును. గనుక శాసనసభయొక్క విశ్వాసములేని మంత్రివర్గము అధికారములో నుండుటకు వీలులేదు. ఈ రెంటికి ఎప్పుడూ సామరస్యముండును. మంత్రుల నాయకత్వమున శాసనసభ తన విధులను నిర్వహించును. పరిపాలనమంతయు ఏకముఖముగ జరుగును. కాని శాసనసభలో వివిధపక్షము లున్నప్పుడును, ఏ పక్షమునకు గాని మెజారిటీ లేనప్పుడును, లేక మెజారిటీ పక్షములో అప్పుడప్పుడు చీలికలు ఏర్పడినను, మంత్రివర్గము స్థిరముగ నుండుటకు వీలులేక, పదేపదే మారుచుండును. మంత్రులు అనుకొనిన కార్యక్రమమును జరుపుట కష్టసాధ్యమగును. పరిపాలనను చక్కగ జరుపుటకు బదులు, తమ అధికారమును ఎట్లైన నిలబెట్టుకొనుటకు కావలసిన కుట్రలు, ఇతరుల కుట్రల నెదుర్కొనుటకు ప్రతికుట్రలు పన్నుటయందే కాలము గడుపుచుందురు. అధికారము మంత్రులయందుండక ఉద్యోగుల హస్తగతమగును. గనుక బాధ్యతాయుత విధానము అన్ని దేశములలోను అన్ని పరిస్థితులలోను సౌష్టవముగ జరుగునని చెప్పుటకు వీలులేదు.

**మిశ్రమ విధానము :**

ఇట్టి లోపము లుండునని గ్రహించి, ప్రముఖులు కొందరు ఈ రెండు విధానములు గాక, వీటిలోని గుణములను మాత్రమును గ్రహించి, దోషములను పరిహరించి, ఒక మిశ్రమ విధానమును ఏర్పరచుట ఉత్తమమని సూచించియున్నారు. ఈ మిశ్రమ విధానము ప్రస్తుతము స్విట్జర్లాండు దేశమునందున్నది. అందు మంత్రుల నందరిని శాసనసభవారు ఎన్నుకొనెదరు. అందుచేత ప్రథమతః శాసనసభకు మంత్రివర్గమునకు సామరస్య ముండును. మంత్రివర్గమువారు శాసనసభా సభ్యులు కాకున్నను, వారు శాసనసభలోని చర్చలలో పాల్గొని, సభకు సలహాలను ఇయ్యవచ్చును. ఒకవిధముగ వారి నాయకత్వమును సభవారు అంగీకరించుచున్నారని చెప్పవచ్చును. కాని మంత్రివర్గమును నాలుగు సంవత్సరములకాలము అధికారములో నుంచెదరు. ఈ మధ్యన శాసనసభవారి విశ్వాసమును కోల్పోయినను మంత్రివర్గము మారదు. మంత్రులను నియమించుటలో వారు ఏ రాజకీయ పక్షమునకు చెందినవారను వివక్ష యుండదు. ఏ పక్షమునకు చెందినను కార్యనిర్వహణమందు వారికి దక్షత యున్నయెడల వారినే పదేపదే యెన్నుకొనుట సంభవించును. గనుక ఈ విధానము మూలమున మంత్రివర్గమునకు శాసనసభామోదము, స్థిరత్వము లభించుచున్నది. ఇదియే ప్రశంసనీయమైన విధానమని కొందరి అభిప్రాయము. కాని స్విట్జర్లాండులోని రాజకీయ పరిస్థితులకును మన పరిస్థితులకును, అనేక విషయములలో భేదమున్నది. గనుక ఈ విధానము మనకు ఆచరణయోగ్యమా అన్న సంశయము కలుగుచున్నది.

ఇట్టి సందర్భములో మనమిదివరకు - అనగా 1920 నుండి అలవాటు పడియున్న బాధ్యతాయుత ఇంగ్లీషు విధానమునే అనుసరించి ఆంధ్రరాష్ట్ర మంత్రివర్గము ఏర్పరచుకొనుట మంచిది. అనుభవము ఎక్కువ కాను కాను యిందులోని లోపములను సవరించుకొనుట కవకాశము కలుగును.

**పార్టీలు :**

ఇంతేకాక శాసనసభలు మంత్రివర్గములు రాష్ట్రములో రాజకీయ పార్టీలనుబట్టి పరిపాలనము జరుపుచుండును. మోటారు కారునడుచుటకు పెట్రోలు ఎట్లు అవసరమో ప్రస్తుత కాలమున ప్రజాపరిపాలనమంతయు పార్టీ మూలమున నడుచుచున్నది. శాసనసభలకు అభ్యర్థుల నేర్పరచుట, నాయకులను ఎన్నుకొనుట, కార్యక్రమమును నిర్ణయించుట - ఈ పనులన్నిటిని పార్టీవారు చేయుచుందురు. పార్టీ సవ్యముగ పనిచేయుచున్నయెడల పరిపాలన సవ్యముగ జరుగగలదు. పార్టీలో లోపమున్నయెడల పరిపాలనముకూడ లోపభూయిష్టమగును. పార్టీలనుగురించి ఎక్కువగ వ్రాయవలసి యున్నను, ఇచ్చట అవకాశములేని కారణమున ఇంతటితో విరమించుచున్నాను.

**ఇతర విషయములు :**

రాష్ట్రమునకు ఏర్పడవలసిన ఉన్నతన్యాయస్థానము, ఉద్యోగవర్గము, రాష్ట్రములోని ప్రజలందరు ఎట్టి వివక్ష లేక సర్వసాధారణముగ అనుభవింపవలసిన హక్కులు గురించియు రాజ్యాంగ విధానము స్పష్టపరచవలసి యున్నది. ఈ అంగము లన్నిటితోకూడిన సమగ్రమైన రాజ్యాంగ విధానము మనరాష్ట్రమునకు ఏర్పడు గాక యని మనమందరము కోరవలసియున్నది.

# ఆంధ్రదేశపు దేవాలయములు

శ్రీ భావరాజు వెంకటకృష్ణరావు

ఆంధ్రదేశములోకూడా చాలా చక్కని దేవాలయములున్నవని ఆంధ్రులే యెఱుగరు. జాతీయ జీవనము, అందులోని విశిష్టత, జాతీయమైన సంప్రదాయములు, ఐతిహ్యములు, సంస్కృతి, మొదలయిన వాటిని మరిచిపోయి, మంటగలిపిన ఈపాడుకాలమున దేవాలయముల శోభ, ప్రయోజనము, మహత్తు, ఇవి ఆంధ్రులకు అనవసరములయినవి. ఇది నిజముగా ఆంధ్రజాతికి, ఆంధ్రభూమికి, మిక్కిలి నికృష్టమైన దుష్టకాలము. ఈ కలి పంకమునుండి, కూరుకొనిపోవుచున్న ఆంధ్రజాతిని, ఉద్ధరించగల మహనీయుడు యింకను అవతరించలేదు. మంచిదినములు ఇంకను ఆసన్నముకాలేదు.

ఈ సందిగ్ధసమయమున, దుస్థితిలో నున్న ఆంధ్రజాతికి మేలుకొలుపు లెన్నియో పాడవలసియున్నది. అజ్ఞానాంధకారమునబడి, మత్తులో పొరలాడుచు, దారి తెన్నులు గానలేని ఆంధ్రజాతికి ఒకసారి మేలుగాంచి, మరల నిద్రలో మునిగిపోవుచున్న ఆంధ్రజాతికి, మేలుకొలుపు లావశ్యము. మేల్కాని నంతనే తన దుస్థితిని, పరిస్థితులను అవగాహనము చేసుకొనుటకు, సింహావలోకనము అవసరము. అత్యవసరము గూడ. ఆంధ్రజాతి సంస్కృతి, సంప్రదాయములు, ఐతిహ్యములు మొదలయినవన్నియు గూడ జాతికి చరిత్రజ్ఞానము కలిగిననాడు గాని మాటి మాటికి మననమునకు రావు.

ఆంధ్రజాతి వరుసలో జైనధర్మము, తరువాత బౌద్ధధర్మము, పిదప వైదికబ్రాహ్మణ ధర్మము, అటుపిమ్మట స్మార్తబ్రాహ్మణ ధర్మము, ఆదిశైవము వీరశైవము, శాక్తేయము, భాగవత సాంప్రదాయము, వైష్ణవము: ఇత్యాది ధర్మములు నవలంబించియుండెను. ఈ నాడు పూర్వోత్తములయిన అన్నింటిలోనుంచి మంచి హరించిపోగా, మిగిలిన 'మడ్డి'ని మాత్రము స్మార్తధర్మము పేరిట అవలంబించుచున్నది. సంస్కార విహీనమైన ఈ మడ్డికి, తలయు, తోకయు లేకున్నది. ఆంధ్రదేవాలయములున్నవా ?' ఉన్న, వాటి ప్రయోజనము లేమి? దేవాలయము లెందుకు, దేవుడొకడున్నాడా? దేవాలయములను వదిలిపెట్టి వాటిని పాడుపెట్టి, దేవతాప్రతిమలను విసర్జించి, దేవాదాయములను ఎందులకు మరియొక అవసరమునకు వినియోగింపరాదు ? ఈ రీతి ప్రశ్నలు, సంశయములు అనేకములు బహుముఖముల నుండి వెలువడుచున్నవి. ఈ విచిత్ర కాలమున ఆంధ్రదేశపు దేవాలయములను గురించి తెలుపబూనుట పరిహాసాస్పదము కావచ్చును.

ఆంధ్రదేశములోని దేవాలయములను మూడు తరగతులుగా విడదీయవచ్చును. సంప్రదాయ సిద్ధముగా ఆంధ్రదేవాలయములు, తమిళదేశపు దేవాలయములకంటె చాలా ప్రాచీనములు. ఆంధ్రదేవాలయముల సంగతి విచారణచేసిన పుణ్యాత్ము డింతవఱకు జనించలేదు. జైన బౌద్ధ ధర్మములకంటె మిక్కిలి ప్రాచీన కాలమునాడు ఆంధ్రమున ఒకవిధమయిన దేవతాపూజ లుండెను. మంత్రములు జపించి, మహత్తరములయిన శక్తులను సంపాదించిన కాలమొకటి ఉండెను. ఆనాడు నాగములను, 'స్కందుని' జనులు పూజించిరి. స్కందుని దేవాలయములు వెలసెను. స్కందుని పేరట నగరములు అనేకములు వెలసెను. నేటి కందుకూరు, కర్నూలు (కందనోలు) కంద (ఖండ) వల్లి, మొదలయినవి ఆ కాలమునాటివి. నేడు మహాసేనుని పూజలు దేశములో కానరావు. గుంటూరు జిల్లా తెనాలి తాలూకా చేంబ్రోలు, ఒకనాడు మహాసేనుని (స్కందుని) దేవాలయమునుబట్టి మహాప్రసిద్ధికి వచ్చెను. చేంబ్రోలున మహాసేనుని గుడి నేడు నామమాత్రావశిష్టముగ నున్నది. స్కందపూజలంతరించిననాడు, శివకేశవు లవతరించిరి. క్రీస్తుశకారంభకాలమువఱకు, విష్ణువుకు, అనగా కేశవునకు పూజాపువస్కారములు గానరావు. ఇంచుమించుగా కేశవునకు పూజ లమరిననాడే శివుడు పాశుపశమూర్తియై వెలసినాడు. శివకేశవుల పూజలు, బౌద్ధులయొక్క మహాయాన సంప్రదాయమునుండియు, హేయములైన ఆచారములనుండియు, తాంత్రిక ధర్మమునుండియు, వెలసినవి. బౌద్ధము అసహ్యకరమయిపోయెను. నిర్మలమై, పరిశుద్ధమై, జ్ఞానవైరాగ్య ముక్తి సాధకమయిన శివకేశవారాధన నెలకొల్పెను. ఆ కాలమున కేశవ, నారాయణ, మాధవ, గోవింద, విష్ణు త్రివిక్రమ, పురోషత్తమ, పద్మనాభ, జనార్దన, శ్రీకృష్ణ, మొద

లయిన నామములతో దేవతాప్రతిమలతో విష్ణువునకు దేశమందంతటను పూజలు దేవాలయములు వెలసెను. శివునకుకూడ పాశుపత మూర్తి, భీమేశ్వరుడు, ఈశ్వరుడు, మల్లేశ్వరుడు, నాగేశ్వరుడు, త్రికూటేశ్వరుడు ఇత్యాది పేర్లతో దేవాలయములు వెలసెను. శివాలయము లన్నియూ చిత్రముగ, కొండలమీదనే మొదట ఆవిర్భవించెను. అందుచేత 'మల్లేశ్వరుడు' (మల=కొండ) పెక్కుతావులందు వెలసినాడు. పాశుపత మూర్తి సాంబుడుకాదు, దక్షిణామూర్తి. ఆ కారణమున శ్రీశైలమునందు నెలకొనియున్న శివుడొక్కడు సాంబుడు. మిగిలినచోట్ల, శివుడు దక్షిణామూర్తి. ఈ విషయమొక్కటి ఆంధ్రశైవము పాశుపత మని నిర్ణయించుటకు చాలును. ఈశ్వరుడు అంబాసహితుడై తెనుగుదేశమున శ్రీశైలమం దొక్క తావునందే ఆది కాలమున ప్రభవించినాడు. ప్రసిద్ధములయిన పంచారామములందు శివుడు దక్షిణామూర్తియే. దాక్షారామ కుమారారామ (సామర్లకోట భీమవరము) క్షీరారామ (పాలకొల్లు) చినడాకరామ (నేటి గుడిపూడి - భీమవరము) అమరారామ ఈ అయిదు ఆరామములందును శివునికి ప్రక్క అంబ (పార్వతి) లేదు. చాళుక్యుల కాలమునాడు దాక్షారామ భీమేశుడు ఆ యాంధ్ర రాజవంశమునకు కులదైవము-ఆ కారణమున గాబోలు, పాశుపతమూర్తియైన భీమనాథునకు, దక్షిణామూర్తియై నప్పటికిని, మాణిక్యేశ్వరిని, శక్తిరూపిణిని, నెలకొల్పి, కళ్యాణోత్సవము తప్ప, మిగిలిన రాగభోగములతో కూడిన అన్ని యుత్సవములను, రాజలాంఛనములతో మహావైభవములతో జరిపించిరి. నిజమునకు పంచారామములందును శక్తి-అంబలేదు. ఇటీవల అజ్ఞానవశమున మనవారు నెలకొల్పి పూజలు కళ్యాణోత్సవములను జరుపుచున్నారు. ఆగమసిద్ధాంత ప్రతిపాదకములగు పంచారామక్షేత్రములందు శివకల్యాణము జరిపుట దోషము.

ఆంధ్రదేశమున ఈశ్వరునితో శివునితో సంపర్కము లేక, శక్తిపూజలమరియున్నవి. భరతఖండమునయున్న అష్టాదశ శక్తిపీఠములలో నాలుగు ఆంధ్రదేశమున నున్నవి. అవి పీఠికాపుర పురుహూతికా, దక్షవాటి మాణిక్యేశ్వరి, విజయవాటి కనక దుర్గ, శ్రీశైల భ్రమరాంబిక.

ఒకనాడు ఆంధ్రదేశము పాశుపత శైవాచారమునకు ఆటపట్టు. పంచారామ క్షేత్రములతోపాటు ఆంధ్రదేశమున నైఋతిగానున్న శ్రీశైలమును, ఉత్తరమునున్న కాళేశ్వరమును, ఆదిశైవ పాశుపతాచార సంప్రదాయములకు నెలవులై ప్రసిద్ధములయిన పాశుపతమతములకు ప్రాపులయ్యెను. అందువలన ఆంధ్ర భూమికి శైవ సంబంధమైన పేరు వచ్చెను. అన్ని శైవక్షేత్రములకంటె, శ్రీశైల, దక్షారామ, కాళేశ్వరములకు ప్రసిద్ధి ఎక్కువయయ్యెను. ఈ మూడు శివలింగములును ఆంధ్రేతరులకు కూడ శైవముమీద మోహమును బుట్టించెను-ఆంధ్రదేశము ఆ కారణమున ఆంధ్రేతరులకు త్రిలింగదేశమయ్యెను - ఆంధ్రులు తమ్ములను అన్య ప్రాంతీయులేపేరు పెట్టి పిలచిరో, తమ భూఖండమును ఏ పేరున వ్యవహరించిరో, ఆ పేరున తామును తమ దేశమును, భాషనుకూడ ఆ పేరునే, 'తెలుగుదేశమని, తెలుగువారమని, తెలుగుభాషయని అజ్ఞానవశులై వ్యవహరించుకొనసాగిరి.

క్రమక్రమముగా వైష్ణవ,-భాగవత సంప్రదాయము వ్యాపించిన కారణమున ఆంధ్రదేశమున నూటయెనిమిది తిరుపతులు వెలసెను. ఈ నూటయెనిమిది తిరుపతులను అయ్యలరాజు నారాయణామాత్యుడు హంసవింశతి యందు పేర్కొన్నాడు. ఆ నూటయెనిమిది తిరుపతులును, శైవక్షేత్రములంత ప్రాచీనములుగావు. వైష్ణవ (భాగవత) సంప్రదాయము దేశమునందు వ్యాపించినది నేటికి ఇంచుమించుగా వేయిన్ని ఇన్నూరు సంవత్సరములనాడు. అంతకుపూర్వముండిన వైష్ణవము ఒక విధముగా తరువాత, అనగా, 7, 8 శతాబ్దములనాడు వ్యాపించిన వైష్ణవముకంటె విలక్షణమైనది, విశిష్టమైనది. ఒక విధముగా శ్రీ రామానుజస్వామివారి విశిష్టాద్వైతమునకు దారితీసినది నూట ఎనిమిది తిరుపతులలో మిక్కిలి ప్రసిద్ధికెక్కినది శ్రీ వెంకటాచల స్వామికి నిధానమైన తిరుపతి; చిత్తూరుజిల్లాలో నున్నది.

ఈ తిరుపతి మిక్కిలి ప్రాచీనమైనది. ఎప్పుడో ఒకప్పుడీ తిరుపతి శ్రీనివాసమూర్తి, వేంకటాచలస్వామి గుడి, ఆదికాలమున స్కందుని దేవళమా, స్కందునికి పూజ లిక్కడ జరుగుచుండెనా, అను సంశయము కలుగును. తిరుపతితో సమానమైన మహత్తుగల దేవాలయము మరియొకటి ఆంధ్రదేశమున గానరాదు. కాని

నెల్లూరి రంగనాయకస్వామి, అహోబలం శ్రీలక్ష్మీనరసింహస్వామి, మంగళగిరి పానకాలరాయడు, బాపట్ల భావనారాయణస్వామి, కంసుకూరి జనార్దనస్వామి, మార్కాపురం (మార్గపురి) చెన్నకేశవస్వామి, కదిరి లక్ష్మీనరసింహస్వామి, పీఠికాపుర కుంతీమాధవస్వామి, సింహాద్రి నాథుడైన వరాహలక్ష్మీనరసింహమూర్తి, పద్మనాభమందు వేంచేసియున్న పద్మనాభుడు, రామతీర్థమునందు త్రివిధమూర్తి శ్రీకూర్మములోని శ్రీకూర్మనాధుడు, వేదాద్రి లక్ష్మీనరసింహస్వామి, ఒంటిమెట్ట కోదండరామస్వామి, శ్రీకాకుళం ఆంధ్రవల్లభుడు (తెనుగురాయడు) మాచెర్ల చెన్నకేశవుడు, పాకాల కోదండరామస్వామి మొదలగున వైష్ణవ ప్రతిమలు-క్షేత్రములు మిక్కిలి మహనీయములగునవి. వీటి యన్నిటికంటె భద్రాద్రి రఘురామునకు ప్రసిద్ధి ఎక్కువ వచ్చినది.

ప్రఖ్యాత శైవక్షేత్రములలో ఎన్నదగినవి హంపీ విరూపాక్షస్వామి, శ్రీకాళహస్తీశ్వరుడు, పుష్పగిరి వైద్యనాధస్వామి, త్రిపురాంతకేశ్వరుడు, కోటప్పకొండనుండి త్రికూటేశ్వరుడు, అనుమకొండ రుద్రేశ్వరుడు, ఓరుగంటి స్వయంభూదేవుడు, ఆవిర్భవించిన క్షేత్రములు.

పురాణోక్తదాహృతములగున శైవపీఠములలో హంపీ క్షేత్రమున వెలసియున్న భువనేశ్వరి, కాళహస్తియందావిర్భవించియున్న జ్ఞానప్రసూనాంబిక, 'త్రిపురాంతకమందు నెలకొనియున్న త్రిపురసుందరి, మహత్తరమయిన శక్తిగల పీఠములు. భువనేశ్వరి నారాధించి, విద్యారణ్యుడు విజయనగర సామ్రాజ్యమును నిర్మించెను. జ్ఞానప్రసూనాంబిక జీవన్ముక్తులు కాగోరువారి పాలిట పెన్నిధానము. త్రిపురసుందరి అతి భయంకరమైన శక్తి స్వరూపిణి. శక్త్యుపాసకులు సిద్ధిని బడయగోరి ఇచ్చట ఏకాంతవాసమున అంబ నారాధింతురు. ఈమె కడు భీకరమూర్తి.

కాలవశమునఅవశిష్టములైన శిల్పవిశేషములతో గూడినవి దేవాలయములు ఆంధ్రదేశమున ఎన్నోగలవు. సింహాచలము, దాక్షారామ, పీఠికాపురం, చాళుక్యభీమవరము (సామర్లకోట) చిక్కవోలు, గుడిపూడి (భీమవరము) శ్రీకాకుళము, అమరావతి, త్రిపురాంతకము, కంసుకూరు, అహోబలము. హంపి, తాడిపత్రి (తాడిపర్తి) పుష్పగిరి మొదలయిన వాటిని ఉదాహరింపవచ్చును.

చాళుక్యయుగమునకు పూర్వపు శిల్పము బౌద్ధధర్మముతో వెలసియుండెను. ఆ నాటి యవశిష్టము నేడు, నరసారావుపేట తాలూకా చేజెర్ల (చెంచెరువులు) గ్రామమున కపోతేశ్వర (శివా)లయమున గానవగును. ఇక్కడ శిల్పము చాల ప్రాచీనమైనది. విష్ణుకుండిన మహారాజుల నాటి శిల్పము తత్పూర్వపు శిల్పమును గూడ కొండలయందు దొలువబడిన దేవాయతనములందు గానవచ్చుచున్నది. బెజవాడకు ఆవలియొడ్డున ఉండవిల్లి గుహలందు నిర్మితమైన నాలుగంతస్తులు గల అనంత పద్మనాభుని గుహాలయము వర్ణనాతీతము. విష్ణుకుండివంశపు రాజులకు రెండు మూడు వందల సంవత్సరముల పూర్వము వర్ధిల్లిన రాజవంశముల ప్రాపున వర్ధిల్లిన పాశుపత శైవము. శక్తిసహితమైన ఈశ్వరారాధన సూచించుచు అర్ధనారీశ్వర పూజను ఆంధ్రదేశమున వ్యాపించినట్లు తెలుపు శిలాప్రతిమలు, గుహాలయములు బెజవాడ చెంత మొగలరాజపురమునందు గాననగును. చాళుక్యశిల్పము, ఆనుమారేండ్లుగా వర్ధిల్లిన శిల్పకళ, నైపుణ్యము, దాక్షారామము, సింహాచలము, పిఠాపురము, చాళుక్యభీమవరము, శ్రీకాకుళము, అమరావతి, త్రిపురాంతకము, కదిరి, శ్రీశైలము మొదలయిన తావులందు ప్రతిఫలించుచున్నది.

హంపి విరూపాక్షము, అహోబలము, శ్రీశైలము, ఇత్యాది దివ్యక్షేత్రములందు, ప్రాచీన విజయనగర శిల్పము గానవగును. యుగయుగముల క్రమముగా శిల్ప చారిత్రమును వ్రాయవలయును. ఆంధ్రజాతి మతధర్మములు ఎట్లు కాలవశమున క్రమముగా మార్పుచెంది, ఆదికాలమునాటి చిహ్నములను స్మృతిపథమున లీనము చేసికొనెనో, ఆ విధముగానే, శిల్పముగూడ అతి విచిత్రముగ మార్పు చెందెను.

ఆంధ్ర దేవాలయములను రెండు విధములుగా విభజింపవచ్చును. అతి ప్రాచీనములయినవి. చరిత్రమునకు ఆధారభూతములయినవి. శిల్పశోభతోపాటు మహత్తు కలవి మొదటివి. కేవలము శిల్పసంపదను మాత్రమే కలిగి, మహత్త్వమును గోల్పోయినవి రెండవ తరగతివి. వీటిలో మొదట చేర్పదగినది లేపాక్షీ వీరభద్రేశ్వరాలయము. అహోబల, త్రిపురాంతకాదులు గూడ ఈ తరగతిలోనివే. మూడవజాతివి శిల్పసంపద ఒకప్పుడు విశిష్టమైన వైభవము ననుభవించి, నేడు దిక్కుమాలియున్నవి, అనేకములుగలవు. ఒక్కొక్క దేవాలయమును వర్ణించి ఒక గ్రంథము వ్రాయవచ్చును. ఆంధ్ర దేవాలయముల శోభను, తనివితీర వర్ణింపవచ్చును. శిల్పసంపదను వెల్లడింపవచ్చును. ఆది ఎవరైన గొప్ప విద్వాంసులు చేయవలసినపని.

# రాష్ట్రేతరాంధ్రప్రదేశములు

## ఉత్కళ రాష్ట్రములో అక్రమంగాచేరిన ఆంధ్ర భాగములు

### పర్లాకిమిడి

శ్రీ గిడుగు వేంకట సీతాపతి

1936 సం॥ లో ఉత్కళరాష్ట్ర మేర్పడినప్పుడు గంజాం జిల్లాలోని భాగములు కొన్ని ఉత్కళరాష్ట్రములో కలిసినవి. ఇందులో భాషను పట్టిగాని జాతిని బట్టిగాని ఉత్కళులు అధిక సంఖ్యాకులయి ఉన్న భాగములను ఉత్కళరాష్ట్రములో కలుపుట సక్రమంగానే ఉన్నది; గాని ఆంధ్రులు భాషనుబట్టిన్ని జాతినిబట్టిన్ని అధిక సంఖ్యాకులయి ఉన్న భాగములను-బరంపురం తాలూకాలో కొంత భాగమున్ను, పర్లాకిమిడి తాలూకాలో కొంత భాగమున్ను కలుపుట మాత్రము కేవలము అన్యాయము, అక్రమము. ఏజెన్సీ ప్రదేశములలో ఆంధ్రులకన్న ఉత్కళులు కొద్దిగా అధికసంఖ్యాకులే అయినను ఆంధ్రులకన్నను ఉత్కళులకన్నను అత్యధికసంఖ్యాకులు కోయలు, సవరలు మొదలయిన ఆదిమనివాసులు. ఈ ఆదిమనివాసుల వైజ్ఞానికాభివృద్ధికి, ఈ ఏజెన్సీ ప్రాంతముల సర్వతోముఖాభివృద్ధికి అమితముగా ధనము వెచ్చించి పాటుపడినవారు చెన్నపురి ప్రభుత్వమువారు. ఈ మేలు పనులు ఇంకను చేయుటగాని, జరిగిన మేలయినను నిలబెట్టుకొనుటగాని ఆర్థికముగా శక్తిచాలని ఉత్కళరాష్ట్ర ప్రభుత్వమునకు అసాధ్యమైన పనులు. ఉత్కళరాష్ట్రములో చేరుటచేత ఏజెన్సీ పరిస్థితులు చెడినవి. జయపుర సంస్థానం వారికిని, ఆదిమనివాసులకును క్లిష్టమైన దుస్థితి ఏర్పడినది. ఉత్కళరాష్ట్రము కేవలము ఉత్కళుల క్షేమమునకే అన్న స్వార్థపరత్వ సిద్ధాంతము ననుసరించి ఉత్కళ ప్రభుత్వమువారు ఆంధ్రులకు అన్నివిధములను అపకారంచేస్తూ ఉండడంచేత ఉత్కళరాష్ట్రమందలి ఆంధ్రులకు కలుగుతున్న బాధలు దుర్భరములయినవి. ఎన్నటికైనను ఆంధ్రరాష్ట్ర మేర్పడి తామున్నప్రదేశములు మరల ఆంధ్రదేశములోనికి వచ్చునా అని అక్కడి ఆంధ్రులు ఆశాపూరితమైన నిరీక్షణలో ఉన్నారు.

ఈ క్రిందను కనబరచిన పట్టికలనుబట్టి ఉత్కళ రాష్ట్రములలో ఆంధ్రులు అధికసంఖ్యాకులయి ఉన్న ప్రదేశములను గుర్తించవచ్చును.

I. బరంపురము తాలూకా తూర్పుభాగము :

మొత్తం జనసంఖ్య—95,565

1. జాతినిబట్టి ఉత్కళులు—23,104
   ఆంధ్రులు—67,097
   తక్కినవారు— 5,354
2. భాషనుబట్టి ఉత్కళులు—25,924
   ఆంధ్రులు—69,545
   తక్కినవారు— 96

II. ఛత్రపురం తాలూకా తూర్పుభాగము :

మొత్తం జనసంఖ్య—28,141

1. జాతినిబట్టి ఉత్కళులు—10,886
   ఆంధ్రులు—16,870
   తక్కినవారు— 385
2. భాషనుబట్టి ఉత్కళులు—11,468
   ఆంధ్రులు—16,573
   తక్కినవారు— 105

III. పర్లాకిమిడి తాలూకాలో ఉత్కళరాష్ట్రములో చేర్చిన ప్రదేశమందు మొత్తం జనసంఖ్య-106,248

1. జాతినిబట్టి ఉత్కళులు—36,127
   ఆంధ్రులు—60,876
   సవరలు— 9,145
1. భాషనుబట్టి ఉత్కళులు—35,227
   ఆంధ్రులు—62,376
   సవరలు— 8,645

ఈ పట్టికలనుబట్టి ఈ ప్రదేశములను ఉత్కళ రాష్ట్రములో చేర్చుట ఎంత ఘోరమైన అన్యాయమో, ఎవ్వరైనా తెలిసికోగలరు. అయితే ప్రభుత్వమువారు ఎందుకు చేర్చినారు? వారికి ఈ విషయము తెలియలేదా? అంటే, తెలియలేదు. "ఉత్కళ రాష్ట్రము చిన్నది. కటకపురి కాక మరి యేదీ నగరమూ, పట్టణమూ అని పేర్కొనదగినదిలేదు గనుక ఆంధ్రులకు అన్యాయ్యమే అయినా ఉత్కళులకు కావలెను గనుక బరంపురం, గోపాలపురం, ఛత్రపురం కలిపినా" మన్నారు.

ఇక పర్లాకిమిడి తాలూకాలోని ఆంధ్రులకు జరిగిన మోసం, అన్యాయం, అపకారం చెప్ప నలవికాగు. ఈ తాలూకాలో ఒక చిన్న భాగమైనా ఉత్కళ రాష్ట్రములో చేర్చుటకు ఆధారములేదన్న విషయము హృదయపూర్వకముగా అందరును గుర్తించినదే. అయినా, చివరకు పర్లాకిమిడి పట్టణమున్ను దానికి తూర్పువైపునను, పడమటివైపునను, దానికి ఉత్తరమందు గల ఏజెన్సీ ప్రాంతమువరకు వ్యాపించిన ప్రదేశమును ఉత్కళ రాష్ట్రములో చేర్చినారు. తాలూకా మొత్తంలో గల 6 వందల చిల్లర గ్రామాలలోను సుమారు 2 వందల గ్రామాలు పర్లాకిమిడి పట్టణంతో సహా ఉత్కళ రాష్ట్రములోనికి పోయినవి. ఈ 2 వందల గ్రామాలలోను సుమారు 60 గ్రామాలలో మాత్రమే ఆంధ్రులకంటె ఉత్కళులు అధిక సంఖ్యాకులు. అయితే ఈ 60 గ్రామాలు చెదిరి ఉన్నవే కాని ఒక్క ప్రదేశమందు కలిసి లేవు. అందుచేత ఉత్కళులు అధిక సంఖ్యాకులయి ఉన్న ప్రదేశము పట్టుమని పది చదరపు మైళ్ల వైశాల్యముగలది ఐనా ఎక్కడా లేదు.

ఇట్టి పరిస్థితులలో ఉత్కళరాష్ట్ర నిర్మాణానికి ఎక్కువ కృషిచేసిన పర్లాకిమిడి రాజును తృప్తిపరచడానికి అన్యాయమునకైనా ఒడికట్టుకొని ఒక చిన్న భాగమైనా పర్లాకిమిడి తాలూకాలోనికి ఉత్కళ రాష్ట్రములో చేర్చవలసినదని పార్లమెంటుకు శిఫారుసు చేస్తూ అందుకు ఆధారంగా ఇండియా కార్యదర్శి సర్ శామ్యుల్ హోర్ చెప్పిన సమాధానమేమంటే: "పర్లాకిమిడి రాజు ఉత్కళుడు; ఉత్కళరాష్ట్ర నిర్మాణానికి ప్రధాన కారకుడు. అతడు తన తాలూకా అంతా ఉత్కళరాష్ట్రములో చేర్చవలసినదని ప్రార్థిస్తున్నాడు. గాని ఆంధ్రులు అత్యధికసంఖ్యాకులుగా ఉన్న ఆ తాలూకా ఎట్లు చేర్చగలము? అయితే తాలూకాలో గల ఉత్కళులలో ఎక్కువమంది ఏజెన్సీ ప్రాంతమువైపు ఉన్నారు. గనుక ఈ ఏజెన్సీ ప్రాంతమందుగల భాగము ఉత్కళరాష్ట్రములో చేర్చవచ్చును. అప్పుడు ఏజెన్సీ ప్రదేశమున్ను ఈ భాగమున్ను కలిపిచూస్తే ఆంధ్రులకంటె ఉత్కళులు అధికసంఖ్యాకులు అవుతారు." ఈవిధంగాచెప్పిన సమాధానము ఎంత అసందర్భమైనదో సర్ శామ్యు అల్ హోర్ కొద్దిగానైనా ఆలోచించుకోలేదు. పర్లాకిమిడి తాలూకాకు ఏజెన్సీకి సంబంధమేమిటో? తాలూకా పర్లాకిమిడి జమీందారీలోనిదే కాని ఏజెన్సీమాత్రం కాదు; ప్రభుత్వమువారిది. అసందర్భంగా ఈ రెండు ప్రదేశాలున్ను కలిపి చూచినా ఉత్కళులకంటె ఆంధ్రులే ఎక్కువగా ఉన్నారు. ఈ క్రిందను కనబరచిన పట్టికలు చూడండి :—

జాతిని బట్టి

| | ఉత్కళులు | ఆంధ్రులు | సవరలు మొ॥ | మొత్తం |
|---|---|---|---|---|
| 1. కలిపిన తాలూకా భాగము | 36,227 | 60,876 | 9,145 | 106,248 |
| 2. ఏజెన్సీ | 15,620 | 1,276 | 52,785 | 69,681 |
| మొత్తం | 51,847 | 62,152 | 61,930 | 175,929 |

భాషను బట్టి

| | | | | |
|---|---|---|---|---|
| 1. కలిపిన తాలూకా భాగము | 35,227 | 62,376 | 8,645 | 106,248 |
| 2. ఏజెన్సీ | 17,254 | 2,589 | 49,838 | 69,681 |
| మొత్తం | 52,481 | 64,965 | 57,988 | 175,929 |

ఈ అసందర్భపు కలియక వల్లనైనా ప్రయోజనము లేకపోయిన దన్న విషయముకూడా సర్ శామ్యూల్ హోరు గుర్తించకపోలేదు. అందుకు మరియొక యుక్తి చూపించి సమాధానపరచాడు. 'సవరలు ఆచార వ్యవహారాలలోను సంస్కృతి విషయంలో మాతో ఎక్కువ సంబంధము గలవారు; ఎక్కువచేరిక గలవారు' అని ఉత్కళులు అంటున్నారు; సవరలను ఉత్కళులను కలిపి లెక్కపెడితే ఆంధ్రులకంటె ఎక్కువగుతారు గనుక ఈ ప్రదేశము ఉత్కళరాష్ట్రంలో కలుపవచ్చును' అన్నాడు శామ్యుఅల్ హోరు. అతని సలహా ఆమోదించారు పార్లమెంటువారు.

ఇంత ఘోరమైన అక్రమపద్ధతిని బ్రిటిష్ ప్రభుత్వం వారు అనుసరిస్తారని ఎవరూ అనుకోలేదు. అదిగాక పర్లాకిమిడి తాలూకా ఉత్కళరాష్ట్రంలో కలుపవలెనన్న కోరిక ఈ రాజుకు 1930 లో పుట్టిందిగాని అంతకు పూర్వం ఇతనికీ పుట్టలేదు, మరి ఎవరికీ పుట్టలేదు.

1903 లో ఉత్కళులందరును ఒకే రాష్ట్రమందుండవలె నన్న అలజడి కలిగినప్పుడు గంజాం జిల్లాలో నొక భాగమున్ను, ఏజెన్సీప్రాంతాలున్ను వంగరాష్ట్రములో కలపడానికి వీలగునా? అందుకు ఆ భాగాలలో ఉన్న ఉత్కళ జమీందారులున్ను, ఉత్కళప్రజలున్ను ఇష్టపడుదురా? అనే విషయము తెలుసుకోవలెనని చెన్నపురి రాష్ట్రప్రభుత్వము వారిని కోరినప్పుడు అప్పటి పర్లాకిమిడిరాజు (నేటి మహారాజు తండ్రి) పర్లాకిమిడి తాలూకా చెన్నరాష్ట్రమందే ఉండవలెనుగాని వంగ రాష్ట్రములో చేర్చవలదని తెలియజేసెను. చెన్నపురి ప్రభుత్వము వారున్ను ఈ భాగములను వంగరాష్ట్రములో చేర్చుటకు ఒప్పుకోలేదు. ఆ తర్వాత 1912, 1921, 1925, 1926 లో ఈ విషయము ఆలోచనకు వచ్చినప్పుడు కూడా ఈ అభిప్రాయమునే చెన్నపురి ప్రభుత్వమువారు తెలియజేస్తూ వచ్చారు.

1924 లో ఫిలిప్-డఫ్ కమిటీ పర్లాకిమిడికి వచ్చి ఉత్కళుల అభిప్రాయము తెలిసికోగోరినప్పుడు పర్లాకిమిడి రాజు (ఇప్పటి మహారాజే) తన అసమ్మతిని తెలియజేస్తూ 'ఉత్కళ రాష్ట్రములో నా పర్లాకిమిడితాలూకా కలిపిన యెడల ఇక్కడి తెలుగు రైతులతో నాకు తగాదా వచ్చునన్న భయము కల'దని చెప్పెను. తర్వాత సైమను కమిషను సబ్ కమిటీవారుకూడా ఉత్కళ దేశములో పర్లాకిమిడితాలూకా చేర్చుటకు వీలుకాదని చెప్పిరి. పిమ్మట 1930-1 లో రౌండుటేబిల్ కాన్ఫరెన్సు నాటికి మాత్రము పర్లాకిమిడి రాజుకు ఉత్కళాభిమానము అతిశయించినది. ఉత్కళ రాష్ట్ర నిర్మాణము వెంటనే కావలెనన్న తన కోరిక తెలియజేసి పర్లాకిమిడి రాజు రాష్ట్ర నిర్మాణ విషయములో వెంటనే కృతకృత్యుడైనాడు. 1931 ఓడోనెల్ కమిటీవారు ఏయే ప్రదేశములనుచేర్చి ఉత్కళ రాష్ట్ర మేర్పరచవలెనో నిర్ణయించుటకు పని ప్రారంభించిరి. ఆ కమిటీలో ఉండిన ముగ్గురు సభ్యులలోను ఇద్దరు (ఫ్రూకన్ మెహతాలు) పర్లాకిమిడి తాలూకాలో ఆంధ్రులే అధిక సంఖ్యాకులు అని ఒప్పుకొంటూ జమీందారు ఉత్కళుడు, అతనికి ఉత్కళరాష్ట్రములో ఉండవలెనని ఉన్నది గనుక పర్లాకిమిడితాలూకా ఉత్కళరాష్ట్రములో చేర్చవచ్చునని తమ అభిప్రాయము తెలియజేసిరి. గాని ఆ కమిటీకి అధ్యక్షుడైన ఓడోనెల్ మాత్రము అందుకు ఎంతమాత్రమును సమ్మతించక జమీందారు ఎంత ఇష్టపడి కోరినా ఒక్కవ్యక్తి కోరికనుబట్టి అధిక సంఖ్యాకుల అభిప్రాయమునకు ప్రతికూలంగా ఈ ప్రదేశమును ఉత్కళరాష్ట్రములో చేర్చకూడదు. చేర్చినట్టయితే వెంటనే అలజడిపుట్టి తీవ్రరూపమును దాల్చి తిరిగీ ఈ ప్రదేశము ఆంధ్రదేశములోనికి వచ్చినదాకా చెలరేగక మానదని తన అభిప్రాయమును స్పష్టపరచినాడు. ఈ ఉత్కళరాష్ట్ర పరిమితి విషయము పార్లమెంట్ కమిటీలో నిర్ణయించవలసి ఉండెను. అక్కడ తన అభీష్టమునకు ప్రతికూలముగా నిర్ణయము జరుగునేమో అను భయముతో పర్లాకిమిడి రాజు 1933 లో లండనుకు కొందరిని తోడుకొని వెడలి పర్లాకిమిడి తాలూకా అంతా ఉత్కళరాష్ట్రములో చేర్చవలసినదని నచ్చజెప్పుటకు ప్రయత్నించెను. బరంపురం తాలూకా ఏజెన్సీప్రాంతాలు కూడా ఉత్కళ రాష్ట్రములోనే ఉంచవలెనన్న అలజడి కలుగచేయు

టకే తక్కిన ఉత్కళ ప్రముఖులుకూడా లండన్‌నగరమునకు వెళ్ళినారు. అప్పుడు ఆంధ్రుల ప్రతినిధులుకూడా సర్: కె. వి. రెడ్డినాయుడుగారిని తమ మొనగాని పెట్టుకొని బరంపురం మొదలయిన ఆంధ్రప్రదేశములు ఉత్కళరాష్ట్రంలో కలిసిపోకుండా చేయడానికి లండన్‌నగరమునకు వెళ్ళినారు. అప్పుడు పర్లాకిమిడి ఆంధ్రులు నన్ను ఆ ప్రతినిధుల సంఘముతో కలిసి పనిచేయుటకు గాను లండన్‌నగరమునకు పంపించినారు. పర్లాకిమిడి తాలూకాలో ఆంధ్రులు అత్యధిక సంఖ్యాకులు గనుక పర్లాకిమిడి తాలూకా ఏమాత్రమున్ను ఉత్కళ రాష్ట్రములో చేర్చరాదన్న విషయము చెన్నపురి ప్రభుత్వమువారును వైస్‌రాయిన్ని తెలియజేసి ఉన్నందున పర్లాకిమిడి రాజు అధికముగా కష్టపడవలసి వచ్చినది. తనకు అధికారరీత్యాగల పలుకుబడితో తాలూకాలోని ఆంధ్రులను కొద్దిమందిని వశపరచుకొని ఆంధ్రులకున్ను ఉత్కళరాష్ట్రములో చేరవలెనన్న కోరిక కలదని నిరూపించడానికి కొన్ని మహజర్లను తయారుచేయించి లండనులో ఈ విషయము విచారించదలచిన కమిటీవారికి అందజేసినాడు. అతని వాదన ఖండించి ఆంధ్రుల అసమ్మతిని నిరూపించటము నాపనిగా యుండెను. 1933 జూలై 3వ తేదీని ఉత్కళ ప్రతినిధులను 10వ తేదీని ఆంధ్ర ప్రతినిధులను పిలిచి కమిటీవారు విచారణ చేశారు. ఓడొనెల్ కమిటీ రిపోర్టు నిర్ణయాన్ని అనుసరించి ఉత్కళ రాష్ట్ర పరిమితి నిర్ణయించుటకు పూనుకొన్నవారు గనుక పర్లాకిమిడి తాలూకా ఉత్కళ రాష్ట్రములో కలుపుటకు అవకాశములేదన్న నమ్మకముతో ఉండిన ఆంధ్రులకు పర్లాకిమిడి రాజు చేస్తూ ఉండిన అలజడి వలన ఏమి జరుగునో అన్న భయముండబట్టే నన్ను లండన్ నగరము పంపించవలసివచ్చినది. ఆ విధముగానే ఓడొనెల్ కమిటీవారి నిర్ణయము ప్రకారము బరంపురము తాలూకా అంతా ఉత్కళరాష్ట్రములో కలియక తప్పదన్న నమ్మకము ఉత్కళులకు ఉన్నా ఆంధ్రుల అలజడివలన అది ఎక్కడ తప్పిపోవునో అను భయముండబట్టి ఉత్కళ ప్రతినిధులు కల్లికోట రాజు మొదలయినవారు లండన్‌లో పనిచేయవలసివచ్చినది. పైని చెప్పిన కమిటిలో సర్ శామ్యుఅల్ హోర్ అధ్యక్షుడు; సర్ ఎన్. సర్కార్, సర్. పి. సెత్నా, జఫ్రుల్లాఖాన్ మొదలయినవారు ఆగురు సభ్యులు. జూలై 3వ తేదీని పర్లాకిమిడి రాజు కమిటీవారికి నివేదించిన వాక్యములలో పర్లాకిమిడి తాలూకాలో అత్యధిక సంఖ్యాకులు ఆంధ్రులే అయినా తనతో కలిసి ఉత్కళ రాష్ట్రములో ఉండడానికి సమ్మతించినవారు అనేకులు కలరనిన్ని తాలూకా అంతా కలపడానికి వీలులేనప్పుడు ఉత్కళులు అధిక సంఖ్యాకులుగా ఉన్న భాగమైనా కలపవలసినదనిన్ని కోరెను. 10 వ తేదీని అతడు నివేదించిన విషయములను ఖండిస్తూ ఆంధ్రులలో-అతని కొలువులో ఉన్న ఏనలుగురితోతప్ప తక్కినవారందరున్ను అతని కోరిక మన్నించలేదనిన్ని పర్లాకిమిడి తాలూకాలో ఎక్కడా ఉత్కళులు అధిక సంఖ్యాకులుగా ఉన్న ప్రదేశము పట్టుమని పది చదరపు మైళ్లు వైశాల్యము గలదైనా లేదనిన్ని నేను నచ్చచెప్పాను. జనసంఖ్య వివరణములు, పట్టికలు కావలెనని కమిటీవారు కోరిరి. కావలసినవన్నీ సమర్పించాను. కమిటీవారు వాస్తవమైన సంగతులు తెలుసుకొనగలిగారు. నేను చెప్పిన దంతా నచ్చినది. పర్లాకిమిడి తాలూకాలో ఉత్కళరాష్ట్రమున చేర్చుటకు తగిన భాగము ఏదీ లేదన్న నిర్ణయానికే వచ్చారు. ఈ విషయము గూర్చి వెంటనే తీర్పు ప్రకటించవలసి వచ్చియుండిన యెడల పర్లాకిమిడి తాలూకా పూర్తిగా చెన్నపురి రాష్ట్రములోనే నిలిచి యుండేది. గాని ఆంధ్రుల దురదృష్టముచేత వెంటనే తీర్పుపుట్టక ఒక సంవత్సరము పైగా ఆగియుండెను. 1934 ఆగస్టు నాటికి నిర్ణయములో మార్పు కలిగినది. పర్లాకిమిడి రాజు మరల లండన్ నగరముపోయి అలజడి కలుగజేసి పర్లాకిమిడిలో ఒక చిన్న భాగమైనా ఉత్కళరాష్ట్రములో కలపకపోయినయెడల తన ప్రతిష్ఠకు భంగము కలుగునని మొరపెట్టి ఉత్కళులతో సవరలను చేర్చినయెడల ఒక భాగములో తాము అధిక సంఖ్యాకులు కావచ్చునని తెలియజేసి ఆ భాగము నిరూపించాడు. ఇతని పని బహిరంగం కాక రహస్యంగా సాగడంచేతను నిర్ణయమైన విషయము మరల ఆంధ్రుల ప్రతినిధులకు తెలియజేయకుండా మార్చరను నిండు నమ్మకముతోను నన్ను మరల లండన్ నగరమునకు పంపలేదు.

అందుచేత పర్లాకిమిడి రాజు చెప్పిన విషయములు విమర్శించకుండానే అనుసరించి పైని చెప్పిన విధమున ఒక భాగమును ఉత్కళరాష్ట్రములో చేర్చుటకు నిర్ణయించి ప్రభుత్వమువారు తమ కడపటి నివేదిక ప్రకటించారు. దానిని ప్రతిఘటించ డానికి అవకాశమే లేకపోయినది. దాని ననుసరించి చట్టము తయారైనది. 1933 లో ఉభయపక్షములవారి ప్రతినిధులను విచారించి చేసిన నిర్ణయమునకు విరుద్ధముగా 1934 లో ఒక్క పర్లాకిమిడి రాజు అలజడి కలుగజేసికొని నివేదించిన విషయములను నమ్మి వాటిలోగల యాథార్థ్యము విమర్శించి తెలుసుకోకుండా పాక్షికంగా తమ మొదటి నిర్ణయమును మార్చి ప్రకటించుటవలన ఆంధ్రులకు అన్యాయము జరిగినదని ఆంధ్రులు ఎంత మొరపెట్టుకొన్నా కార్యము లేకపోయినది. ఉత్కళరాష్ట్రములో చేర్చిన పర్లాకిమిడి తాలూకా భాగములో ఆంధ్రులే అధికసంఖ్యాకులనిన్ని, సవరలను తమతో కలుపుకొని లెక్కపెట్టుకొన్నా ఆంధ్రులే అధిక సంఖ్యాకులనిన్ని పైని ప్రదర్శించిన పట్టికలవలన స్పష్టము గదా. అయినను ఆంధ్రుల మొర పాటింపక ఆంధ్రులకు అన్యాయముచేసిన సర్ శామ్యూఅల్ హోరుమాట నెగ్గినది. పర్లాకిమిడి రాజు కొంతవరకయినా కృతకృత్యుడయినట్లు తృప్తి పొందెను. తన పక్షము వాదించి ఉత్కళరాష్ట్రములో చేరవలసినదని ఆంధ్రులకు బోధిస్తూ పర్లాకిమిడి రాజు ఇచ్చిన అభయము వృధా అయినది. కాక తప్పదని వివేకులు గుర్తించక పోలేదు. ఆంధ్రులకు తగిన ప్రాతినిధ్యము రాష్ట్ర శాసనసభలోను తక్కిన సంస్థలలోను జనసంఖ్యనుబట్టి పూర్తిగా ఉండేటట్లు తాను చేయగలనని నమ్మించెను. తన సంస్థానంలోను, తనకోటలోను తనమాట చెల్లినట్లు ఉత్కళరాష్ట్ర ప్రభుత్వవిషయములలోను తన మాటపూర్తిగా చెల్లగలదని ఆంధ్రులకిచ్చిన అభయము ఆపద మ్రొక్కులులాంటివని తెలుసుకోక అతనిమాటలు నమ్ముకొన్న ఆంధ్రులు ఇప్పుడు పూర్తిగా సకల కష్టములు అనుభవిస్తున్నారు. జమీందారీలు ఎగిరిపోతూ ఉన్న ఈ కాలములో పర్లాకిమిడి జమీందారు మాట రాష్ట్రప్రభుత్వములో చెల్లగలదా? పలుకుబడి వలన ప్రధానామాత్యుడయినా ఆపదవి నిలబెట్టుకొనుటకే శక్తిలేని-పర్లాకిమిడి మహారాజు ఉత్కళ రాష్ట్రములో ఆంధ్రులకు కలుగుతూఉన్న బాధ నివారించగలడా? అధిక సంఖ్యాకులు ఆంధ్రులైఉన్న ప్రదేశములు ఆంధ్ర రాష్ట్రములోనికి వచ్చినదాకా ఉత్కళ రాష్ట్రమందలి ఆంధ్రులబాధలు ఉపశమించవు. గనుక ఆంధ్రులందరును శ్రద్ధవహించి ఆంధ్రరాష్ట్రనిర్మాణమునకై తీవ్రమైన అలజడి గావించి ఆంధ్ర రాష్ట్రములో పర్లాకిమిడి, బరంపురము మొదలయిన ఆంధ్రప్రదేశములను చేర్పించవలసియున్నది.

---



# ఆంధ్రదేశంలో సంస్థలు

శ్రీ బుర్రా వెంకట సుబ్రహ్మణ్యం

రాజకీయాలలో కాంగ్రెసు మొదలు కమ్యూనిస్టుపార్టీ వరకున్నూ, దైవిక విషయాలలో రామ్మోహన్ రాయ్ మొదలు హరనాథ్ బాబు వరకున్నూ, సంఘసంస్కరణ విషయంలో వితంతువులను ఉద్ధరించడం మొదలు యానాదుల వంటివారిని ఉద్ధరించడం వరకున్నూ, ఆంధ్రదేశంలో లేవని సంస్థకాని, వేరుపారని సంస్థకాని హిందూదేశంలో ఎక్కడా ఉండదు. అంతటా కాంగ్రెసు కనిపించవచ్చును. కమ్యూనిస్టు పార్టీమాత్రం ఆంధ్రదేశంలో కనిపించినంతగా కన్నడ దేశంలో కాని, తమిళదేశంలో కాని కనపడదు. బెంగాలులో పుట్టిన బ్రహ్మ సమాజమతం ఆంధ్రదేశాన్నే ఆవరించుకోగలిగింది కాని దక్షిణాన్ని అంటలేకపోయింది. హరనాథ్ బాబా సంస్థకి ఆంధ్రదేశంలో ఉన్న పలుకుబడి తమిళదేశంలోకాని కన్నడదేశంలో కాని మళయాళంలోకాని లేదనే నా ఉద్దేశ్యం. వీరేశలింగంగారి వితంతోద్యమానికి సరిపోల్చగలిగే ఉద్యమం చెన్నరాష్ట్రంలో ఇతరప్రదేశాలలో ఎన్నడూ ప్రబలంగా లేదనే నాకు తోస్తుంది. హరిజనసంస్థకూడా కాంగ్రెస్సు కార్యక్రమంలో భాగం అవడంవల్లనే భారతదేశం అంతటా వ్యాపించిందికాని, పూర్తిగా సంఘసంస్కరణకి సంబంధించిన సంస్థమాత్రమే అయుంటే ఆంధ్రరాష్ట్రంలో ఉన్నంతతీవ్రంగా ఇతరరాష్ట్రాలలో ఉండకపోనేవుమో అనిపిస్తూ ఉంటుంది. హిందీభాషయొక్క ప్రచారంగురించి చెప్పనే అక్కరలేదు.

ఆలోచిస్తే ఈప్రత్యేకపరిస్థితికి కారణాలు కనపడకమానవు. ఆంగ్లేయ సామ్రాజ్యానికి హిందూదేశంలో ప్రథమసోపానమైన బెంగాలు రాష్ట్రం, ఆకారణంవల్లనో ఇతరకారణాలవల్ల కూడానో, జాతీయోద్యమాలలోనూ, సంఘసంస్కరణోద్యమాలలోనూ, సాహిత్య, కళ, విజ్ఞాన విశేషాలలోనూ దేశానికంతటికీ దారి చూపిస్తూ, కొన్ని ఇతరరాష్ట్రాలకంటె ఆంధ్రరాష్ట్రానికి ఎక్కువదగ్గరలో ఉండడంవల్ల, ఆంధ్రరాష్ట్రాన్ని ఉద్యమాల విషయంలో ఎక్కువ లోబరచుకుని ఉండొచ్చును. రైళ్లూ పెద్దచదువులూ ఉత్తరాన్ని బెంగాలురాష్ట్రానికీ దక్షిణాన్ని తమిళదేశానికీ వచ్చినంత త్వరలో ఆంధ్రదేశానికి రానందున, ఇప్పటికింకా ఆంధ్రప్రజ గడుసుతనాలకి పోనటువంటిన్నీ, ధారాళమైనటువంటిన్నీ ఎటువంటి ఉద్యమాన్ని అయినా ఆహ్వానించేటటువంటిన్నీ ప్రజ అయుండొచ్చును. ఆంధ్రదేశంలో, అందులో ముఖ్యంగా కోస్తాజిల్లాలలో, పైరుపంటలూ ధనమూ ఎక్కువ ఉండడంవల్ల, ప్రజకి సామాన్యంగా ఉద్యమాలలో పాల్గొనే సావకాశమూ అభిలాషకూడా ఎక్కువగా ఉండొచ్చును. కాని, ఇటువంటి కారణాలన్నిటికంటే ముఖ్యమైన కారణం ఆంధ్రులయొక్క స్వభావం అని నా ఉద్దేశ్యం. ఆంధ్రుల ముఖ్యస్వభావం ఏమిటని ప్రశ్నిస్తే, ఉత్సాహం అని జవాబు ఇవ్వవలసి వస్తుంది. ఈ ఉత్సాహాన్ని ఏసంస్థ అయినా రేకెత్తించగలదు. అందువల్లనే మంచిసంస్థలకీ చెడ్డసంస్థలకీకూడా ఆంధ్రదేశం గొప్పదిగుమతి

ప్రదేశం అయిపోయింది. సంస్థల మంచిచెడ్డలను బట్టి సంస్థలు శాశ్వతమో అశాశ్వతమో కాలమే నిరూపిస్తూవస్తుంది. మంచి సంస్థలలో కూడా కొంత చెడుపు ఉంటుంది. చెడ్డసంస్థలలో కూడా కొంత మంచిఉంటుంది. ఆంధ్రదేశంలో వచ్చిపడ్డ సంస్థలయొక్క మంచి చెడ్డలు కాలం నిర్ణయించకపోదు. సంఘం యావత్తూకాని, సంఘంలో ఒక ముఖ్యభాగం కాని ఒక సంస్థని వెనకవేసుకున్నప్పుడు ఆసంస్థలో మంచిలేదన డానికి వీలులేదు. కాని, ఆంధ్రులు ఏసంస్థనైనా పిలిచి పోషించినప్పుడు ఆసంస్థలో ఉన్న మంచీ చెడ్డాకూడా మొత్తంగా తెలుసుకుని, మంచి కోసం మాత్రమే దాన్ని నిలవనిస్తారని చెప్పేం దుకు వీలులేదు. ఆంధ్రులకి సంస్థలోని మంచి చెడ్డలకంటె సంస్థలు సంస్థలుగానే ఎక్కువ అవ సరం. వాళ్లిఉత్సాహమే అటువంటి అవసరానికి కారణం. ఏమీ తోచనిమనిషి ఏదో క్లబ్బులో చేరి ఒకవిధమైన సంఘ జీవనానికి ఉపక్రమించి నట్టు ఆంధ్రులు సంస్థలలో చేరుతారు. క్లబ్బులో చేరేముందు అంతఅట్టహాసంగా క్లబ్బు ఎటు వంటిదో, క్లబ్బులో ఎటువంటివాళ్లు ఉన్నారో అన్ని అంశాలూ ముందే తెలుసుకునే ప్రయత్నం ఎవరూచెయ్యరు. సంస్థలవిషయంలో ఆంధ్రులూ అంతే. సంస్థలో ప్రయోజనం ఉన్నంతవరకూ సంస్థని వదలరు. ప్రయోజనం లేదని నిశ్చయించిననాడు వదలడానికి వెనుక తియ్యరు. సాంఘికంగా ఉత్సాహానికి తావివ్వ కలిగినదే సంస్థయొక్క ప్రయోజనం. సంస్థలో ప్రయోజనం లేనినాడు ప్రజలో ఉత్సాహం ఉండదు.

ఆంధ్రుల ఉత్సాహాన్నిగురించి పైన చెప్పిన విషయాలన్నీ ఒకసంస్థని ఉదాహరణగా తీసు కుని ప్రత్యేకంగా రుజువు పరచడానికి ప్రయ త్నించవచ్చును. బ్రహ్మసమాజ మతంగురించి ఆలోచిద్దాం. ఇప్పుడు బ్రహ్మసమాజంగురించి ఆంధ్రదేశంలోకూడా అంతగా వినం. కాని 30, 40 సంవత్సరాలక్రిందట బ్రహ్మసమాజం ఉన్నంత ప్రబలంగా ఆంధ్రదేశంలో ఏ సంస్థా లేదు. ఈ సంస్థ బెంగాలునుంచే ఆంధ్రదేశానికి రవాణా అయిందని చెప్పవచ్చును. రవాణా వస్తువు అయినప్పటికీ దేశంలో పుట్టిన సంస్థలాగే పెరిగింది. ఒక విధంగా వీరేశలింగంగారి సంఘసంస్కరణోద్యమాలకి తోడయింది. హిందూసంఘంలోనే ఉండి, సంస్కరణ సాధించ డానికి సాహసించలేని వాళ్ళందరూ హిందూ మతాన్నివీడి బ్రహ్మసమాజీకులయారు. ఆయన ఆఖరు రోజులలో, అంత ధైర్యశాలి అయిన వీరేశలింగంగారు కూడా బ్రహ్మసమాజికుడు అనిపించుకోవలసి వచ్చింది. కొన్ని సంవత్స రాలు జరిగేక సంఘసంస్కరణకి బ్రహ్మ సమాజం అనవసరం అయింది. ప్రజలలో ఏ ఉత్సాహం అయితే బ్రహ్మసమాజాన్ని లేవ తీసిందో ఆ ఉత్సాహం సంఘం అంతటా వ్యాపించి, కొద్దిమంది యొక్క ఉత్సాహం సంఘం యావత్తు యొక్క సామాన్యదృష్టిగా మారిపోయింది. సంస్థ లేవడమూ సంస్థ పోవ డమూ కూడా సంస్థయొక్క తప్పుకాని ఆంధ్రుల యొక్క తప్పుకాని కాకుండా, సహజంగానూ చరిత్రాత్మకంగానూ జరిగేయి. పొలంలోకి నీరు వచ్చి, నిలిచి, ఇంకి, పంటకి సహాయపడుతుంది. ఇప్పుడు పొలంలో నీరు లేనంతమాత్రాన కాని, ఇప్పుడు పొలానికి నీటి అవసరం లేనంత మాత్రానకాని పొలానికి నీటి అవసరం ఎన్నడూ లేనట్టుకాదు.

రాజకీయమైన ఉద్యమాలలో కూడా ఆంధ్రుల ముఖ్యప్రయోగం ఉత్సాహమే. ఆంధ్రులు ఏది సాధించదలచినా, ఏది సాధించగలిగినా, సాంఘిక సంబంధమైన ఉత్సాహాం మూలాన్నే. కాంగ్రెసుసంస్థ అన్నివిధాలా ఆంధ్రదేశంలో అఖండోద్యమం అయినట్టు ఇతర రాష్ట్రాలన్నిటిలోనూ కాలేదు. శాసనసభ లోనూ కార్యాలయలోనూ జరిగిన ఉత్తేజమైన కార్యక్రమాలు మళ్ళీ చీరాలలోనే జరిపించారు కాని మిగిలిన రాష్ట్రాలలో జరపబడలేదు. మిగిలినరాష్ట్రాలలో కాంగ్రెసుయొక్క బలం కాంగ్రెసుయొక్క పేరు మీదో కాంగ్రెసుయొక్క నిర్మాణం మీదో ఆధారపడి ఉందనీ, ఆ ఆధారం చాలునని చెప్పొచ్చునేమోకాని, ఆంధ్రుల విషయంలో ఇంత కాంగ్రెసువంటి సంస్థా ఆంధ్రప్రజయొక్క ఉత్సాహాన్ని ఎప్పటికప్పుడు చేరతీసుకుంటూ ఉంటే తప్ప, నిలుస్తుందో నిలవదో చెప్పడం కష్టం. ఇలా చెప్పడం కాంగ్రెసుసంస్థను లోకువ చెయ్యడమూ కాదు, ఆంధ్రులని అవమానపరచడమూ కాదు. ఆంధ్రరాష్ట్రం విషయంలో కాంగ్రెసు పెద్దలకీ ఆంధ్రులకీ ఉన్న మనస్పర్థలు అందరికీ తెలిసినవే. స్వరాజ్యం వచ్చిననాడు ఆంధ్రరాష్ట్రంలో కాంగ్రెసుసంస్థయొక్క బలం కాంగ్రెసు తోడ్పడేందుకు సాహసించే రాజకీయ ఆర్థికసాంఘిక విప్లవాలమీద ఆధారపడి ఉంటుంది కాని కాంగ్రెసుయొక్క గాని మహాత్ముడియొక్కగాని ఒట్టిపేరుమీదమాత్రం ఆధారపడిఉండదు. ఆంధ్రరాష్ట్రంలో కమ్యూనిస్టు పార్టీయొక్క బలమే ఈ సందర్భానికి నిదర్శనం.

ఆంధ్రుల ఉత్సాహంలో ఉన్న సాంఘిక గుణం దైవికమైన విషయాలలోనూ రాజకీయాలలోనూ మాత్రమే కాకుండా, సాహిత్యంలోనూ ఇతర కళలలోనూ కూడా కనిపిస్తుంది. చిత్రకళవిషయం ఆలోచిద్దాం. బెంగాలులో అవనీంద్రనాధ్ టాగూరూ, నందలాల్ బోసూ స్థాపించిన జాతీయవిధానం ఉంది. ఇది మన హిందూదేశానికి చెందిన ప్రత్యేకమైన విధానమనిన్నీ, ఈ విధానాన్ని పాటించడంలోనే జాతీయగౌరవం నిలబడుతుందనీ అనుకున్నప్పుడు బెంగాలు పద్ధతిని అనుసరించే చిత్రకారులు ఆంధ్రదేశంలో చాలామంది బయలుదేరేరు. వీరిలో ఎవరూ అంతగా పెద్దపేరు సంపాదించ లేదన్నమాట నిజమే. నిజానికి, చిత్రకళలో పేరుసంపాదించిన ఆంధ్రుడు చిన్నతనంలోనే చనిపోయిన దామర్ల రామారావు ఒకడే. అతను అనుసరించిన పద్ధతి బెంగాలు పద్ధతికాదు. ఇంకా బ్రతికిఉంటే అనుసరించి ఉండునేమో. అతను అనుసరించినది మాత్రం, చిత్రలేఖనకి ఒకదేశం అనీ ఒకజాతి అనీ ఒక విధానం అనీ లేదని చెప్తూ పాశ్చాత్య పద్ధతులను అనుసరించే బొంబాయిపద్ధతి. దామర్ల రామారావు దేశీయ ప్రాముఖ్యత లేని బొంబాయి పద్ధతులనుబట్టి చిత్రిస్తూ రావడం వల్లనే ఆ పద్ధతి కాని చిత్రకళ ఆంధ్రదేశంలో ప్రాబల్యంలోకి రాలేదు. రాజకీయాలలో స్వరాజ్యం అనీ స్వపరిపాలన అనీ బోధించే మంత్రంలాంటి మంత్రం, జాతీయతతో కూడుకున్నదీ, సాంఘికాభిలాషని పురికొల్పేదీ, చిత్రకళ విషయంలో ఆంధ్రదేశానికి అంతగా పట్టుబడకపోవడం వల్లనే ఈకళలో ఆంధ్రులు వెనక్కిపడ్డారు.

సాంఘికగుణం లేని కళ ఆంధ్రులని వశపరచుకోలేదనేందుకు సంగీతకళ కూడా ఒకనిర్ధారణ. సంగీతం విషయంలో మనదేశంలో పాశ్చాత్య సంగీతానికీ మన సంగీతానికీ పోటీ లేదు. మన సంగీతంకంటె పాశ్చాత్య సంగీతం ఎక్కువ రసవంతమైనదని కాని, ఎక్కువ రసవంతమైనదవడంవల్ల ఆ సంగీతపద్ధతులు మనం అనుసరించాలని కాని అనేవాళ్లు ఎవరూ లేరు. అజంతా చిత్రాలనీ, ఎల్లోరా శిల్పాలనీ, సాంచీ స్థూపాన్నీ, మధుర దేవాలయాన్నీ చూపిస్తూ చిత్రకళలోనూ శిల్పకళలోనూ మన కళాపద్ధతులు వేరనీ, మన పద్ధతులే మనం అవలంబించాలనీ ఒక జాతీయవాదన అవసరం అయింది. కాని, సంగీతం విషయంలో, మన సంగీతపద్ధతికీ మరొక దేశపు పద్ధతికీ పోటీరానందువల్ల ఈ జాతీయవాదన అనవసరం అయింది. జాతీయతకీ సాంఘికమైన ఉత్సాహానికీ సంగీతకళలో తావులేకపోయింది. అదికాక సంగీతం ఎవరికివారు వినికాని ఎవరికివారు పాడికాని ఆనందించవలసినదే. పాటకచ్చేరీలకి ఎంతమంది వెళ్తూ ఉన్నా సంగీతకళలో నిజమైన సాంఘికగుణంలేదు. ఈ కారణాలవల్లనే సంగీతం అంటే తమిళులకున్న అభిలాషా అభిరుచీ ఆంధ్రులకి లేదని తోస్తుంది.

నాటకకళ విషయంలో మాత్రం ఆంధ్రులకి అభిలాష చాలాఉంది. తమిళదేశంలో పాటకచ్చేరీలకిచ్చిన ప్రాముఖ్యతఆప్రజనాటకాలకివ్వదు. ఇంకాచూస్తే, నాటకాలని పాటకచ్చేరీలక్రింద మార్చడానికి చూస్తుంది. ఈ దుర్గుణం ఆంధ్రదేశంలోకూడా లేకపోలేదు. కాని నాటకకళని నాటకకళగా మాత్రమే పరిగణించడం ఆంధ్రదేశంలో ఎక్కువ. నాటకకళకి సాంఘిక వ్యవహారాలతోనూ సాంఘిక ప్రయోజనాలతోనూ సంబంధం ఉండడమే కారణంగా ఆంధ్రప్రజ ఈ కళని ఎక్కువ పోషిస్తున్నారని చెప్పడానికి వీలుంది.

ఆంధ్రదేశాన్ని ఎన్నిసంస్థలు దండెత్తుకు వచ్చినా, ఆంధ్రదేశం ఎన్ని సంస్థలకు లోబడినా, రానురాను ఆ సంస్థలు నిరుపయోగకరమయి, మాయమయాయి కాని, ఆంధ్రుల ఉత్సాహగుణం మాత్రం ఇతర సంస్థలకి అలా ఎదురుచూస్తూనే ఉంది. ముందుముందు రాజకీయమైన సంస్థలు ఎటువంటివి రానున్నాయో, హరనాథ్‌బాబులూ రమణమహర్షులూ పోయి ఎటువంటి మతగురువులు రానున్నారో, కొత్త కళలూ కొత్త కళాపద్ధతులూ ఎటువంటివి రానున్నాయో నిర్ణయించడం కష్టం. ఒక్క విషయమే నిశ్చయం. ఎటువంటి సంస్థనైనా ఆంధ్రదేశం అభిలాషతోనూ ఆదరణతోనూ అందుకుంటుంది.



# సైన్యము - ఆంధ్రులు

లెఫ్టినెంటు కలనల్
**తాదేపల్లి శంకరశాస్త్రి, ఐ. యం. యస్.**



ప్రతిదేశములోను భూవ్యవసాయము, సైన్యసేవ ఆదికాలమునుంచి ఏర్పడిన వృత్తులు. శాంతిసమయములో వ్యవసాయము, శత్రువుల దాడిని నిరోధించేందుకు సైన్యసేవ. ఆంధ్ర జాతియొక్క చరిత్రము చూచినచో ఆంధ్రులు తమదేశమును రక్షించుకొనుచూ, పరదేశములను జయించి శౌర్య వీర్యములు చూపించి, కీర్తిని సంపాదించినారు. గంగాతీరమందున్న పాటలీపుత్రము మొదలు, దక్షిణాగ్రముననున్న కన్యాకుమారీవరకు వున్న రాజ్యముల నన్నింటిని జయించి ఆంధ్రనాగరికతను ఘట్టిగా ఏర్పరచిన ఆంధ్రరాజులతో వెళ్ళి ఆ పరగణాలలో నివాసముల నేర్పరుచుకొనిన ఆంధ్రులే ఆదేశములలో ఇప్పుడు జగద్విఖ్యాతిని గాంచిన దేవాలయములనుకట్టి, చిత్తరువులను వ్రాసి, విగ్రహములను చెక్కి, నిర్జనమగు ప్రాంతములను పాడి పంటలతో నింపి భాగ్యదేవతకు ఆలవాలము చేసినవారు. ఇందుకు మూలకారణము వారి బాహుశక్తి, కరశరలాఘవములు, రణరంగనీతి, రాజ్యపాలనావిద్య. ఓరంగల్లు, విజయనగరము, బొబ్బిలి, కొండవీడు, పల్నాడు, హంపి మొదలగు రాజుల చర్యలు మఱచుటకు వీలులేనివి. ఆకాలములలో యువతీయువకులందరికి కర్రసాము, కత్తిసాములు, మల్లవిద్య, విలువిద్య, క్రూరజంతువేట వీటినన్నింటిని నేర్చుకొనుట అలవాటు. పూర్వచరిత్రను చదివినప్పుడు, హంపి మొదలగు ప్రాంతములను చూచినప్పుడు, మన పూర్వుల ప్రతిభ బాగుగ తెలిసి సంతోషము ఒకవైపున. ఆ యోధకవృత్తి ఇప్పుడు లేదుగదా అని విషాదము మరొకవైపున కలుగుచుండును.

ఇటీవల పూర్తి అయిన ప్రపంచ యుద్ధములో కొంతమంది ఆంధ్రులు చేరినారు. అందులో చాలామంది సైన్యమునుంచి విడుదలఅయి ఇండ్లకుచేరినారు. ఇప్పటి ప్రపంచస్థితిని విచారించితే ప్రతిదేశమునకు బలవంతమగు సైన్యము చాలా అవసరమని తోచును. ప్రతి జాతికి దురాశ ఎక్కువ అయినది. గనుక దేశరక్షణము మొట్టమొదటివిధి. ఇందుకు సైన్యముతప్ప వేరే సాధనములేదు. కొలదికాలములో బ్రిటీషువారు మన రాజ్యపాలనను మనకుఒప్పగించి పోయినప్పుడు, భరతఖండములో చిన్నచిన్న రాజ్యఖండములు ఏర్పడితే యుద్ధములు మెండగును. సంయుక్త భారత రాజ్యములో చాలా విపులమగు సేనలు అత్యావసరము. ఆంధ్ర రాజ్యమును ఏర్పరుపవలెను.

అప్పుడు ఆంధ్రసేన ఏర్పడవలెను. ఇది నిర్వివాదాంశము. గనుక మన యువకులు సైన్యములో చేరి, యుద్ధవిద్యను శ్రద్ధతో నేర్చుకొని చాలా సమర్థులు కావలెను. మనభారతస్వాతంత్ర్యమును అవిచ్ఛిన్నముగ నుండునట్లు పోషించుటకు మన విధియైయున్నను, సైన్యసేవలో చేరనియెడల ఆవిధిని నెరవేర్పజాలము. చేతికి అందిన స్వేచ్ఛను కోల్పోయి, భారతదేశమునకు చాలా గొప్ప అపకారమును చేసినవారమగుదుము. యుద్ధవిద్యలోను, రాజనీతిలోను, శౌర్యపరాక్రమములలోను ఆంధ్రులము ఏజాతికి తక్కువగాము. మన పూర్వ చరిత్రయే ఇందుకు తార్కాణము. గనుక మన యువకులందరు ఉత్సాహముతో, సైన్యములో చేరవలెను.

ఆంధ్రరాజ్యము త్వరలో నేర్పడును. దానికి చాలా పొడుగగు సముద్రతీరము గలదు. గనుక మనయువతీయువకులు నౌకాదళములో చేరవలెను. దాని విస్తీర్ణము అనేకమైళ్లుగలదు. విమానదళములో చేరి మన రాజ్య ఎల్లలను అనుక్షణమును రక్షించవలెను. గనుక పదాతిదళములలోను, కర్మాగార మోటారు దళములలోను చేరవలెను. అనేక వేలమందికి సైన్యవృత్తిలో జీవనాధారము గలదు. అందులో చేరవలసిన బాధ్యత మనది. చేరితే మంచికీర్తిని సంపాదించగలము. ఇప్పుడు సైన్యసేవ నిర్బంధము గాకపోయినను, వీలైన ప్రతివారున్నూ చేరవలెనని హృదయపూర్వకముగా హెచ్చరించుచున్నాను.



# దక్షిణదేశంలో తెనుగువారు

శ్రీ మావిడివఝ్ఝల వేంకటకృష్ణ శర్మ

భరతఖండము విస్తారమైన భూభాగము కలిగి పెక్కు రాష్ట్రములుగ, విభజింపబడియున్నది. ఇందు బహు భాషలు మాట్లాడేవాళ్లున్నారు. ఈ రాష్ట్రములలో ఒకటి తమిళనాడు. తమిళ చరిత్రములలో దక్షిణమున కన్యాకుమారి మొదలు ఉత్తరమున వడవేంగడము (తిరుపతి) వరకు యెల్లలుగ చెప్పబడియున్నది. ప్రస్తుతము చెంగల్పట్టు, దక్షిణార్కాడు, ఉత్తరార్కాడు, తంజావూరు, తిరుచినాపల్లి, మధుర, రామనాథం, తిరునెల్వేలి, కోయంబత్తూరు, సేలంజిల్లాలు తమిళనాడునకు చెందినవి. తమిళనాడులో అక్కడక్కడ కన్నడులు మళయాళీలు ఉన్నను అధిక సంఖ్యాకులు అరవలు. వీరికి తర్వాత తెలుగువారు లెక్కకు రాగలవారు. కర్నాటకులు కేరళులు కొన్నిచోట్లలో కాఫీహోటళ్ల బాధ్యతకు సంబంధించినవారు మాత్రమే కలరు. కాని తెలుగువారటుల గాక ప్రతి జిల్లాలో ప్రతి తాలూకాలోను పురాతన కాపురస్థులైయున్నారు. తెనుగువారికి తర్వాత మహారాష్ట్రులు కూడ యెన్నికకు రాతగినవారు కలరు. కన్నడ, కేరళ, మహారాష్ట్రులు కలిసినను తెలుగువారున్న సంఖ్యకంటెను చాల తక్కువవారే యగుదురు.

## ప్రవేశకాలము :

తమిళనాడున తెనుగువారు ప్రవేశించిన కాలమేది? ఈ విషయము నిర్ణయించుట సులభసాధ్యము కాదు. పౌరాణికులు, చరిత్ర పరిశోధకులు భాషావిమర్శకులీ ప్రశ్నను తీసికొని యెన్నివేల యేండ్లనైన ముందుకు లాగగలరు. వెనుకకు నెట్టివేయను గలరు. తెనుగు, కన్నడము, మలయాళము, తమిళభాషకు సన్నిహిత సంబంధము కలవి గనుక అరవదేశమున తెలుగువారెపుడు ప్రవేశించిరో చెప్పుట కష్టము. ఐనను కృష్ణదేవరాయల సామ్రాజ్యకాలమున పాండ్య, చోళ దేశాధిపతులు సామంతులుగ - మిత్రులుగ - శత్రువులుగ - ఉన్నప్పుడు, రాయబారులుగ - ఉద్యోగులుగ - ఆలోచనకర్తలుగ - బంధువులుగ - వ్యాపారులుగ - ప్రతినిధులుగ - యోధులుగ - కవులుగ - గాయకులుగ - పండితులుగ - యాజకులుగ - అధ్యాపకులుగ - తమిళనాడున తెలుగువారు ఎక్కువమంది ప్రవేశించి యుందురనుట నిర్వివాదాంశము. పాండ్య, చోళ దేశములకు ఆంధ్రనాయకులే పాలకులైరి కదా! కాంచీమండలపు చోళులును వేగదేశపు చాళుక్యులును సంబంధములు చేసికొనుటయు, ఇక్కడివారక్కడ అక్కడివారిక్కడ దత్తస్వీకారములు జరుపుకొని పాలనాధికారములు వహించియుండుటయు చరిత్ర ప్రసిద్ధములు. ఈ సంబంధములు తురకల పాలనము వచ్చువరకు నుండినవే. ఆంగ్లప్రవేశముతో కొస్త కూస్త వున్న రాజ్యములతోబాటు రాజకుటుంబములును పరిసమాప్తి నైపోయినవి.

## తెగలు :

అరవదేశమున తెనుగువారు బ్రహ్మక్షత్రియ వైశ్యాది నాలుగు వర్ణములవారు నున్నారు. వీరిలో రెడ్లు, కమ్మలు, దేవాంగులు, బలిజలు యెక్కువగనున్నారు. విశేషించి రెడ్లు కమ్మలు అన్నిజిల్లాలలోను కలరు. దేవాంగులు చెంగల్పట్టు దక్షిణార్కాడు సేలం జిల్లాలలో యెక్కువ జనమున్నారు. రెడ్లు దక్షిణార్కాడు జిల్లాలో నూటికి నలువదిమంది, ఉత్తరార్కాడు జిల్లాలో నూటికి ముప్పదిమంది, చెంగల్పట్టు జిల్లాలో నూటికి ముప్పదిమంది రెడ్లున్నారు. మధురజిల్లాలో రెడ్ల గ్రామములు అరవైనాలుగు ఒక్కచోట నున్నట్లును. గ్రామముల పేర్లు గ్రామములలో నున్న యిండ్లసంఖ్య జనసంఖ్యతోటి పట్టిక వున్నట్లును ఒక రెడ్డి ప్రముఖుడు మధురమండలవాసి నాకు చెప్పియున్నాడు. వైశ్యులు తక్కిన తెలుగువారివలె గాక పట్టణ స్థలములలో మాత్రమే యెక్కువమంది కలరు. రాజులు లెక్కకు రాదగినవారు చెంగల్పట్టు తంజావూరు మండలములందున్నారు. రామనాథపురము జిల్లాలోని రాజపాళయము ప్రసిద్ధిగ తమిళనాడున వాకొనబడుచున్నది. మదరాసు రాష్ట్రపు కాంగ్రెసు మంత్రులలో వ్యవసాయ శాఖా

మాత్యుడగు శ్రీ కుమారస్వామిరాజాగారి రాజ పాళయగ్రామ ప్రముఖులే యగుదురు. [ నూతనముగ నేర్పడిన మంత్రివర్గమున వీరు లేరు. సం.]

## వృత్తులు :

అందరకును వ్యవసాయమే ప్రధానవృత్తికాని వైశ్యులును దేవాంగులును వర్తకను నేతపరిశ్రమలనే ముఖ్యముగ భావించుచున్నారు. చెంగల్పట్టు జిల్లాలో చేరిన మధురాంతకము తాలూకాయందు జమీందారులైన రెడ్లు చాలమంది యున్నారు. తర్వాత కమ్మవారును జమీందారులు కలరు. చెంగల్పట్టు ఉత్తరార్కాడు జిల్లాలు గాక దక్షిణపు జిల్లాలలో ద్రవిడభాషయందు మంచి పాండిత్యము కలిగిన రెడ్డి కమ్మ బలిజ తెగలలో కొందరు ప్రముఖులు గలరు. తిరునల్వేలి జిల్లాలోని రెడ్లు కొందరు అరవలను మించిన ద్రవిడవాఙ్మయ పరిశోధకులు కలరు. ప్రస్తుతము మద్రాసు యూనివర్సిటికి సంబంధించిన తమిళవాఙ్మయ పరిశోధక సంఘమున సభ్యులుగ తిరునెల్వేలి జిల్లావాసియగు శ్రీ వేంకటరాజులు రెడ్డిగారు ( పన్మొళిప్పులవర్ ) బహుభాషాపండితులని పొగడ్త కన్నవారున్నారు.

కోయంబత్తూరు జిల్లాలోని మిల్లుల యజమానులును గలరు. వృత్తులలో భూసంపన్నత్వము సంపాదించిన వారుగలరు. ఒక్క తంజావూరు జిల్లాలో మాత్రము తెలుగు బ్రాహ్మణులే కరణీకము చేయుచున్నారు. తమ హోదాను అరవలకు యేదోవిధముగ సంక్రమింపచేసిన వారునుగలరు. కాని మొత్తముమీద కరణాలందరు తెనుగువారే. ఆంధ్రదేశమున నియోగిబ్రాహ్మణులు కరణాలుగ నుండిన అరవదేశపు తంజావూరు జిల్లాలో వైదీక బ్రాహ్మణులు కరణాలుగ నున్నారు. అఖండ ప్రజ్ఞావంతులు మహాతాంత్రికులునైన తంజావూరు జిల్లావాసులమధ్య వైదికులు కరణాలుగనుండి గణన కెక్కుచున్నారంటే 'కరణము వైదికుడైనను మరణాంతకమౌను,' అని పల్కిన సుమతిశతకపు పద్యమునకేదిగతి ? అని తోచుచుండుటలేదా ? తంజాపురి నేలిన నాగమనీడు విశ్వనాథనాయుడుగార్ల కాలమున ఆంధ్రవైదిక బ్రాహ్మణులకు కరణీకము లేర్పడినట్లు ఆకరణాలవల్ల తెలిసెడు.

## శాఖాభేదములు :

ఆంధ్రదేశమున నున్నంత అంతశ్శాఖాభేదములు కమ్మవారిలో, రాజులలో వైశ్యులలో, కానరావు కాని రెడ్లు, బ్రాహ్మణ శాఖలలో మాత్రము చాల తునుకలున్నవి. పాకనాడు, పోకనాడు, పంటకాపు, పల్లవరెడ్లు, దేసూరురెడ్లు, గండికోటరెడ్లు, మోటకాపు అను తెగలు రెడ్లలోనున్నవి. వెలనాడు, వేగినాడు, ములకనాడు, తెలగాణ్యం అను తెగలు బ్రాహ్మణులలోను గలవు. నియోగులు మాత్రము చెంగల్పట్టు దక్షిణార్కాడు జిల్లాలు తప్పితే తక్కిన జిల్లాలలో సకృతుగ నున్నారు. సంబంధ బాంధవ్యములలో బహుపట్టింపులున్నవి. తెనుగు నాడున చాలవరకు సంస్కరణకు సుముఖముగనుండు శాఖల సౌజన్యత అరవనాడులోని తెనుగువారికడలేవు. తమిళనాటికి తెలుగునాటికి యెల్లలో నుండు చెంగల్పట్టు జిల్లాలో మాత్రమే తెగలకన్నింటికి గృహనామము లున్నవి. అన్ని జాతుల వారును తమ గృహనామమును జ్ఞాపకముగ తప్పని సరిగ చెప్పగలరు, చెప్పెదరు కాని తక్కిన జిల్లాల యందుండు తెలుగువారియింటి పేరడిగిన పెదవి విరిచెదరు. తామున్న వూరి పేరి ప్రథమాక్షరమును, తండ్రిపేరట మొదట వర్ణమును మాత్రము చేర్చువారు కొందరును, తండ్రి పేరి అక్షర సంజ్ఞ మాత్రమేచేర్చి తమ నామమును ఉచ్చరించువారు పెక్కురును గలరు. కాని అన్నిజాతుల వారును తమ గోత్రములను మాత్రము మరచిపోలేదు.

## సాంప్రదాయికములు :

దేశము మారినపుడు దేశీయ సాంప్రదాయములును మారుట సహజము. కాని కుల కుటుంబ సాంప్రదాయములు మాత్రము అడుగులో మార్చుకొనుట దుస్సాధ్యము. సాంఘిక కార్యకలాపములు అన్నిజాతులు-- తెగలలోను కొంత మార్పుచెందక అట్టే నిలచియున్నవి. వివాహకాలమున, మాంగల్యస్వరూపము, వస్త్రధారణము, అపరకర్మకలాపము యివి యన్నియు కొన్ని ఆంధ్రదేశాచారముల ననుకరించియున్నవి. చెంగల్పట్టు దక్షిణ - ఉత్తరార్కాడులు తంజావూరు జిల్లాలవరకు

తెలుగువారికి తెలుగు బ్రాహ్మణులే హవ్యకవ్యములు చేయించుచున్నారు. వేషములు యెటు మార్చినను ముఖమున తెలుగుతత్వము సూక్ష్మముగనైన వ్యక్తము కాకపోదు. కోమటులున్న నగరములలో శ్రీ కన్యకాపరమేశ్వరీ దేవాలయములు తప్పక యున్నవి. అచటి పూజ సల్పువారాంధ్ర బ్రాహ్మణులే. ఈ సాంప్రదాయము వైశ్యమహాశయులు నేటివరకు అభిమానముతో గౌరవించుచున్నారు.

భాష :

దాదాపు ద్రవిడదేశమునందు తెలుగువారు యేబది లక్షలకు తక్కువగ నుండరు. ఇది నికరమైన లెక్క కాదు, 1920 సంవత్సరపు జనాభా ప్రకారము ఆంధ్రులు 36 లక్షల మందియట. ఈ యిరువదియేండ్లకు పది పదేనులక్ష లుండవచ్చునని యూహించి వ్రాయుచుంటిని. ఇంతమంది తెనుగువారిలో వ్రాయను చదువను నేర్చినవారు 50 వేలమంది గూడ వుండరనవచ్చును. పాండ్య చోళదేశములను తెలుగురాజులు పాలించు కాలములో తెనుగుభాషకు వ్యాప్తియు గౌరవమును కలిగి యుండెను. కావుననే విజయ విలాసము, సారంగధర చరిత్రము, రాధికాసాంత్వనము, జైమిని భారతము, మొదలైన గ్రంథములు వెలువడినవి. త్యాగబ్రహ్మం గారి పాటలు వినని పామరు లుండరు. అప్పుడు గూడ తిరునల్వేలి కోయంబత్తూరు రామనాథం సేలం జిల్లాలలో మాత్రము తెలుగు వ్యావహారికముగ నుండెనేగాని సారస్వతరూపముగ వెలువడినటుల తెలియలేదు. ముప్పది యేండ్ల క్రిందటివరకు అరవదేశములోని తెలుగువారి యిండ్లలో కొన్ని చోటులందు భారత భాగవత రామాయణాది యుద్గ్రంథములు తాటాకుప్రతు లుండినవి. వాఙ్మయ పరిశోధకులు కొందరా తాళప్రతులను మదరాసు ప్రాచ్య లిఖితగ్రంథ భాండాగారమున చేర్చిరి. ఆంధ్రసాహిత్య పరిషత్తువారును చాలవరకు స్వీకరించిరి. ఇంకను కొన్ని కుటుంబములలో తాటాకు పుస్తకము లున్నవి కాని అవి వారి కుపయోగకారులు కాకపోయినవి. వలయువారి కిచ్చుటకును మనసులొప్పవు. పెద్దలు సంపాదించిన ఆస్తియని సాకులు చెప్పుచు పుస్తకములను పురుగుల పాలు చేయుచున్నారు. ఇవన్ని యెటులున్నను అరవదేశములోని తెలుగువారమగు మే మనుభవించునది మాతృభాష చదువను వ్రాయను తెలియని దారిద్ర్యమే. మా మాటలు సయితము వికృతములని కొందరు ఆంధ్రదేశీయులు పరిహసించుచున్నారు. మా భాషా దారిద్ర్యమును జూచి సానుభూతి చూపించి మమ్ముద్ధరింపవలసినతోడి ఆంధ్రులు మమ్మేక సక్కెములాడుటను విన్నయప్పుడు ఆంధ్రదేశీయులయెడల మాకు సోదర సోదరీ భావములు కలుగుటకు బదులు అసంతృప్తియే కలుగుచున్నది. ఇటీవల రాజమహేంద్రవరసాంధ్ర మహాశయుడొక్కడు మా మొగమునగల నెత్తురు యెండిపోవునట్టి హీనపుమాటలతో పరిహసించెను. నవయుగము, నవనవభావములు, నవ్యభాష అన్న పేరులతో కర్త కర్మ క్రియా పురుషములను కాలములను తలక్రిందులు చేసి మీరు రచించు పుస్తకములు పలుకులు, దీర్ఘ హ్రస్వలోప ఆదేశపు వికారములతోడి మీ రచనలు అన్ని మండలములలోని ఆంధ్రులకే అంగీకారయోగ్యము కాకున్నది. తెలుగు వాసనయే లేని భాగమునందున్న మేము యింతమాత్రమైన భాషాతల్లిని సేవించుచుండుట మా పుణ్యమే కదాయని అతనికి ఆతురముతో బదులు చెప్పితిని. అచ్చపు తెలుగయ్యు మీ రుచ్చరించుటకు మరచి పోయిన అప్ప - అన్న-చొక్కము-ఓడియము - నిడియము - సొంపు-మొదలగు పదములను స్మరించుటకు నిత్య కృత్యములలో చేర్చుకొనియుండుటే మాకు తృప్తియని యేవేవో వెర్రిమొర్రి బదులు చెప్పితిని. ఇవన్ని అవమానమువల్ల పుట్టిన కోపముచే పల్కినవి. కాని మమ్ము ఆంధ్రదేశీయులు పరిహసించునట్లు మేము బదులు పరిహాసముచేయు మాటలని అర్థము కాదు. తమిళ దేశములోని తెలుగు వారి యెడల పెండైన సానుభూతి - దండియైన ఆదరణము- గల పుణ్యమూర్తులు ఉదారాంధ్ర మహాశయులు పెక్కురున్నారని మే మెఱుగుదుము. మా భాషాదారిద్ర్యమును బోగొట్టి మమ్ముద్ధరింప కంకణము గట్టుకొన్న దయార్ద్ర హృదయాంధ్ర మూర్తులున్నారనుటను మఱువబోము.

మేలనుకోరే దృష్టి సన్నగిలిన నిమిషాలలో కొందరు కొందరు కొన్ని కొన్ని చీలికలు తేను ప్రయత్నించినారు. వీటిని పర్దుబాటు చేయడానికి శ్రీబాగ్ వొడఁబడిక అని వొక యొడంబడిక జరిగింది. పిదప 1939లో బళ్లారిలో జరిగిన మహాసభలో సమాధానపు తీర్మానాలు కూడా నడచినవి. కాని ఈ పేక్టులు ఈ సమాధానాలు అనవసర ప్రసంగాలుగానే నాడు కనుపించినవి. ప్రజలభాషలో పరిపాలన జరుగకపోతే ప్రజలరాజ్యము స్థాపిస్తున్నా మనడం వట్టి బూటకం. మరేమీ నా కాశ్చర్యంలేదు. మన భాషలో మనభూమిని పరిపాలించుకొందా మనడానికి వాద ప్రతివాదాలు, యుక్తిప్రత్యుక్తులు, ఆక్షేపణ సమాధానాలు కావలసి వచ్చిందనడమే మన పారతంత్ర్యం మనల నెంత వ్యర్థులను చేసివేసిందో స్పష్టపరుస్తుంది. ఇంగ్లీషు వాడు తెలుగులో తనదేశాన్ని యేలనిస్తాడా? ఫ్రెంచివాడు జపానీసు భాషలో ఫ్రాంసును ఏలనిస్తాడా? ఇట్టిది అసహజం, వొక్క నిమిషకాలము కూడా నిలువకూడనిది, అనే స్ఫురణే మనలో కొందరికి లేకపోవడం నాకు విస్మయం కలిగిస్తుంది.

ఆ మాటకేమిగాని ఆంధ్రభూమిలో మనము ఆంధ్రోద్యమం ఆరంభించిన తరువాత కాంగ్రెసుచేత నాటి కాంగ్రెసు కార్యాలకు భారతభూమిని భాషాధారక ప్రాంతాలుగా విభజింపించినాము. ఇది స్థూలదృష్టిగా జరిగింది. బ్రిటిషుప్రభుత్వం విన్నటిపరకూ బాగా ప్రచారంలో వుందిగా! వారుపెట్టిన శాసనసభలలో—మద్రాసులోనైతేనేమి, కేంద్రంలోనైతేనేమి, శిష్టసభలలోనైతేనేమి—భాషాప్రయుక్తరాష్ట్ర తీర్మానాలు నెగ్గించినాం. షెమ్స్‌ఫర్డు రిపోర్టులోనూ సైమనుకమిషను రిపోర్టులోను అనుకూల సూక్తులు వారు ప్రయోగించకుండా తప్పింపికాదు. 1937 లో ఏర్పడిన కాంగ్రెసుప్రభుత్వము మద్రాసు కోస్తాలో అధికారంలో వున్నప్పుడు ఇండియా కార్యదర్శికి ఇక్కడి గవర్నమెంటుచేత వ్రాయింపించనూ వ్రాయింపించినాము. 1913 వ సంవత్సరానికి తరువాత మనం పలువురు ప్రముఖులను ఇంగ్లండుకు పంపించి రాయబారాలు జరిపినాము. ఎన్నిచేసినాసరే బ్రిటిషు అధికారులకు ఆంధ్రులంటే పెద్ద బెదురున్నట్లుంది. ఆ బెదురుచేతే వా శ్శేమీ మనకు వుప్పయినా పెట్టలేదని నా విశ్వాసం. సింధు వొరిస్సా వగైరా రాష్ట్రాలవంటి నేతిబీరకాయ రాష్ట్రాలుకాదు మనం కోరింది. మనభాషలో మన వ్యవహారం అంతా జరుగవలెననడం మన వుద్దేశం. ఇది యింగ్లీషు రాజనీతిజ్ఞులకు తెలియును. వారు మన కవకాశమిస్తే కర్నాటకులు, మరాటీలు, గుజరాతీలు, మలయాళీలు తాము భాషాధారక రాష్ట్రాలు మనవలెనే కోరుతారు. ఏకభాషాపుత్రు లొకే కోస్తాలోవుండే బంగాళము, బీహారువంటి చోట్లుకూడ దేశభాషలలో పరిపాలన జరుపవలె నంటారు. యింగ్లీషు భాషాధారక పరిపాలన రద్దవుతుందే. పుట్టి మునుగదా అనివారు ఆంధ్రులను పూర్ణానుస్వారంతో తృప్తిపడవలసిందన్నారు. జెట్లండు పలికినవాక్యాల కంతరార్థ మిదేయని నా నమ్మిక. బ్రిటిషు ప్రాబల్యం ముగిసింది. బ్రిటిషుప్రభుత్వం కథ కంచికేగింది. కాదు లండనుకు వెళ్ళింది. మరి యిప్పుడు అంతా మనచేతికే వచ్చిందనే సిద్ధాంతం యేర్పడింది. కాంగ్రెసువారు మొదటినుంచీ భాషాధారక రాష్ట్రవిభజన వొప్పుకున్నవారే. వీరిటీవలి ఎన్నికల ప్రకటనలో కూడా భాషాధారక రాష్ట్రవిభజన తమ ప్రణాళికలోని అంశాలలో వొకటిగా నమూదుచేసినారు. అందుచేత ఆంధ్రరాష్ట్రము చేతికందినట్లే కన్పిస్తుంది. కాని నిమిష నిమిషము ఏదో యొక క్రొత్త అంతరాయం తయారవుతూనే వుంటుంది. మనము సంపాదించే డెమోక్రసీ శుద్ధప్రజాసత్తాకమే యనే వుద్దేశాన్ని పరిషత్సభవారు ప్రకటించవలసిందని శ్రీపండిత జవహరిలాల్‌నెహ్రూ ప్రతిపాదన నెగ్గించినప్పుడు నామట్టుకు నాకు భాషాధారక రాష్ట్రవిభాగం స్వయంప్రకాశ మన్పించింది. బహుకాలంగా ఆంధ్రులయిన మనం కోరుతూ వస్తూవుండు ఆంధ్రరాష్ట్రమును వెంటనే విడదీసి యిత్తురనీ ఆంధ్రప్రాంతంలో తెలుగుభాష సర్వపరిపాలన కార్యాలకును అవలంబించుట జరుగుతుందనీ దానితో తమ్మును తామే పరిపాలించుకోవలసిన

ప్రజలు పరిపాలన వ్యవహారములలో పూర్తి యభినివేశం పొందడానికి అవకాశం కలుగుతుందనీ యెదురు చూచినాను. కాని అనుకొన్నరీతిగా కార్యములు నడవడం కనుపించలేదు. మన భవిష్యత్తును నిర్ణయింపగల యేకాధికారిగా ప్రస్తుతం ఏర్పడియుండే రాజ్యాంగ నిర్మాణ ప్రజాపరిషత్తు ప్రాంతాల పునర్విభజన విషయములో శ్రద్ధ కనుపరచుటలేదు. స్టియరింగు కమిటీయని సలహా సంఘమని మరియితర కమిటీలని ఉపసంఘాల ననేక మీపరిషత్తు సృష్టించియున్నది. వీటి కిష్టములేని విషయాలను వెనుకకు త్రోసిపెట్టేశక్తి వీటి కేర్పడియున్నది. మన యాంధ్రరాష్ట్ర సమస్య యిప్పటికే వీటి కారణంగా వెనుక బడియుంది. ఇంకా వెనుకబడే ధోరణియుంది. భాషా ప్రయుక్తరాష్ట్రాల సమస్యకు సంబంధించిన సమావేశము ఢిల్లీలో జరిగినప్పుడు మన కార్యక్రమమును పరిషత్తులో కనిపెట్టి పనిచేయడానికి పరిషత్తుసభ్యులు మాత్రమే కల యొక యుపసంఘాన్ని నియమించుకొంటిమి. వారు ఇంతవరకూ చక్కగా కృషిచేసిన్నీ ఈ సందర్భములో వొక రాయబారవర్గము పండిత జవహారిలాల్ నెహ్రూతో సంప్రతించగా వారు భాషాధారక రాష్ట్రవిభాగాన్ని అమలు పెట్టడము అంగీకరించిన్నీ అనుకోదగిన ప్రయోజన మిప్పటికేమీ కలుగలేదు. పరిస్థితు లిట్లుండగా ఇండియా కేంద్రప్రభుత్వానికి రాజ్యాంగనిర్మాణ విషయంలో సలహాదారుడయిన సర్. బి. ఎన్. రావుగారు తయారుచేసిన వొక క్రొత్తస్కీము తేది 22-3-47 పత్రికలలో ప్రకటితమయినది. దాని ననుసరించి మద్రాసురాష్ట్రాన్ని మూడు వుపరాష్ట్రాలుగా విభజించడం, మూటికి మూడు మంత్రివర్గా లేర్పడడం, మూడూ వొకే అధికారిక్రింద నడవడం సంభవిస్తుంది. ఈ మూడు వుపరాష్ట్రాలలో పరిపాలనకు ప్రాంతీయభాషే యేర్పడగలదనేమాట యెచ్చటాలేదు. ఇంతకంటే అన్యాయ మేమిటంటే, కాంగ్రెసు సభాధ్యక్షుడు శ్రీ కృప్లానీ మద్రాసులో స్వదేశీ ప్రదర్శనాన్ని ఆరంభిస్తూ అనవసరంగా భాషాధారక రాష్ట్రాలమాట దెచ్చి యిది తెలివితక్కువ వుద్యమమనీ నిరసించి ఆంధ్ర అరవలగొడవను అధికప్రసంగంగా విమర్శించినాడు.

ఆంధ్రులమయిన మనము మెలకువతో ప్రవర్తించకపోతే మన యభీష్టము నెరవేరనూ నెరవేరదు, నెరవేరినా దానికేదో వికారాకారము కలుగవచ్చును.

ఆంధ్రోద్యమమంటే వట్టి రాష్ట్రోద్యమం మాత్రం కాదు. ఈ వుద్యమ వుద్దేశాలలో ఆంధ్రుల సర్వతోముఖాభివృద్ధి సాధించదగినదిగా నిర్వచించడమయినది. ఆ కారణంచేత ఆంధ్రోద్యమాన్ని సాధించడాని కేర్పడిన ఆంధ్రమహాసభ యితర కార్యాచరణకూడ కావించింది. ఆంధ్రమహాసభతోపాటు ఇతర శాఖాసభలు జరుపడం కొన్నాళ్ళు ప్రోత్సహించింది. క్రొత్తక్రొత్తవుద్యమాలకు దోహదమిచ్చింది. ఆంధ్రులయిన వారి కీర్తి ప్రతిష్ఠలకు సంతసించి వారిని సత్కరించినవి. పండితులు, కవులు, గ్రంథకర్తలు, సంగీతవిద్వాంసులు వగైరాల కొకొక్కప్పుడు బిరుదములిచ్చి సత్కరించింది. రాష్ట్రేతర ప్రాంతాలలో నివసిస్తుండే ఆంధ్రసోదరుల కష్టనిష్ఠూరములను కనుగొనివాటి నివారణకు ప్రయత్నములు కావించింది. రాయలసీమలో కరువు పరిస్థితు లేర్పడినప్పుడు ద్రవ్యము పోగుచేసి తాత్కాలికమైన సంరక్షణ కలుగజేయడమే గాక ఖద్దరు నిర్మాణానికి శాశ్వతముగా తోడ్పడినది. ఇటీవలి దుర్దినములలో బళ్ళలో చదువు హరిజన బాలబాలికలకు తిండిపెట్టి సాకినది.

ఆంధ్రదేశంలోని సర్వప్రజలు ఆంధ్రోద్యమునందు సములు కాబట్టి రాజకీయ కక్షలుగా ఏర్పడి తమలో తాము హోరాహోరిగా పోరాడుకొనుచున్నప్పుడు ఆయా కక్షలనాయకులు ఆంధ్రమహాసభ వేదికమీద అన్నదమ్ములుగా ప్రేమపూర్వకముగా మెలగడం, పార్టీ వైషమ్యములేక పోవడంకూడ చూడగలిగినాము.

ఆంధ్రరాష్ట్రము సాధించడానికి ఇదివరలోవలెనే మనమంతా చేరి యింకా పాటుపడవలసియుంది. ఒకవేళ రాష్ట్రము సాధించుకొన్నా ఆంధ్రమహాసభ కార్యము పూర్తికాదు, ఆంధ్రభాషకూ ప్రాంతానికి చెందిన సర్వశాఖలలోని జీవితాన్ని కనిపెట్టుకొని సదుద్యమాలను ప్రోత్స

హిస్తూ యితరత్రా యెన్ని విభేదాలున్నా ఆంధ్రాభ్యుదయ ప్రయత్నాని కందరినీ సుముఖులనుచేస్తూ వుండేపని ఆంధ్రమహాసభకు విరంతరము వుండగలదని నా విశ్వాసము. అంటే ఆంధ్రదేశంలో పనిచేస్తుండే అన్నిజీవిత శాఖలలోని అధికారేతర సంస్థల కాంధ్రమహాసభ సమాఖ్య సంస్థగా ఏర్పడవలసియున్నదని నా మనవి. అన్నిశాఖల పనినీ ఆంధ్రమహాసభ నిర్వహించజాలదు కాని అన్ని శాఖలపనిని సమన్వయ దృష్టితో పరిశీలిస్తూ నడుప గలదనుటకు సందేహములేదు. భిన్నత్వమునను న్న యేకత్వాన్ని ప్రజలదృష్టికి అహరహము తేవడం మహ దాశయం. ఇందుకొరకు ఆంధ్రమహాసభ క్రమక్రమంగా సిద్ధపడవలెను. సిద్ధపడగలదనియూ నా విశ్వాసము. ఆంధ్ర అధికారేతర సంస్థలన్నీగూడా ఆంధ్రమహాసభలో స్వతంత్రములయిన వుపాంగాలుగా ఏర్పడి ఆంధ్రజీవిత మనే కల్పవృక్ష స్వరూపాన్ని తీర్చవలసియున్నది. ఇంత వరకూ యీకృషి యెక్కువ జరుగలేదు ఆంధ్రరాష్ట్ర సాధన దగ్గరయినట్లంతా ఆంధ్రాభ్యుదయ ప్రయత్నము ఆంధ్రమహాసభకు ప్రధాన కార్యక్రమము కాగలదు. ఆంధ్రాభ్యుదయ మహోత్సవాలు ఇప్పటికే చాలా జరుగు చున్నవి. ఇంకా జరుగగలవు. వైద్యమండలులు, సంగీత మండలులు, వ్యాయామమండలులు, నాట్యమండలులు, సారస్వత మండలులు, వాణిజ్య వ్యాపారమండలులు వగైరాలన్నీ ఆంధ్రమహాసభను మూలస్కంధంగా విరం తరము ఆరాధించే దినములు చూపుమేరలో వున్నవని నా నమ్మిక, జయమగుగాక.



# ఆంధ్ర సినిమా రంగము

డా॥ గోవిందరాజుల వేంకటసుబ్బారావు

కళల ఆశయాలు ఏవిటో, ముఖ్యముగా సినిమాకళ, నాటకకళ వీటియొక్క ఆశయాలు ఏమిటో, వీటి ఆచరణలు ఎలా వున్నవో యీ నవీనయుగంలో వీటి భవిష్యత్తు ఏమిటో యిటీవల నేను ఆంధ్రసంచికకు వ్రాసిన వ్యాసములలో సూచించాను. దానినిగురించి మళ్ళా చెప్పతలచలేదు. మొత్తంమీద వాస్తవిక నిరూపణ సినీమా పరమావధి అని దాంట్లో తేల్చాను.

ఆంధ్ర సినిమారంగాన్నిగురించి పరిశీలించి చూద్దాం. సినీమాకళ పాశ్చాత్యులవల్ల కనిపెట్టబడ్డది. వాళ్ళు మనకన్న ఎక్కువగా ముందంజవేసియున్నారు. దాని లోతుపాతులు వారికి తెలిసినట్లు మనకు అంతగా తెలియవు. వారివద్దనుండి, మనదేశీయులు అలవర్చుకొన్నది చాల కొలదికాలము క్రిందనే. అందులో ఆంధ్ర తమిళసోదరులు దీనిని యితర ప్రాంతాలవారికంటే కొంచెము ఆలస్యముగా అలవర్చుకొన్నారు. ఇంకా యీదులాడుతూనే వున్నారు. గట్టుకుగాని వక లంకకుగాని వీరు పట్టీపట్టని స్థితిలోనే వున్నారు. ఆంధ్ర సినిమారంగము, అనగా టాకీరంగము 1930 ప్రాంతాల నుంచి, ప్రారంభించిందని చెప్పవచ్చు. నూతనవిద్య కనక పట్టుబడదేమోనని భయముచేతనూ, వోటమికి జంకియు మొదట మనవారు పౌరాణిక గాథలను గౌరవించి గాలించి, వాటిని సినిమాల కెక్కించారు. రానురాను వాటి గతి 'చాటు నుంచే ఎంకి సభకు రాజేశావా, పది మంది నోళ్లల్లో పడమని వ్రాశాడా' అని వెంకి గుడ్ల నీరు క్రుక్కుకున్నట్లు అయిపోయింది.

దేవుళ్ళనూ, దేవతలనూ, వారివారి భార్యలను చెలికత్తెలనూ, వారుకూడా మన రాజుల్లాగానే ఉండి ఉండా లనుకొంటున్నాం గనుక వారి సింహాసనాలను, వారివారి దర్బారు హాళ్లనూ, అక్కడి హాస్యగాళ్లను, నారదుణ్ణీ, యిలా మన ఊహాప్రపంచంలోకి కూడా అందరాని వారి నందరినీ, వెండితెరమీదకు దండిదండిగా ఎక్కించాం. యింకా తనివితీరలేదు, ఎక్కిస్తూనే ఉన్నాం: అసలు చారిత్రాత్మికంగా ఉన్న గాథలకే సూటియైన పాత్రలు దొరక్క తన్నుకుంటున్నామే, పై వేషధారణకు మనకూ పాత్రలు యింత సులభంగా ఎలా దొరుకుతున్నారా అని నా ఆలోచన. ఏంలేదు; దీనికి కారణం వాస్తవమేమిటో అసల్లోనె తెలియదు గనుక, దానికెంత వ్యత్యాసంలో ఉన్నామో అంతకంటె వేయిరెట్లు బుర్ర కెక్కదు గనుక.

ఏదో, ఎప్పుడైనా, ఊసుబోకబోతె చలోక్తిగా తీసి 'చేతకాదు' అని విడిచిపెట్టవలసిన పౌరాణిక గాథలను, యిలా పట్టుకొమ్మలను చేసుకొని అక్కడనే త్రిశంకు స్వర్గంగా సదా ఎల్లప్పుడూ ఊగుతూవుండటం హాస్యాస్పదం. కళా వృద్ధిలోకి రాదు, కళారాధకులు అంతకంటేను.

అదీకాక, ఆ దేవుళ్లకు, ఆ దేవతలకూ అపచారాలు కూడా చేస్తున్నామేమో అని నా అభిప్రాయం. కాబట్టి మన మతం మీద మనకున్న గౌరవాన్నైనా పురస్కరించుకొని, వీటిని సినీమాగాథలగా చేసి హాస్యాస్పదం చెయ్యకుండా ఉంటే అందరం ధన్యాత్ముల మవుతామని ఎల్లప్పుడూ అనుకుంటూ ఉంటాను.

ఈ అగాథం తప్పించుకుంటె కొందరు, యిది విడిచి మరో అగాథంలోకి పడుతున్నారు. అదేమిటంటే భక్తుల గాథలు. వీటినికూడా చూసిచూసి విసుకుపుట్టిపోయింది ప్రేక్షకలోకానికి. 'హిందువులారా ఎన్నాళ్ళీగతి' అని అనిపించేదాకా కమ్మెచ్చుల్లో పెట్టి లాగారు ఈ కళాతంత్రిని మన ప్రొడ్యూసరు మహాశయులు.

అన్నిరసాల్లోకీ ఈ రసం ఒప్పించడం నటుడికి చాలా తేలిక పని: 'ఇది అసలు ఓరసమా' అని అనేవారు కూడా ఉన్నారు. అందరకు విదితమే. ఈకళ్లు మూసుకోటాలు, ఈ నిమీలితాలు, కాషాయాంబరాలు, గడ్డాలు, మొదలైనవి చూడంగా చూడంగా 'పాడిన పాటే పాడరా పాచిపళ్ల దాసరీ' అని అనాలనిపిస్తూంది, ఏం

చేసేది. ఏదో భక్తుల గాథలు చాలా తీశాం. మనకూ చూచేవారికీ వెగటుకూడ పుట్టింది,-పంచదార తిన్న కొద్దీ నోటికి చేదైనట్లు ఆ భక్తుల చరిత్రలోవున్న గాథ లన్నీ అయిపోయినట్లున్నాయని కూడ తోస్తున్నది. ఏమైనా మిగిలివుంటే తర్వాత ఎప్పుడైన తీద్దాం లెండి. ప్రస్తుతం మానెయ్యండి. మీకు నమస్కారము చేస్తాను.

సాంఘిక గాథలు బయటకు తీయ్యండి. చారిత్రాత్మకాలు బయటకు తియ్యండి. తేలికగ అన్నాను కాని యివి నిర్వహించడం ప్రస్తుత పరిస్థితులలో చాలా కష్టమని నాకు తెలుసును. కష్టంకంటె వీటిని తీయటానికి భయం. జంకుతో ప్రొడ్యూసర్లు కొట్టుకుంటున్నారని కొంత అర్థం అయింది యిటీవల.

కారణాలు ఏమిటా అని వూహించాను. ఇప్పటికి ఈ తరగతులలో మనము తీసినవి నూటికి తొంభై తొమ్మిది Flops అయిపోయినవి. ఎందుకంటే గాథలు సరియైనవికాక కాదు, వాటిలో లోపాలుండి కాదు. ముఖ్యకారణం పాశ్చాత్య సినిమా పరిశ్రమలో సినేరియో అని ఒక పదార్థముంది. అది వున్నదని తెలుసుగాని దాన్ని యెలా పచనం చెయ్యాలో చాలామందికి తెలియదు. కొద్దిమంది వున్నారని వుండి వుండాలని మాత్రం నాకు తెలుసు. వాళ్లని ముందుకు నడచివచ్చి బరిమీద నిలబడి యీ త్రోవే కాని వేరు లేదు దీని రహస్యం అని నలుగురికి శాసించి చెప్పమని నా వేడుకోలు. ప్రస్తుతం మనం వ్రాస్తున్నవి వ్రాసినవి సినేరియోలు కావు, సినేరియో యొక్క రూపాలు కాని. నాటకాన్ని ఏవిధంగా రంగ విభజనచేస్తున్నామో దాదాపు అదే విధముగ వుంటున్నది మన సినేరియోకూడ. దానికి తగినట్లు యిది వ్రాసేవారు కేవలం నాటకకర్తలు. దీంట్లో పాత్రనిర్వహణచేసేవారు నాటక నటీమణులు.

కళ్లు మూసుకొని ఆ యితివృత్తాన్నంతా ఆయాపాత్రలలో వారివారి ఆహార్యాలు మొదలైనవి అన్నిటిని చూస్తూ ఆనందించి, దాన్ని త్రిప్పి తిరిగి కాగితంమీద తూచాలు పోకుండ వ్రాతరూపకంగ డైరెక్టరుకు డైరెక్టివ్ యివ్వగలవాడే సినేరిస్టు. దాన్ని మననం చేసుకొని తానుకూడ మనస్సులో చిత్రించుకొని ఆదృశ్యాన్ని యాథత్తు సినేరిస్టులాగ మళ్లా తానుకూడ చూడగలవాడే డైరెక్టరు. అంటే యిద్దరుకూడ Fourth - Dimention యొక్క స్వరూపాన్ని శాస్త్రాన్ని తెలిసినవారుగా వుండాలి. ఇలాంటి పరిపక్వమైన సినేరియోలు యెన్ని చేతులలో వుంటె అన్నిలక్షల తరబడి ధనం సంపాయించే శక్తి ప్రొడ్యూసర్ల చేతిలో వున్నదన్నమాట.

ఒకే దృశ్యాన్ని యిద్దరు చూచినపుడు ఆ Angle బట్టి రూపం యిద్దరికి కొంచెం మార్పుగ కనుపడవచ్చు కాని యిద్దరు ఒకే Angle నుంచిచూస్తే డైరెక్టరు, సినేరిస్టు ఒకే దృశ్యాన్ని చూస్తాయి. చూచి 'అవునోయ్, బాగుంది, అంతే, అలాగే చేద్దాం, అలాగే చెయ్యాలి కూడ' అని సినేరిస్టుతో అంటాడు. కాని, "నువ్వు చూచింది దృశ్యమేకాదు, నేను చూచిందే అసలు దృశ్యం నోరుమూసుకొని అవతలకుపో" అనడు, రవ్వంత తన ఆత్మను ఎరిగినవాడైతే.

అంటే చూడకలిగితే ఆ Angleలో నేచూసి 'శభాష్' అంటాడు కాని "ఏడ్చినట్లుందిలే" అని అనడు. ఇది అంతా నిజమైన సినేరిస్టు, నిజమైన డైరెక్టరు తారసిల్లినప్పటిసంగతి. కొంతమంది రచయితలు వ్రాయంగా వ్రాయంగా దోవనపడ్డ వారున్నారు. కాని వారు కొలదిపాటి మాత్రమే. వారికి నా మనఃపూర్వకాభివందనాలు. వారే ముందు ముందు సినిమా కళోద్ధారకులవుతారు కాని, డబ్బుండి వూసుపోక నాలుగు రోజులు మద్రాసులో మోటారులో గడిపి నటీ నటులతో ఛీచి పికార్లుకొట్టి చివరకు పొలాలమ్ముకొని యింటివాళ్లను 'అలో లక్ష్మణా' అనిపించి, ఆసాంతాన అస్త్రసన్యాసం చేసి అంతరించిపోయే వాళ్లుకాదు. ఏనాటికైనా సినిమాకళను శాశించేది శాశించవలసింది, మెదడేగాని ధనంకాదు. ఈకళలో సరస్వతీ ప్రసన్నమే లక్ష్మికాని లక్ష్మీప్రసన్నము spencer Hotel కు ద్రోవతీసేదే.

ఇతివృత్తాన్ని దానిమీదవుండే గౌరవాన్ని బట్టి ఆరాధించి ప్రత్యక్షం చేసుకోవాలిగాని సినేరిస్టు, అందులో వచ్చే నటనటీమణుల శక్తిసామర్థ్యాలకు వారివారి యిష్టానుసారాలకు చెప్పుచేతలకు ఏమాత్రము లోబడకూడదు. కథ వీరినిబట్టి జరగలేదు; వీరికని జరగలేదు. అది వూరికే అలాగజరిగింది అంతే. చేతనైతే వీరు దాన్ని అనుకరించాలి. అది వీళ్ల నేమాత్రము అనుకరించదు అనుసరించదు. ఇది దీని నిజం.

మరో విషయంకూడ యీ సందర్భంలో ముచ్చటించవలసి వస్తున్నది.

అందరూ సదుద్దేశాలతోనే కళారాధనే ఆశయంగా లేకపోతే 50% కళారాధనగ 50% పర్సెంటు ద్రవ్యారాధనగ ప్రారంభిస్తారు. నేను కాదనటంలేదు. కాని తీరామోసి అంతా కార్యరూపానికి వచ్చేసరికి ఒక వికృతాకారంగా పరిణమిస్తుంది. కారణాలు మరి వేరే ఏమీ లేవు. నేను చెప్పబోయేవి తప్ప (1) మొదట అనుకున్న కథలో "Unity of purpose" వుంటుంది కాని అది నేను చెప్పిన ఆసినేరియో రూపం తాల్చేటప్పటికి "Variety of purposes" గా పరిణమిస్తుంది. విధవ వివాహం మొదటి purpose అయితే దాంట్లోకే కాంగ్రెస్సు దేశసేవ, హిందూమతము, లేకపోతే నాదసుధ, శ్రీకృష్ణభగవాన్ల ప్రత్యక్షం, ఇలాగే నా వూహకి అందనివికూడ వచ్చి పడిపోకానికి వస్తున్న దాన్ని విరిచి అన్నీ గడ్డలుగ, మట్టిగడ్డలుగ చేస్తుంది. ఇందువల్లనే కొన్ని చలన చిత్రాలకున్న పేర్లకూ లోపలున్న కథకు సంబంధమేమీ లేకుండపోయి రెంటికీ మధ్య పచ్చిగడ్డివేస్తే భగ్గుమండుతూ ఉంటుంది. అందుకని వీటికి నామకరణం తయారైనతర్వాత నలుగురు పెద్ద మనుష్యులను పిలిచి వారుసూచించిన రీతిగా చేస్తే బాగుంటుందేమోనని తోస్తుంది. (2) వ్యక్తులకోసం వ్రాస్తారు కథను, లేదా వ్రాసిన దానిని మారుస్తారు. వారి కొంతమంది వచ్చిన కొద్ది యింకా మారుస్తారు. ఎప్పుడూ రెడ్డివచ్చె మొదలాడ మన్నట్లుగానే వుంటుంది ఆ రెడ్లందరు వచ్చేదాక. పైన ఈ విషయం కొంత చెప్పేను కనుక యిక విస్తరించను. (3) మ్యూజిక్. వచ్చిన తిప్పలేమంటే అసలు కథ జరిగినపుడు ప్రతిదానికీ ప్రక్కన ఒక మ్యూజిక్ డైరెక్టరు వుండి తన "Orchestra"తో దాన్ని జరుపలేరు. సందర్భానుసారంగా మ్యూజిక్ వుండవచ్చు, ఉండకూడదని కాదు నేను చెప్పేది. నాకు గానం కొద్దోగొప్పో రాదనికాదు, గానంమీద నిరసనగాదు. అది వుండవలసినచోట్లు కొలదిపాటి మాత్రమే వుండాలి ఏకథలోనైనా సరే. కొన్ని కథలకు అది వుండదు, అవసరంలేదు కూడానేమొ. వుచితానుచితాలు ఎరుగకుండ ఫిల్ము యావత్తు గానమయంచేసే మన భాగవతారుల కందరికీ నా దాసోహం.

ఫిల్ము ప్రారంభమే పాటల రికార్డింగుతో "అయం ముహూర్తో" అంటారు: అసలు కావలిసిన సత్పదార్థం నటనతో ప్రారంభించరు. రిహార్సల్సు వుండవు చాలా ఫిల్ములకు. చిన్నచిన్న కేరక్టర్లు కేవలం ఒక అనవసరం కింద లెక్కవేస్తారు. వాళ్ళకేం చెప్పరు; ఏ శిక్షకూడా లేదు. సమయానికి ఎవడు కనుపడితే వాడిని ఎక్కించేస్తారు అమాంతంగా. నాటకంలో నాటక కంపెనీకి క్రొత్తవాడువస్తే "ముందో పాటపాడరా అబ్బాయి" అని అన్నట్లే సినీమాకు పైన చెప్పిన రికార్డింగుకూడ.

ఇది యిలాగుండగా శుద్ధమైన కర్ణాటక సాంప్రదాయం వదలి యితర అన్యరీతులకు అర్రులుచాచి కథను అధోగతికి తెస్తున్నది సినిమాగానం. కొన్నికొన్ని చిత్రాలు కేవలం పాటకచ్చేరీలు "టాపికల్ న్యూస్" అంటే అతిశయోక్తి కాదని నమ్మండి. దీంట్లో, తమిళసోదరులు మనలను అన్ని విషయాల్లో మించిపోతారు, ఈ సంగతికి వస్తే. గానానిక వున్న స్థానాన్నే, దాని స్వరూపాన్ని నిర్ణీతంచేసేది, చెప్పేది సినేరిస్టుకాని, మ్యూజిక్ డైరెక్టరుకాదు. ఇతగాడుకూడ సినేరిస్టుకి బద్ధుడేగాని, అతగాడి ఖాతాలెక్క స్వారిచెయ్యవలసిన వాడుకాడు. (4) క్లోసప్పుల కోసం అని వూరికే ఉవ్విళ్లూరుతూ వుంటారు నటనటీమణులు. అవి యెన్ని సంక్రమింప చేసుకుంటే అంత "మార్కెట్టువాల్యూ" వస్తుందని వెఱ్ఱి నమ్మకం. నిజంగా కథ మొత్తంమీద కొద్దిపాటి సందర్భాలలో క్లోసప్ యెత్తవలె డైరెక్టరు. ఇద్దరి సంభాషణను "అల్టర్ నేట్"గ వీరివారి క్లోసప్‌లతో నింపకూడదు. పరికించిచూస్తే కథా ప్రవాహం ఎప్పుడూ "Midshot"లోనే జరుగుతూ వుంటుంది. మరి మాటకొస్తే "Longshot" లోనే జరగాలి. ఇది తెరమీద వచ్చేసరికి బాగా కనుపడదు కనుక దాన్ని Midshot గ కుత్రిమంచేస్తున్నాం అని అర్థంచేసుకుంటే తీసేవారికీ, చూసేవారికీ చాలా చిక్కులు వదులిపోతాయి. తర్వాత, "Camera Angle" అనేది ఓ అనిర్వచనీయమైన గొప్పపదార్థం.

దృశ్యాన్ని మొహం యెదటపడి మనం చూడం. చూస్తే ఆ దృశ్యంలోవున్న వ్యక్తులు మనతో మాట్లాడ

వలసివస్తుంది; మనం వాళ్లతో మాట్లాడవలసి వస్తుంది, లేదా అలా అనిపిస్తుంది. దృశ్యాన్ని దొంగచాటుగ చూడాలి ప్రేక్షకుడు. బట్టబయలైతే రసభంగం అవుతుంది. అలాంటి Angle లో కెమెరాని పెట్టగలవాడే కెమెరామేను. అలా సహకారంతో పెట్టించగలవాడే డైరెక్టరు. అప్పుడుగాని కథకు విలువరాదు. లేకపోతె కేవలం స్టేజిమీద నాటకం వేస్తున్నట్టుగా పరిణమిస్తుంది. ఆ Shot, మరొచిత్రమైన వింత ! కథలో నటనటీమణులు చూడవలసిన దృశ్యాన్ని, ప్రేక్షకులు చూస్తున్నట్లుగాను; దీనికి Vise Versa గాను చాలా పాట్లు పరిమళిస్తూ ఉంటాయి, కాదు పరిణమిస్తూ ఉంటాయి.

శబ్ద గ్రహణాన్ని గురించి కూడ చాలా చెప్పవలసి వుంది పై విధంగానే; కాని గ్రంథ విస్తర భీతిచే వదలి వేస్తున్నాను. (5) చాల కష్టపడితీసిన ఫిల్ములలో కూడ చాలాదృశ్యాలు జీవరాహిత్యంగా, అతుకులుగా, పానకంలో పుడకలులాగ వుంటాయి. ఎంగకంటే సెట్టుల్లో ఎన్నో వస్తువులు పెడతారు. కాని వాటిని అలంకారార్థాలే చేస్తున్నారుగాని నటులచేత వుపయోగింపించడంలేదు. కొన్నికొన్ని కంపెనీలలో 'కంటిన్యుటీ మేనే' వుండడు; నటులే అంతా జ్ఞాపకంపెట్టుకోవాలి. ఇంకా యిలాంటి కారణాలు చాల వున్నాయి. వీటి అన్నింటివల్ల కొన్ని కొన్ని పాట్లు జీవరాహిత్యాలైతే వాటి ననవలసిన పని లేదు. చెట్టుమీదవున్న వస్తువుతో సంబంధంలేకుండ ఆ దృశ్యం ఒక అడుగుపెట్టగలదా చెప్పండి! లేకపోతే ఆ వస్తువులు ఎందుకు తెచ్చిపెట్టాలి చెప్పండి ! సంపూర్ణంగా నైనా కొంచం కొంచంగా నైనా నటుడుకి వస్తువుకీ సంబంధం వుండితీరుతుంది. ఇది సినేరిస్టు నిరూపించి వుంటాడు. మీరు కాదు, వారు ఏమాత్రం పాటించ లేదుగాని.

ఇలా తరిచినకొద్దీ ప్రస్తుత ఆంధ్ర సినీమారంగాన్ని గురించి ఎవరైనా ఎంతైనా వ్రాయవచ్చు, ఏమో వ్రాయకపోవనూ వచ్చు. ఇద్దరు ఆంధ్రులు ఎప్పుడూ కలవరుగనుక, ఒకే కార్యానికి, కలువగూడదని శాపం గనుక, ఏ చిన్న విషయంలోనైనా ఏకాభిప్రాయానికి రాలేరుకనుక, ఒక్కొక్కవ్యక్తీ 'ఒక్కొక్క రాజ్యాన్ని యేలుతూ' 'యెవరికి వారే యమునాతీరే' లాగనే వుంటే బాగుంటుంది. కొంచం అర్థవంతమైన విలువగల చలనచిత్రాలను తీయగలుగుతాము. సినీమా కళలో యింకా యెన్ని యెన్నో పరివర్తనలు శరవేగంతో వస్తూవున్నాయి. ఇప్పటికే మనం వుక్కిరిబిక్కిరియై దోవాతెన్నూ లేక నడిసముద్రంలో వున్నామే, ముందు వచ్చే తుపానులను తట్టుకుంటామో ! మునుగుతామో అని నాకు భయంవేస్తున్నది. పాత పంథానలను మార్చుకొని మన 'Weak Points' ని గుర్తెరిగి సంస్కరించుకొని 'ముందడుగు వేయండీ' అని అందరికి హెచ్చరిక చెప్పతూ విరమిస్తున్నాను.

———



# ★★★ ఆంధ్రదేశపు గ్రంథాలయములు ★★★

శ్రీ పాతూరి నాగభూషణం, డి. యల్. యస్.

కీ. శే. కందుకూరి వీరేశలింగంగారి కృషిఫలితంగా పందొమ్మిదవ శతాబ్దం చివరను ఆంధ్రదేశంలో సాంఘిక విప్లవంతోపాటు భాషా సంబంధంగా కూడ గొప్ప ప్రబోధం జరిగింది. ఈ సమయంలో అంతకుపూర్వం దేశంలో గల రాజుల ఆస్థానాలు, పండితుల గృహాలలోని గ్రంథాలయాలతోపాటు సార్వజనిక గ్రంథాలయాలుకూడ అక్కడక్కడ కొంచెంగా బయలుదేరినవి. కాని ప్రజానీకంలో గ్రంథాలయ పిపాస కలగడానికి వందేమాతరోద్యమ మొక కారణమైనది. ఇరవైయవ శతాబ్ద ప్రారంభంలో బయలుదేరిన యీ వుద్యమాన్ని అణచివేశామని మన సామ్రాజ్య ప్రభుత్వ మనుకొన్నది. కాని ప్రజలలో దీనిద్వారా మాతృభాషపై మిక్కుటమైన మక్కువగలిగి యెప్పటికైనా సర్వ వ్యవహారాలలోనూ దీని నుపయోగించడం ద్వారానే తమకు ముక్తి లభిస్తుందనే విశ్వాసం పెరిగింది. ఈ విశ్వాసం కార్యరూపం దాల్చడం ద్వారా ఆంధ్ర గ్రంథాలయోద్యమము, ఆంధ్రోద్యమము మనకు లభించినవి. హిందూదేశాన్ని భాషాధారక రాష్ట్రము క్రింద విభజించి ఒక్కొక్క రాష్ట్రములో అచ్చటి జనుల మాతృభాషలో పరిపాలనాది సర్వకార్యములు జరగవలె నన్నది ఆంధ్రోద్యమం యొక్క ఆశయంగా పరిణమించింది. ప్రజాతంత్ర ప్రభుత్వపద్ధతికి ప్రధాన సాధనమైన మాతృభాషయొక్క స్థానమును నిరూపించడం కాంగ్రెసు కార్యకలాపాలలో సాధింపబడినా రాజ్యపరిపాలనలో యీ ఆదర్శ మింకా అమలుజరుగలేదు. ఆంధ్రులలో బయలుదేరిన యీ జాతీయ వికాసానికి బలాన్ని కలిగిస్తూ పల్లెలలో ప్రచారంలోకివచ్చిన గ్రంథాలయాలు 1914 వ సం॥ నాటి కొక సంఘాన్ని స్థాపించుకోవడం జరిగింది. ప్రథమ ప్రపంచ సంగ్రామం ఆరంభదినాలలో ఆంధ్రులు—ముఖ్యంగా అభివృద్ధికర ప్రాంతాలకు చెందిన ప్రదేశాలలో ఊరూర సరస్వతీ మందిరాల స్థాపనలో విమగ్నులయ్యారు. ఈవిధంగా బయలుదేరిన గ్రంథాలయాల సక్రమ కార్యనిర్వాహణానికి దారిచూపే నిమిత్త మొక రాష్ట్రీయ గ్రంథాలయ సంఘ మవసరంగా తోచింది. ఇది భారతదేశంలో మొట్ట మొదటగా స్థాపింపబడిన గ్రంథాలయ సంఘము. మరొకవిశేష మేమంటే సరిగా ఇదేసమయంలో బరోడా సంస్థానంలో గైక్వారు మహారాజులుగారి ఆదరణక్రింద గొప్ప ఉద్యమం నడుస్తుంటే ఇచ్చట ప్రజలే గ్రంథాలయోద్యమాన్ని స్థాపించి స్వయంగా సాగించినారు. ఈ సంఘస్థాపననాటికి విశాలాంధ్ర భూభాగంలో సుమారు 100 గ్రంథాలయాలుమాత్ర ముండినవి. దీని కృషి ఫలితంగా కొంతకాలాని కిచ్చట 1200 కు పైగా చక్కగా పనిచేసే గ్రంథాలయా లేర్పడినవి. ఇవి చాలాభాగం గ్రామసీమలలోనే ఉండినవి. రాజకీయాలలో అభినివేశంగల దేశాభిమానులగు యువకులచే నడుపబడినందువలన గ్రంథాలయాల గమనంలో కొన్ని ఒడుదుడుకులున్నమాట వాస్తవమే. కాని వీనినెల్లో సమర్థించుకొంటూ ఉద్యమ గమనాని కొక స్థిరమైన రూపాన్ని కల్పించే ఉద్దేశంతో ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘాన్ని 1924 వ సం॥ లో సొసైటీల రిజిస్ట్రేషను చట్టముక్రింద రిజిస్టరుచేశారు. ఒకరి ప్రోత్సాహంతో కాకుండా మొదటినుంచీ సంఘనిర్వాహకులు ఉద్యమం పట్ల తమకున్న భక్తినిబట్టి దీనికి స్వేచ్ఛమై సేవచేశారు. దేశంలో గ్రంథాలయోద్యమం వ్యాప్తిగావడానికి వీరు కారకులయ్యారు.

## ప్రభుత్వ సహాయం :

ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘాని కిప్పటికి 32 సంవత్సరాలు నిండినవి. గ్రామసీమలలోని జానపదులకు విజ్ఞానపు వెలుగును అందించే పనిలో యిన్నాళ్ళూ యీ సంఘం విరామమెరుగకుండా పనిచేస్తున్నది. గ్రంథాలయాలు ప్రభుత్వ సహాయం పొందదాని కర్హమైన సంస్థలనే విషయాన్ని ప్రభుత్వదృష్టికి తేవడంలో అగ్రతాంబూల మీ సంఘానిదే. విన్నపాలద్వారానూ, ఆందోళనమూలంగానూ స్థానికసంస్థలు గ్రంథాలయాలకు తోడ్పడ

దానికే వీలులేదన్న స్థితినుండి ప్రభుత్వమే యేటేట గంథాలయాలకు స్థానిక సంస్థలద్వారా విరాళాలను పంచ దమేగాక, పంచాయతీ లైబ్రరీలకు ప్రత్యేకంగా గ్రాంట్లు నిచ్చేవరకూ ప్రభుత్వాన్ని ఈ సంఘం తేగలిగింది. కొద్ది పాటి మొత్తంతో ప్రారంభమై 1937 వ సంవత్సరానికి ముందు రు. 20,000—0—0 వరకూ పెరిగిన ఈ వార్షిక విరాళాలు 1946—47 వ సం॥ లో లక్షవరకు పెంచేటట్లు ప్రభుత్వాన్ని ప్రబోధించింది. ఈ మొత్తం గ్రంథాలయాలకు బొత్తుగా చాలకున్నా అధికారులేని స్థితిలో పర ప్రభుత్వ యాజమాన్యంలో ఈమాత్రం సాధించగలగడం కూడ విశేషంగానే యెంచుకోవచ్చు. అనేక పర్యాయాలీ సంఘంవారు ప్రభుత్వ ప్రచురణాలను గ్రంథాలయాల కుచితంగా సరఫరా చేయించాలనిచేసిన ఏన్నపా లింతకు ముందు తగిన ఫలితాన్నివ్వలేదు. కాని యిటీవల మద రాసు ప్రభుత్వం వ్యవసాయ శాఖవారు ప్రకటించే "పాడి పంటలు" పత్రిక 650 ప్రతులను ప్రతినెలా మా సంఘం ద్వారా గ్రథాలయాలకు పంచేటందుకు యేర్పాటు జరిగింది. దీనికి వ్యవసాయశాఖా డైరెక్టరు శ్రీ బి. వి. నాధ్‌గారి అభిమానమే కారణం. గత కాంగ్రెసు మంత్రి వర్గం హయాంలో ఈ సంఘానికి చిన్న సహాయమొకటి జరిగింది. ఆంధ్ర జిల్లాలలోని స్థానిక సంస్థలు ఈ సంఘ సభ్యులుగా చేరడానికి వీనుమతి విచ్చారు. సలహాదారుల ప్రభుత్వం ఈ సహాయానికేమీ అభ్యంతరం కల్పించ లేదు. కాని స్థానికసంస్థల నిర్వాహకులకు సరియైన శ్రద్ధ లేనందున యెక్కువ సంస్థలు మా సభ్యత్వాన్ని పొంద డం పడలేమ. గ్రంథాలయాలకు రిజిస్ట్రేషను రుసుము తగ్గింపు విషయంలోకూడ యీ సంఘం మొదటినుండీ శ్రద్ధవహిస్తూ వచ్చింది. అయితే ఈవిషయంలో మేము పెద్దపెట్టున విజయాన్ని పొందలేదు. వ్యక్తిగతంగా దరఖాస్తులు పెట్టుకున్న కొన్ని గ్రంథాలయాలకు రిజిస్ట్రేషను రుసుమును రు. 50-0-0 లనుండి రు. 20-0-0 లకు తగ్గిస్తూ మదరాసు ప్రభుత్వంవారు ఆర్డర్లు జారీచేసి యున్నారు. ఈ సహాయాన్ని పొందిన గ్రంథాలయాలలో నెల్లూరుజిల్లా గుడ్లూరులోని శ్రీ ఎఱ్ఱాప్రగడ గ్రంథాలయము, కృష్ణాజిల్లా కవులూరులోని శ్రీ విజ్ఞానోదయ గ్రంథాలయము, పశ్చిమగోదావరిజిల్లా అప్పారావు పేటలోని శ్రీ సరస్వతీ పుస్తక భాండాగారము కలవు. ప్రజాసామాన్యంలో విద్యావ్యాప్తికై పాటుపడుతున్న గ్రంథాలయాల విషయంలో ప్రత్యేకమైన ఆర్డరుద్వారా ఈ రుసుము పూర్తిగా తగ్గించేవరకు ఈ ప్రయత్నాన్ని చేస్తూనే వుండాలి. "ప్రభుత్వ విరాళాలు పొందడంలో గ్రంథాలయాలు పడే యిబ్బందులదీర్చే విషయంలోకూడ ఈసంఘం కృషిచేసింది. ఈ సందర్భంలో గ్రంథాలయాలు కొనే పుస్తకాల జాబితాలు ముందుగా జిల్లా విద్యా శాఖాధికారుల అనుమతి పొందాలనేది చాలా చిక్కులకు కారణమౌతున్నది. ఈ విషయాన్ని ప్రభుత్వదృష్టికి తెచ్చే నిమిత్తం ఈ సంఘం గట్టిగానే ప్రయత్నించింది. కాని యిప్పటికేమీ ఫలితం కలగలేదు. పాఠ్య పుస్తకాల నిర్ణాయక సంఘంలోకూడ గ్రంథాలయాలకు స్థానమిచ్చి వయోజన విద్యకు తగిన ప్రాతినిధ్యం లభించేటట్లు చూడవలసినదిగ ప్రభుత్వానికి 1939 వ సం॥ లో యీ సంఘంవారు నివేదించి యున్నారు. గ్రంథాలయాలకు సంబంధించిన మరికొన్ని ముఖ్యవిషయాల ప్రస్తావన కూడ యీ నివేదికలో చేయబడింది.

ప్రచారం:

ఈ సంఘ కార్యక్రమంలో గ్రంథాలయ మహాసభల నిర్వహణం ప్రముఖపాత్ర వహిస్తుంది. ఏటేటాజరిగే ఆంధ్రదేశ గ్రంధాలయ మహాసభ లిప్పటికి 26 జరిగినవి. ఈ సభలతోపాటు ప్రదర్శనాలుకూడ వుంటున్నవి. వీనికి గ్రామ గ్రంథాలయ ప్రతినిధు లెక్కువగా వస్తూవుంటారు. మహాసభల కార్యక్రమం బాగా వెల్లడయ్యే నిమిత్తం వీనిలో జరిగే ఉపన్యాసాలూ, ప్రచార - వయోజనవిద్యా-నిర్వహణశాఖా సమావేశంలో చదివి చర్చకువచ్చిన వ్యాసాలూ కలిగిన మహాసభల సంచికలు కొంతకాలంగా ప్రత్యేకం ప్రకటింపబడుతున్నవి. ఉద్యమ ప్రచారంకోసం ఈ సంఘం సాధించిన నూతన విధానాలు రెండు పేర్కొనదగినవి కలవు. ఇందొకటి గ్రంథాలయ యాత్రలు. సుమారొక డజనుమంది ఒక ముఠాగా బయలుదేరి వీని నిర్వహిస్తారు. ఈ ముఠాలు 6 భాగా

లుగ విడివడి కార్యక్రమాన్ని సాగిస్తారు. 1. ముందుగ పోయి గ్రామాలలో యాత్రికుల ఆగమనాన్ని తెలిపేవారు. 2. భజనముఠా. 3. ప్రదర్శనశాఖ. 4. మ్యాజిక్ లాంతరుజట్టు. 5. గ్రామఫోనుపార్టీ. 6. ఉపన్యాసకులు. ఇందులో మొదటిజట్టు ముందుగా కార్యక్రమ మేర్పాటైన గ్రామానికిపోయి యాత్రికుల అగమన సమాచారం గ్రామస్థులకు తెలిపి ఆహ్వానానికి యేర్పాట్లుచేస్తారు. ఈ యాత్రికుల ముఠా దినానికి రెండూళ్ళకు తక్కువ లేకుండా దర్శిస్తారు. గతరాత్రి మకాంచేసిన గ్రామం నుండి వీరు కాలినడకను ఉదయం బయలుదేరి సుమారు 8 గంటలకు ప్రక్కగ్రామం చేరుతారు. భజనముఠావారి నగర సంకీర్తనతో ముందు గ్రామాన్ని చుట్టివస్తారు. ఈలోపల మొదటి జట్టువారు యాత్రికుల రాకకుగల కారణాన్ని గ్రామస్థులకు విశదంచేస్తారు. తదుపరి స్థానిక గ్రంథాలయాలను దర్శించి వాని పరిస్థితుల నవలోకిస్తారు. ప్రదర్శనశాఖవారు గ్రంథాలయంలోగాని, నలుగురూ సులభంగా చేరదగిన మరొక తావునగాని గ్రంథాలయ ప్రదర్శనాన్ని యేర్పాటుచేస్తారు. ఈ ప్రదర్శనంలో దేశ దేశాలలోగల గొప్ప గ్రంథాలయాలు, దేశనాయకులు, ప్రముఖ గ్రంథాలయ సేవకుల పటాలు, విజ్ఞానవ్యాప్తి కనుకూలించే టటువంటివన్నీ గ్రంథాలయోద్యమాభి వృద్ధిని సూచించేటటువంటివన్నీ అంకెలూ, మహావాక్యాలూ గల పెద్ద పెద్ద పోస్టర్లు, కరపత్రాలు వగైరా వుంటాయి. గ్రామ కేంద్రంలో సభ జరుగుతుంది. గ్రామఫోను పాటలతో కార్యక్రమం ప్రారంభమౌతుంది. ఉపన్యాసకులు గ్రంథాలయ ప్రయోజనాలను గూర్చీ, పుస్తకాల మహత్తునుగూర్చీ, గ్రామస్థులకు రుచించు సాంఘిక రాజకీయార్థికాది విషయాలనుగురించీ ప్రసంగాలుచేసారు. సభకు పిమ్మట స్థానిక గ్రంథాలయాభివృద్ధికి కావలసిన యేర్పాట్లు విషయమై శ్రద్ధవహిస్తారు. దీని నధికంగా ప్రజ లుపయోగించుకోడానికి కావలసిన చర్యల తీసుకొంటారు. మూతలువడ్డ గ్రంథాలయాలను పునరుద్ధరించి వీటికి కావలసిన ధనాన్ని వసూలుచేస్తారు. లేనిచోట్ల క్రొత్త గ్రంథాలయాల స్థాపనకు పూనుకొంటారు. ఆరోగ్యము, సహకారము, విద్య, గ్రంథాలయాలు వగైరావిషయాలను బొమ్మల సహాయంతో మ్యాజిక్ లాంతరుద్వారా సభికులకు ప్రబోధపరచడంతో కార్యక్రమం ఉత్సాహంగా ముగుస్తుంది. దీనికికావలసిన చీకటిగదుల యేర్పాటుకు అనుకూలాలను కల్పించుకొంటారు. మధ్యాహ్నం భోజనానంతరం కొంచెంసేపు విశ్రమించి యాత్రికులు కార్యక్రమంలోని ప్రక్కగ్రామానికి సాయంత్రం 4 గంటలకు చేరుకొంటారు. పైన చెప్పిన కార్యక్రమమంతా అక్కడజరిపి రాత్రికోయూరిలో మకాంచేసి మరునా డుదయం మరొకగ్రామం చేరుకొంటారు. ఈ యాత్రలు వారంమొదలు నెలవరకు సాగించవచ్చు. ఈ కార్యక్రమానికి బాధ్యతవహించేవారి అనుకూలాన్ని ఉత్సాహాన్ని అనుసరించి తరవకొక ఫిర్కానో, తాలూకానో నిర్ణయించుకొని కార్యక్రమాన్ని ఏర్పరుసారు. జన సామాన్యంలో విద్యాప్రబోధం జరగడానికీయాత్రలు చాలా ఉపకరిస్తాయి. గ్రంథాలయోద్యమంలో పనిచేస్తున్న పెద్దలయొక్కయు, విద్య - వ్యవసాయం - సహకారం - పశువైద్యం - ఆరోగ్యం మొదలైన వివిధ ప్రభుత్వశాఖోద్యోగుల యొక్క, గ్రామోద్ధరణ కార్యక్రమాన్ని సాగించే వివిధ సంస్థల నిర్వాహకుల యొక్కయు సహకారం ఈ యాత్రలు జయప్రదంగా జరపడానికి చాలా తోడ్పడుతుంది. పశ్చిమగోదావరి, కృష్ణా గుంటూరుజిల్లాలలో ఆయాజిల్లా తాలుకా గ్రంథాలయ సంఘాలు ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘంవారి సలహా సంప్రతింపులతో ఈ యాత్రల నధికంగా సాగించినవి.

గ్రంథాలయోద్యమ వ్యాప్తికై ఆంధ్రదేశ మనుసరించిన విశిష్టవిధానముతోబాటు గ్రంథాలయసేవ. గుంటూరుజిల్లాలోని పంటకాలువలపై నడుచుచున్న ప్రయాణీకుల పడవలలో పుస్తకాలను పత్రికలనుపెట్టి ప్రయాణీకుల సత్కాలక్షేపానికి అనుకూలాలు కల్పింపబడ్డాయి. ఈ పద్ధతి ప్రజానీకంలో పఠనాభిలాషను పెంపొందించడానికి కూడా తోడ్పడుతుంది. ఈ విధానాన్ని ప్రవేశపెట్టినవారు తెనాలితాలూకా పెదపాలెములోని సేవాశ్రమ వాణీమందిర నిర్వాహకులు. విశ్వదాత కీ. శే. దేశోద్ధారక కాశీనాధుని నాగేశ్వరరావు పంతులుగారు తమ ఆంధ్రపత్రికను చాలా గ్రంథాలయాలకు ఉచితంగానూ, తగ్గింపురేట్లకును సర

ఫరాచేసి ప్రారంభదశలో నున్న అనేక గ్రంథాలయాలకు సాయపడడమేగాక వారి జీవితపర్యంతము గ్రంథాలయోద్యమాభివృద్ధికి తమ పత్రికద్వారా చాలా సేవచేశారు. ఆంధ్రదేశంలో చాల గ్రంథాలయాల వార్షికోత్సవాలలో పాల్గొని అధ్యక్షులుగాను ఉపన్యాసకులుగానూ వీరుగావించిన ప్రసంగాలద్వారాకూడ గొప్ప ప్రబోధం గ్రంథాలయ క్షేత్రంలో జరిగింది.

నిర్వహణం :

గ్రంథాలయ సేవకులకు శిక్షణనిచ్చే విషయంలోనూ ఈ సంఘం వెనుకబడలేదు. ఈ సంబంధంగా మొట్ట మొదట 1920 వ సం॥ లో బెజవాడలో నొక శిక్షణాలయ మేర్పాటై 20 మంది గ్రామసేవకులకు తరుబీతు నిచ్చింది. 1934 వ సం॥ లో తిరిగి బెజవాడలో జరుపబడిన గ్రంథాలయ వేసవి పాఠశాలలో 32 మంది గ్రంథాలయ శాస్త్రాన్ని అభ్యసించారు. బెజవాడతాలూకా పటమట గ్రామంలో 1941 వ సం॥ మే మాసములో జరిగిన మూడవ గ్రంథాలయ వేసవి పాఠశాలలో గ్రంథాలయ నిర్వహణమునకు సంబంధించిన సామాన్య విషయములతోపాటు భాండాగారమున కవసరమైన లోకవిజ్ఞానమును కలిగించు పాఠములుకూడ నేర్పబడినవి. వీనిలో ప్రపంచ భూగోళము, చరిత్ర, ఆర్థిక రాజకీయ వాతావరణ శాస్త్రములు, ఆంధ్ర హిందీ సంస్కృత వాఙ్మయ చరిత్రలు కలవు. 21 మంది ఈ పాఠశాలలో చేరిరి. శిక్షణ పూర్తియైన తర్వాత పరీక్షలు జరిపి వీనిలో ఉత్తీర్ణులైన వారికి యోగ్యతాపత్రము లీయబడెను. తరువాత 1945, 1946 మే నెలలో వరుసగా తెనాలి తాలూకాలోని రేపేంద్రపాడు, పెదపాలెం గ్రామాలలో గ్రంథాలయ ప్రవేశ తరగతులు సాగింపబడెను. ఈ పాఠశాలలను అన్ని జిల్లాలలోనూ, ప్రాంతములలోనూ సాగించి, సంవత్సరానికొక పర్యాయం కేంద్రంలో 'గ్రంథాలయ నిర్వాహక' తరగతుల నేర్పాటుచేయు సంకల్ప మీసంఘ నిర్వాహకులకు గలదు. ఇవిగాక వయోజన విద్యాబోధకులకూ, గ్రంథాలయ సేవకులకూ 3 నుండి 7 దినములవరకూ తాత్కాలికశిక్షణాలయముల నడపు ప్రయత్నంకూడ ప్రారంభమైనది. ఇప్పటికివి గుంటూరుజిల్లాలో ఒకటి (నరసరావుపేట తాలూకా జొన్నలగడ్డలో) రాయలసీమకు చెందిన కడపజిల్లాలోని ఆనందాశ్రమములో ఒకటి జరుపబడినవి.

ప్రారంభంనుండీ ఈ సంఘపక్షాన ఒక పత్రిక నడిచింది. 1914 వ సం॥ లో ప్రారంభమైన "గ్రంథాలయ సర్వస్వము" మొదట త్రైమాసిక పత్రికగ బయలుదేరి నెమ్మదిగ మాసపత్రికగ అభివృద్ధి చెందింది. మధ్య కొంతకాలం విశ్రాంతి పుచ్చుకొని "ఆంధ్ర గ్రంథాలయ" అనే పేరుతో కొత్తరూపుతో ఆంధ్రాంగ్ల భాషలలో రెండేండ్లపాటు త్రైమాసిక పత్రికగ నడిచింది. యుద్ధం మధ్యంలోకలిగిన అవాంతరాలకు గురియై నిలిచిపోయింది. ఈవిధంగా 13 సంపుటాల నీపత్రిక పూర్తి చేసింది. ప్రస్తుతము పత్రిక పునరుద్ధరణకు ప్రయత్నాలు జరుగుతున్నవి. గ్రంథాలయోద్యమ సంబంధంగా ఇతర పత్రికలలో వెలువడుతూవచ్చిన వ్యాసాలతోపాటు ఈ సంఘపక్షాన కొన్ని పుస్తకాలుకూడ ప్రకటింపబడినవి. పూర్వం వెలువడిన ఆంధ్రదేశ గ్రంథాలయాల చరిత్రేగాక 1939 వ సం॥ లో ప్రకటింబడిన "ఆంధ్రదేశ గ్రంథాలయముల పట్టిక" యొకటి, శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారి "వయోజనవిద్య — మొదటి పుస్తకమూ", ఈనడుమనే ముద్రణముపొందిన "ఆంధ్ర గ్రంథములు - మొదటి జాబితా" (గ్రంథాలయాల్లో వుండదగిన పుస్తకాల జాబితా) గ్రంథాలయోద్యమ నిర్వహణంలో చాల సహాయపడుచున్నవి. సంఘాధ్యక్షుడగు శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమ రావుగారి షష్టి పూర్తిని పురస్కరించుకొని వారి గౌరవార్థము ప్రకటించ నిశ్చయించుకొన్న చిరు పొత్తములలో "గ్రంథాలయములు, రిజిష్ట్రేషన్" అచ్చైనది. "సభలు - సమావేశములు" అచ్చులో నున్నది. "వయోజనవిద్య - బోధన క్రమము" సంవత్సరాది (సర్వజిత్) కి తయారు అయినది. వచ్చే దసరా పండుగలోపల తక్కిన మూడు గ్రంథాలు తయారుకావచ్చునని ఊహించుచున్నాము.

గ్రంథాలయ సేవలో ఆధునిక విధానాలు చాలా తెలుగు దేశములో వ్యాపించినవి. బండ్లద్వారా గ్రామా

లకు పుస్తకాలనుపంపే సంచార గ్రంథాలయ విధానం కొన్నితావుల్లో అమలుజరిగింది. బోటు గ్రంథాలయాల సంగతి పైనచెప్పినాము. రోగుల గ్రంథాలయాలన్నీ చుట్టుపట్టు గ్రామాల కన్నింటికీ పుస్తకాల సరఫరాచేస్తూ ఉంటాయి. స్త్రీలనిమిత్తం పుస్తకాల నిండ్లకుపంపే ఆచారంకూడా చాలా గ్రామాలలో వుంది. నిరక్షరులకు పత్రికలచదివి వినిపించే పద్ధతికూడ అచ్చటచ్చట అమలులోవుంది. ఇరవైయేండ్లుగా నెల్లూరు పట్టణంలో పెద్ద గోడ వార్తాపత్రిక ఒకటి ప్రచారంలో వుంది. కొంచెం అభివృద్ధికరంగాఉన్న ప్రాంతాలలో అన్నిచోట్లా గోడ వార్తాపత్రికలు బయలుదేరినవి. గ్రామ గ్రంథాలయాలు చాలాచోట్ల స్వంత భవనాలను నిర్మించుకొన్నవి. వయోజనులలో అక్షరాస్యతా ప్రచారానికి సంఘాధ్యక్షు శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమ రావుగారు సంపత్సరాల తరబడి దీక్షతో కృషిచేస్తున్నారు. వయోజన విద్యాలయాల నిషేధిస్తూ మదరాసు ప్రభుత్వంవారు జారీచేసిన ఉత్తర్వును అధిక్షేపించే నిమిత్తం ఈ సంఘ యాజమాన్యాన శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమ రావుగారి అధ్యక్షతను 1941 ఆగస్టు 24 వ తేదీన తెనాలిలో ప్రత్యేక ఆంధ్రదేశ వయోజన విద్యా మహాసభ దిగ్విజయముగ జరిగింది. దక్షిణభారత వయోజన విద్యాసంఘ మేర్పడిన దాది సంఘాధ్యక్షులు దాని నిర్వహణంలో ప్రధాన పాత్రధారులుగా వున్నారు. ఆంధ్రదేశంలో పై సంఘం కృషికి మాసంఘం మొదటినుండీ తోడుపడింది. ప్రస్తుత మీ సంఘానికి శ్రీ హరిసర్వోత్తమ రావుగారే అధ్యక్షులుగా వున్నారు. మన సంఘస్థాపకులు శ్రీ వెంకటరమణయ్యగారుపాధ్యక్షులు. మన కార్యదర్శి, దీని పాలకవర్గ సభ్యులు, ఆంధ్ర గ్రంథాలయోద్యమం ప్రారంభంనుండీ రాత్రి పాఠశాలలు, పురాణపఠనం, పత్రికాపఠనం వగైరా కార్యక్రమాలద్వారా వయోజనవిద్యా ప్రచారానికి గ్రంథాలయాలలో యేర్పాటులుచేశారు. ఇటీవల ఆంధ్రయువకులీ పనిని బాగా సాగిస్తున్నారు. ఈ యుద్యమం కృష్ణా, గుంటూరు జిల్లాలో యెక్కువగా వ్యాపించింది.

ఆంధ్ర గ్రంథాలయోద్యమం సాధించిన కార్యాలలో గుంటూరుజిల్లా వేటపాలెంలో స్థాపింపబడిన కేంద్ర గ్రంథాలయమొకటి. దీనిని కీ. శే. ఊటుకూరి వేంకట సుబ్బరాయ శ్రేష్ఠిగారు పారంభించేశారు. దీని నిర్వహణకు వీరు తమ సర్వస్వాన్ని అర్పించి మన కాదర్శప్రాయులైనారు. చాలాకాలం గుంటూరు మండలానికి కేంద్ర గ్రంథాలయంగా వ్యవహరిస్తున్న ఈ సంస్థ తన రజతోత్సవానంతరం తెలుగుసీమ కంతటికీ సేవచేయ బూనినట్లు దీని నిర్వాహకులు ప్రకటించినారు. ఏలాటి రుసుములతోనూ నిమిత్తంలేకుండా ఆంధ్రదేశంలోని గ్రంథాలయాలకు కావలసిన పుస్తకాలను వీరు సరఫరాచేస్తామని ప్రకటించినారు. సంస్కృతాంధ్రాంగ్ల హిందీ వగైరా భాషలలో ఈ గ్రంథాలయ మిప్పుడు 18,000 కు పైగా ఉద్గ్రంథములను కలిగియున్నది.

కార్యస్థానం :

1938 వ సం॥ వరకు ఈ సంఘ కార్యాలయం బెజవాడలోనే వుంటూవచ్చింది. అంతవరకూ సంఘస్థాపకులు శ్రీ అయ్యంకి వెంకటరమణయ్యగారే దీనికి కార్యదర్శులు. వీరు ఆంధ్ర గ్రంథాలయోద్యమాన్ని పెంచి, పోషించి, సజీవంగా నుంచడమేగాక దీనికి భారతదేశమంతటితోనూ సంబంధాన్ని యేర్పరచారు. ప్రపంచానికి మనకీర్తిని చాటినారు. కాబట్టి ఈ సంఘ చరిత్రలో వీరి నామం సుస్థిరంగా వుంటుంది. 1938 వ సం॥ లో శ్రీ పాతూరి నాగభూషణంగారు వెంకటరమణయ్యగారి స్థానే సంఘ కార్యదర్శిగ యెన్నుకోబడ్డారు. ఈ యెన్నిక జరిగిన కొలది దినాలకే సంఘ కార్యాలయం నిర్మించే నిమిత్తం పడమట లంకలో 1 యెకరం స్థలం కొన్నారు. దీనికైన ఖర్చు రు. 1800-0-0 లలో రు. 1,000-0-0 సంఘ కోశాధిపతులు శ్రీ కొమ్మా సీతారామయ్యగారు విరాళంగా యిచ్చారు. ఈ స్థలంలో గ్రంథాలయ భవనాన్ని నిర్మించి యిందులో కొంతభాగాన్ని సంఘ కార్యాలయం నిమిత్తంయిచ్చే షరతుపై శ్రీ కొమ్మా సీతారామయ్యగారు రు. 10,000-0-0 ఆస్తితో యేర్పాటు చేసిన ఆంధ్ర గ్రంథాలయట్రస్టుకు స్వాధీనపరచడానికి

సంఘంవారు నిశ్చయించారు. ఈ ట్రస్టుకూ, సంఘానికి కూడా అధ్యక్షులైన శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావు గారి షష్ఠిపూర్త్యుత్సవములు ఆంధ్రదేశమంతటా 60 కేంద్రాలలో జరిపి 40 సంవత్సరాలుగ వీరనేక రంగాలలో గావించిన దేశసేవకుగాను ఉచితరీతిని కానుకలతో గౌరవించు ప్రయత్నంలో యిప్పటికి పడమట లంక, కుముదవల్లి (ప. గోదావరి), చింతలపాడు (కృష్ణా జిల్లా), బుర్రిపాలెం (గుంటూరుజిల్లా) గ్రామంలో జరిపిన 4 ఉత్సవాలలో రు. 5,000-0-0 లకు పైగా వీరికి కానుకలు లభించినవి. ఈ మొత్తములో అధికభాగాన్ని గ్రంథాలయ భవనాని కిచ్చునట్లు వీరు నిర్ణయంచేశారు. కొంచెముగ రాయలసీమలో గ్రంథాలయోద్యమ ప్రచారానికి ఖర్చుచేయుదుమని వీరుప్రకటించినారు. ఈ కార్యక్రమంద్వారా రు. 30,000-0-0 వరకు వసూలుచేయడానికి ఆంధ్ర గ్రంథాలయ ట్రస్టువారు తలపెట్టారు. వీరి సంకల్పం త్వరలో ఫలించి చిరకాలంనుంచియున్న లోటు తీరి సంఘానికి స్థిరమైనవసతి యేర్పడగలదని ఆశిస్తున్నాము. ఈ భవనంలో సంఘంయొక్క కేంద్ర కార్యాలయము నెలకొల్పబడి ఆంధ్రదేశంలోని గ్రంథాలయాలకు కావలసిన భోగట్టాను సమకూర్చి అందజేస్తుంది. గ్రంథాలయాలకు కావలసిన రిజిస్టర్లు వగైరాల నిర్ణయం. ఇవి క్రమంగా జరగడాని కవసరమైన పర్యవేక్షణ కేర్పాటు, గ్రంథాలయ సర్వస్వము (గ్రంథాలయ పత్రిక) వగైరా సంఘపరంగా వెలువడే ఇతర ప్రచురణముల యాజమాన్యము, ఉదారు లెవరైనా గ్రంథాలయాల కుచితలగా పంచడాని కిచ్చే పుస్తకాలు పత్రికలు సరఫరా మొదలైన పనులకి కేంద్ర కార్యాలయం బాధ్యత వహిస్తుంది. నగర, తాలూకా, జిల్లా గ్రంథాలయ సంఘాల సమీకరణము, సంచార కార్యక్రమాల నేర్పరచి అన్ని ప్రాంతాలలోని గ్రంథాలయాలనూ తరచు దర్శించి వాటికి సలహాల చెప్పడంకూడ దీనివిధిగా యేర్పడుతుంది. ఇటీవల తెలంగాణంలో ఈ సంఘ కార్యక్రమానికి చక్కని అవలంబనము చిక్కింది. శ్రీ ఆకుల లక్ష్మినారాయణ గారు, కోదాటి నారాయణరావుగారు మున్నగు గ్రంథాలయ మిత్రుల వాహ్వానముపై సింగరేణి కాలరీస్‌లో జరిగిన 25 వ ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభానంతరం ఇచ్చట గ్రంథాలయాల కార్యక్రమం ఉత్సాహవంతంగా సాగుతూవుంది. ఇచ్చటి ప్రత్యేక పరిస్థితుల కనుగుణంగా పనిని సాగించడానికి సులువుగా వుండేనిమిత్తం ఖమ్మంమెట్టులో శాఖా కార్యాలయ మేర్పాటుచేయబడింది. ఈ కార్యాలయ కార్యదర్శిగను, తెలంగాణానికి ఆర్గనైజరుగాను శ్రీ కొమర్రాజు సత్యనారాయణరావుగారు యేర్పడి చక్కగా పనిచేస్తున్నారు. ఇదేవిధంగా రాయలసీమకు కూడా కడపజిల్లా మైదుకూరుకు సమీపంలోగల ఆనందాశ్రమంలో మరియొక శాఖా కార్యాలయము నెలకొల్పబడ్డది. శ్రీ పి. వీరబ్రహంగారు దీని కార్యదర్శిగ నియమితులైనారు. ఖరగ్‌పురమునందలి రాష్ట్రేతరాంధ్ర విద్యా పరిషత్తువారి సహాయంతో రాష్ట్రేతర, ఖండాలతరాల కార్యక్రమం నిర్వహింపబడుతూ వుంది. ఈ కార్యక్రమానికి పై పరిషత్తు గ్రంథాలయ శాఖా కార్యదర్శి శ్రీ కె. తిరుమలరావుగారు బాధ్యత వహిస్తున్నారు. పరస్పర సహకార పద్ధతిని శాఖా కార్యాలయాలూ, కేంద్ర కార్యాలయము చక్కగా పనిచేస్తూ ఆంధ్ర గ్రంథాలయోద్యమాన్ని ముందుకు తీసుకపొయ్యే ప్రయత్నాన్ని చేస్తున్నవి. గ్రంథాలయాభిమానుల సహాయంతో ఉద్యమకర్తలు తమ కర్తవ్యాన్ని నిర్వహించడంలో యేమరుపాటు చూపకున్న ఆంధ్రదేశం తనకీర్తి ప్రతిష్ఠల నిలుపుకొనగలగడమేగాక, గ్రంథాలయోద్యమం మనదేశంలో మూల మూలలకు వ్యాపించగలదనుట తథ్యం.

---

# ఆంధ్రదేశంలో పత్రికారచన :

# ప్రారంభము - అభివృద్ధి

శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావు

***
**
*

"వార్తవలన జగము వర్ధిల్లుచుండును, వార్త నడుప వలయు వసుధపతికి."

అనే వాక్యాలనుబట్టి వార్తకు ప్రాధాన్యమేనాడో మన పెద్దలిచ్చిరని యూహింపవచ్చును. కాని ఆనాడు వార్తావహులు వార్తలను కొనిపోవుచుండిరి. గ్రామాలలో రచ్చకట్టల వద్దనూ, కాలక్షేపము జరిగే యితర స్థలాలలోనూ, సంతలు, జాతరలు, తీర్థాలు వగైరాల లోనూ, దండోరాలు, మూజువానీల మూలకంగా వార్తలు ప్రకటితమగుచుండిన వనుకొనవచ్చును. రాజులకు వేగులు కొనితెచ్చిన వార్తలే ఆదినములలో ముఖ్యము లనుకొందుము. ఎట్లయినా మన పత్రికల కాధారమగు వార్తల విషయ మీదేశానికి క్రొత్తవికాకపోయినా వార్తాపత్రికల ప్రకటనమాత్రము మనకు పాశ్చాత్యదేశాలనుంచి దిగుమతియయిన క్రొత్తసంగతి యని యొప్పుకొనక తప్పదు. ఇక్కడికి వలసవచ్చిన యూరోపియనుల అవసరాల నిమిత్తము వారు పదునెనిమిదవ శతాబ్దములో మద్రాసు గెజెటు, గవర్నమెంటు గెజెటు, కోరియరు అను పత్రికలు మద్రాసులో నడిపినట్లూన్ను, అందులో విదేశపు పాదిరీలు అథీనియా, క్రెసెంటు, నీల్గిరి యెక్సెల్‌సియరు నడిపినట్లున్నూ తెలుస్తుంది. రాజకీయావసరాలు తోచగా 1836 లో స్పెక్టేటరు, 1860 లో మద్రాసు టైమ్సు, 1867 లో మెయిలు బయలుదేరెను. ఇవన్నీ ఆంగ్లములో యూరోపియను లారంభించినవి. భౌతిక శాస్త్రాల జ్ఞానము 19 వ శతాబ్దంలోనే ప్రపంచంలో వ్యాపింపజొచ్చింది. స్వతంత్రభావాలు మొలకలెత్తినవి. మనదేశంలోనూ దయానంద సరస్వతి, రామమోహన రాయలు దివ్యజ్ఞాన సమాజాదులు బయలుదేరినవి. ఫ్రీ థింకర్ అనే పత్రికయొకటి ఇంగ్లీషులో కొన్నాళ్లు నడచినది. స్వేచ్ఛాప్రియులయిన ఆంధ్రులలో వీరేశలింగంగారు బ్రాహ్మమతమునకు సంఘ సంస్కారమునకు తన జీవితము నర్పించువాడై 1878 లో వివేకవర్ధని పత్రిక నారంభించెను. ఈయన నెదుర్చుటకు పురుషార్థప్రదాయని జన్మించెను. సారస్వత చర్చల కొరకయి 1881లో నెల్లూరులో అముద్రిత గ్రంథ చింతామణి బయలుదేరి చాలకాలము ఆంధ్రసారస్వతమున అతి తీవ్రచర్చలకు తావిచ్చెను. వీరేశలింగంగారు రాజకీయాల లోనికి దిగలేదు. కాని నాటి రాజకీయపరిణామము కాంగ్రెసు అవతరణములో ఫలింప నుండినందున 1885 లో 'ఆంధ్ర ప్రకాశిక' బయలుదేరి అపార సేవచేసెను. తత్పత్రికాధిపతి పార్థసారథినాయుడుగారు బహుభాషావేది. అన్నింటను నుపన్యసించి సభలను రంజింపజేయువాడు. ఆ కాలమునకు రమారమిగా చెందదగినదే 'రవి'. పాదిరీల పత్రిక ఈనాటికిని పనిజేయుచున్నది. కాంగ్రెసు పుట్టుకకుముందు 'హిందూ' పత్రికకూడ వార పత్రికగా, వారానికి మూడుసంచికలుగా బయలుదేరుచుండినది. కాంగ్రెసు పుట్టుకకు పిదప అది 1889లో దినపత్రికయైనది. అంతకు కొంచెము పిదపనే స్వదేశమిత్రను అరవములో బయలుదేరినది. 19 వ శతాబ్దాంతమువరకూ మన తూర్పుతీరపు రైలు ఏర్పడనందున రాకపోకల సౌకర్యములేక మనకు దినపత్రిక యేర్పడుట ఆలస్యమయినదని నా యభిప్రాయము. ఇరువది శతాబ్దారంభము రాజకీయంగా మహోద్యమంతో ఆరంభమయింది. 1902 లో ఆరంభమయి యుండిన కృష్ణాపత్రిక ఆంధ్రదేశపు నడిగడ్డన నున్నందున వందేమాతరం ఉద్యమం దానికి గొప్ప దోహదమయినది. కీ॥ శే॥ ముట్నూరి కృష్ణరావుగారి మేధస్సంపన్నతచేత ఇది యపార కీర్తి గడించి యిప్పటికీ తెలుగుదేశంలో మహత్తమ శక్తిగా నున్నది. వందేమాతరం యుగపు రాజకీయావేదనను తీక్ష్ణంగా ప్రతిఫలింపజేసిన 'స్వరాజ్' పత్రిక 1907-8 లలో అతివాదప్రచారం చేసి దాని యధిపతిని ప్రథ

త్వమువారు మూడేండ్లు కారాగారమునకు పంపగా అంతరించిపోయినది. దక్షిణ హిందూస్థానంలో బ్రిటిషు ప్రభుత్వమువారి ఆగ్రహానికి గురియైన మొదటి పత్రిక యిదియే. అదేకాలమున రాజకీయవిషయాలలో కొంత తీవ్రంగా పనిచేసి నిలిచిపోయిన పత్రికలు ఆంధ్రకేసరి, నవయుగములు పేర్కొనదగినవి. అదే కాలంలోనే కొద్దిగా వెనుకగా శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు గారు బొంబాయిలో ఆంధ్రపత్రికను వారపత్రికగా ప్రారంభించి మొదటి ప్రపంచయుద్ధము, హోంరూలు ఉద్యమము దినాలకు సరిగా మద్రాసుకుమార్చి దినపత్రికగా ఆరంభించిరి. ఆరెండు చారిత్రక పరిస్థితులును తరువాత గాంధీజీ నాయకత్త్వమును ఈ పత్రికాభివృద్ధికి తోడైనవి. గాంధీయుగంలో బ్రిటిషుప్రభుత్వపు తీవ్రదృష్టికి గురియయి యేనమండుగురు సంపాదకులను కారాగారానికి సమర్పించిన "కాంగ్రెసు" పత్రిక ఆంధ్రపత్రికల ప్రపంచములో చిరకీర్తి గడించినది.

వీరేశలింగంగారితో ఆరంభమయిన సారస్వత సాంఘిక పరివర్తనము సాగుచువచ్చినది. అందుకు చిహ్నముగా అనేక శాఖల పత్రికలును బయలుదేరి ప్రకటితమయినవి. విద్యావిషయకాలు, మత విషయకములు, సంఘసంస్కారపరములు, వ్యతిరేకములు, సారస్వతమున ప్రాచీనర్వాచీన పంథాలకు చెందినవి. ఆరోగ్య యుర్వేద విషయకాలు, స్త్రీల యభివృద్ధి పరములు, కళలు పరిశ్రమలకు సంబంధించినవి. ఇన్నిటికి చెందిన పత్రికలు బయలుదేరినవి. ప్రత్యేక సంఘాల సమూహాల అభివృద్ధికోసే పత్రికలును ఎన్నో ప్రకటితమయినవి. ఈ తెగ పత్రికలలో శనగపల్లి రామస్వామిగుప్తగారి ఆర్యవైశ్య మొదటిదిగా తోచుచున్నది.

గాంధియుగపు పత్రికలు ఎక్కువ అదృష్టము చేసుకొన్నవి. సంపూర్ణస్వాతంత్ర్య యుగము, పునర్నిర్మాణ యుగము, అంతర్జాతీయయుగము, అహింసా యుగము—ఏపేరుపెట్టి పిలిచినా యిది మహా తేజో యుగము. ఈ యుగోద్భవ దినపత్రిక ఆంధ్రప్రభ. భారతి, జయంతి, ఉదయిని, అభ్యుదయ వగైరా సారస్వత పత్రికలు, గృహలక్ష్మి, ఆంధ్రమహిళ మొదలగు స్త్రీల పత్రికలు, రూపవాణి, నాట్యకళ వగైరా ప్రత్యేక విషయక పత్రికలును కృషి, పాడిపంటవంటి సాంకేతిక పత్రికలును, నవోదయ వంటి నూతనపక్కి పత్రికలును నేటి విప్లవధోరణిని ప్రతిఫలింపజేయుచున్నవి.

మద్రాసుకోస్తా బయటి ఆంధ్రులకేర్పడిన పత్రికలనూ మరువరాదు. విశాలాంధ్ర, గోల్కొండ పత్రిక, ప్రహాసి, దక్షిణాంధ్ర పత్రిక మిత్రుడు కీ॥ శే॥ అవుటుపల్లి నారాయణరావు నడిపిన కార్మిక పత్రిక బొంబాయిలో కీ॥ శే॥ శంకరశాయన్న నిర్వహించిన తెలుగు సమాచార్ పేర్కొనదగినవి.

ఆంధ్రదేశములో ఇంగ్లీషుభాషా పత్రికలును కొంత చక్కగా నడచినవి. పట్టాభిగారి జన్మభూమి, రు.2000ల ధరావత్తును 1919 లో పోగొట్టుకొన్న నేషనలిస్టు, గాంధి యుగారంభమున అపార సేవచేసిన ప్రకాశంగారి స్వరాజ్య, ఖాసావారి స్వతంత్ర గణనీయములు.

## ఇతర దేశముల పత్రికా రచనాభివృద్ధికి మన దేశంలోని అభివృద్ధికి కల వ్యత్యాసము.

ఇతర దేశాలలోని అంటే బ్రిటను, అమెరికా, రష్యా దేశాలవంటి దేశాలలో పత్రికాప్రచారము చాల విపులము. అక్కడి పత్రికలకు ప్రచారము లక్షల ప్రతులలో లెక్కపెట్టతగియున్నది. లక్షలప్రతులు మన దేశంలో ఏపత్రికయైనా అమ్ముడుపోవుట కన్పించదు. తెలుగు పత్రికలలో పదివేలప్రతులు దాటిన పత్రిక ఉన్నదా యనునది ప్రశ్న? దీనికికారణా లనేకము.

(1) ఇతర దేశాలలో నూటికి నూర్గురు అక్షరాస్యులు. మన తెలుగుసీమలో నూటికి 12 గురు లేరు.

(2) అభివృద్ధి చెందిన ఇతరదేశాలలో ఆయాభాషా పుత్రులు సాధారణంగా వొకేరాజకీయ పరిపాలనయందున్నారు. మనం తెలుగువారం మద్రాసు, మైసూరు, హైదరాబాదు, మధ్యపరగణాలు ఇన్నిప్రాంతాలలో వున్నాము. పరిపాలనా భాష, చదువులలో ఉత్తమ తరగతులలో భాష పరభాష.

(2) పత్రికలకు స్వాతంత్ర్యము సంకుచితము. ఇప్పటికిని అంతే:

(3) పరులపాలనమున మన మతి దరిద్రులమయి పోయినాము.

(4) మన సాంఘికాచార్యాలు మనలను చిన్నచిన్న సంఘాలుగా విభజించి పరస్పర బహిష్కారానికి దారి జూపినవి. రాజకీయపార్టీలును అదేధోరణిలో పడినవి.

(5) మన పత్రికల బట్వాడారేట్లుకూడా ఎక్కువ.

(6) అచ్చుకూర్పుకొసే సదుపాయాలు మైపుబ్రాత వంటివి మనకుకొరత.

(7) దేశభాషలలోనికి తర్జుమా చేయడంలోనూ వృథాప్రయాస.

(8) కాగితానికి, సిరాకు, పరికరాలకు ఇతరదేశాల మీద ఆధారపడవలసి యున్నది.

(9) ప్రపంచ వర్తమానాలు సరఫరా చేసే సంస్థలు మనవి కావు.

## ఇంగ్లండు అమెరికాల పత్రికల ఆశయాలకూ మన పత్రికల ఆశయాలకు గల వ్యత్యాసము

అవి స్వతంత్రదేశాలు. వారి ఆర్థికశ్రేయస్సు, వ్యాపార వాణిజ్యములు పెంపొందడానికి వారికి కార్యక్రమాలేర్పడినవి. కాబట్టి మంచి పెట్టుబడి పెట్టి లాభసాటి బేరంగా పత్రికలు నడపడము వారి ఆశయం. మనది అంకితరాష్ట్రము. స్వాతంత్ర్య సంపాదనపు పోరాటమే మనకు ప్రథమగమ్యం. విశ్రమ విరామంలేక ధైర్యమే పెట్టుబడిగా అగ్నిగుండంలోని కురికి త్యాగం కావడమే పరమావధిగా మన పత్రికలు పనిచేసినవి. చేయుచున్నవి. ఏ హిందూబోటి విశేష ప్రతిభతో మెలగే పత్రికలో వ్యాపారంగా నిలువగలుగుచున్నవి.

## రచనావిధానంలో దినపత్రికకు, వారపత్రికకు, మాసపత్రికకు గల భేదము

తాజావార్తలివ్వడం, ఆ నిమిషానికి తోచిన వ్యాఖ్య వ్రాయడం మాత్రం దినపత్రికల విధిగా నున్నప్పుడు రచనలో పటుత్వముండ వీలులేదు. తాపీగా కూర్చొని పని చేసుకోడానికి వీలున్నందున వారపత్రికలు బిగువైన శైలి, విషయ వివరణలో పాండిత్యము, వార్తలివ్వడంలోనూ విచక్షణ కనుపరచుటకు వీలుండును. ఇక మాసపత్రికలకన్నో వార్తలతో ప్రసక్తియే పనిలేదు. విషయ వివరణలో కూడ పరిశోధనతో కూడిన వైశిష్ట్యము కనుపరచ వీలున్నది. ఈ పత్రికల రూపంలోనూ చాల భేదముండును. దినపత్రిక వూరక పారచూడడానికి వీలైన పెద్ద యాకృతిలో పెద్ద అక్షరాల శీర్షికలతో త్వరగా క్షీణించు కాగితంతో తయారవుతుంది. వారపత్రిక స్వరూప మొక కొంత కాలము దినపత్రికకూ మాసపత్రికకు మధ్యస్థముగా వుండేది. కాని ఇప్పుడు హూ హూ కారంగా మాసపత్రిక రూపాన్నే తాలుస్తూవుంది. దినపత్రికలే యీ దినం మేగజీన్ భాగాలు చేర్చి వారపత్రికలు మాసపత్రికలతో డీకొన జూస్తున్నవి.

## స్త్రీలు, పిల్లలు, కార్మికుల పత్రికలు

తెలుగు దేశంలో స్త్రీలకని ప్రకటితమయ్యే హిందూసుందరి ఇంకా చిలక ప్రెస్సులో అచ్చవుతూ 17 వ శతాబ్దమును స్మరింపజేస్తున్నది. గృహలక్ష్మి చాల దివ్యంగానే సాగింది కాని ఏ కారణంచేతనో బాగా వ్యాపకం కాలేదు. ఆంధ్రమహిళ నవనవవికాసంతో బయలుదేరింది. మన యాశీస్సు లీ పత్రిక కందింపనగును. అక్షరాస్యతను స్త్రీలలో దీక్షగా వ్యాపింపజేస్తేనేగాని స్త్రీలపత్రికలు అభివృద్ధి కావు.

పిల్లల పత్రికలు అంటే వొక్క 'బాల' ఇటీవలే బయలుదేరింది. కనుపిస్తుంది. పెద్దక్షరాలు, ముద్దయిన పాటలు, చక్కని బొమ్మలు ఈ పత్రిక బాగుంది. కాని అప్పుడప్పుడు పిల్లి శకునమున అమావాస్యనాటి ప్రాపుదోషము ఇటువంటి మూఢత్వ ప్రతిపాదిక విషయాలు ఇందులోనుండి తొలగవలెను.

## పత్రికల బాధ్యత

పిల్లల పత్రికలు చాలా అభివృద్ధి కావడానికి అవకాశముంది. పెద్ద బొమ్మలు కొద్ది అక్షరపు వరుసలు కలిగి వస్తులాకారంగా గల బేసిక్ విద్య చదివే పిల్లల కొరకు గవర్నమెంటే పిల్లలపత్రిక ప్రకటించడం మేలు.

కేవలము నిష్పాక్షికంగా తాజావార్తల నందజేయడము పత్రికల కృషిలో ప్రధానాంగంగా వుండదగిందే కాని ఆమాత్రంతో పత్రిక ఆగరాదు. వార్తలను చదివి పూర్వాపరములను సమన్వయం చేసుకోగల చదువరులు చాల అరుదు. కాబట్టి వార్తల నాధారపరచి విషయ వివరణచేసే వ్యాఖ్యలు వ్రాయడం ముఖ్యాంగం. వదలరానిది. లోకంలో అభిప్రాయ భేదాలున్నంతసేపూ తన పక్షాన్నే బలపరచే అభిప్రాయాలు వ్రాయడమేగాక వార్తలివ్వడంలోనూ యీ దృష్టే కనుబరచి విలేఖకుల రుజుత్వాన్ని నిరోధించే పత్రికలుకూడా వున్నవి. "సత్య

బుద్ధి లోకంలో ఇంకా యెక్కువగా ప్రబలితేకాని యీ ధోరణి పూర్తిగా తొలగిపోదు.

## సంపాదకులకు, యజమానులకు, ప్రకటన కర్తలకు సంబంధము

నేటి పరిస్థితులలో యజమాని పెట్టుబడిదారు; పత్రిక లాభనష్టాలతనివి. కాబట్టి స్థూలమయిన కార్యనీతిని నిర్వచించుట కతనికి సంపూర్ణాధికారము కలదు. అది యంగీకరించితేనే పత్రికలో సంపాదకత్వము వహింప నగును. కాని అనుదిన పత్రికానిర్వహణములో యజమాని వేలుపెట్టరాదు. స్థూలనీతికి లోబడి పనిచేసే సంపాదకునికి ఇతరత్రా పూర్ణ స్వాతంత్ర్య ముండవలెను. వ్యక్తిగతమయిన విూషణ భూషణములు చేర్చవలసిందని సంపాదకుని యజమాని కోరడానికి అవకాశమే యుండరాదు. అప్పుడు సంపాదకునిది దాస్యమవుతుంది గాని వృత్తికాదు.

పత్రికలలో ప్రకటనలు వేయడం ఆర్థికస్థైర్యము కోసరము, కాని తన యాత్మసాక్షికి వ్యతిరేకంగా యజమాని యెప్పుడూ ప్రకటన చేయుట కంగీకరింపరాదు. డబ్బుకొరకు ప్రకటన లంగీకరిస్తే తన శీలానికే హాని రాగలదనే కారణంచేతనే గాంధీజీ తన పత్రికలలో ప్రకటనే యంగీకరింపడు. ఇది యుత్తమ మార్గము. కాని నేటి ప్రపంచములో ప్రకటనలేని పత్రిక యుండజాలదనే విశ్వాస మేర్పడియున్నది. అహింసావాదాన్ని బలపరచే పత్రికలు యుద్ధపరికరాల ప్రకటనలు, మాంస రసముల ప్రకటనలు ప్రచురించుచున్నవి. ఇది విచారకమునో కాదో యను ప్రశ్నతో సంబంధము లేకపోయినా విచార్యము మాత్రము-సాధారణంగా పెద్ద పత్రికలలో ప్రకటనలకు ప్రత్యేకము సంపాదకు డుంటాడు. అతణ్ణి సంపాదకుడనుట తప్పు. అతడు వ్యాపార నిర్వాహకుడు.

పెద్దపెద్ద ప్రకటన కర్తలు తమ ప్రకటనల డబ్బు కొరకు పత్రికలు తమ్ము పొగడి వ్రాయుదురని యెదురు చూతురు కాబోలు. పొగడినా, పొగడకపోయినా నేటి దినం పెద్ద ప్రకటనలను గురించి పత్రికవ్రాతలలో ఏ కొద్ది వార్తో వేయడం ఆచారమయియున్నది.

## చదువరుల బాధ్యత

సత్య మాలోచిస్తే వివేకముకల చదువరి పత్రికకు నిజమయిన యజమాని, డబ్బిచ్చే పెట్టుబడిదారులు ప్రకటన లిచ్చేవారుగా ఏర్పడినందున ఈ యాజమాన్యము సన్నగిల్లియున్నది. అయినా పత్రికల లోపాలను సంపాదకులకు ఎత్తిచూపడానికి చదువరికి సంపూర్ణాధికారము కలదు. సబబుగా ఇతడు చూపే లోపాలను పత్రికా నిర్వాహకులు గ్రహించుకొందురనికూడ నమ్మవచ్చును. చదువరు లెక్కువమ్మడిగా వ్యతిరేకాభిప్రాయు లయినచో పత్రికలు బహిష్కారమును పొంది కృశించి నశింపవలసి వచ్చును. చదువరుల నాకర్షింపగలిగినప్పుడు పప్పులు బెల్లాలవలె అమ్మి వారు వ్యతిరేకులు కాగానే నిలిచి పోయిన న్యాయిండియాబోటి పత్రికలే యిందుకు తార్కాణము. పత్రికల మేలు కీళ్లు నిర్ణయించే అధికారం సహజంగానే చదువరుల చేతిలోవుంది.

## పత్రికలు చదువడం వొక అలవాటుకావలెను

చదువువస్తేగా చదువడం అలవాటు కావడం అనే ప్రశ్న వుదయిస్తుంది. మన దేశంలో చదువగలవారు నూటికి 13 గురు లేరు. ఇందులో పత్రికలు చదువగలవారు చాల తక్కువ కాబట్టి నేటి పరిస్థితులలో చదువరుల అశ్రద్ధనుగురించి మాట్లాడి ప్రయోజనంలేదు. ప్రజలను చదువరులనుజేసే ప్రయత్నానికీ వారి చదువు పత్రికా పఠన కుపయోగపడడానికి తగిన గ్రంథాలు వొదవించే గ్రంథాలయ ప్రయత్నానికి మన దేశంలోని పత్రికలు ప్రబలదోహదం చేయకపోవడం పత్రికల దోషమేనని నా యభిప్రాయం. పత్రికలు చదువడమనే అభ్యాసమే కాదు, చదివితే వినే అభ్యాసంకూడా ప్రోత్సహించీన్నీ మనము నేడుంటేస్థితి తప్పలేదు.

## ప్రభుత్వము - పత్రికలు - పరస్పర సంబంధము

దౌర్జన్యపద్ధతులు ప్రభుత్వాల కాధారమయినంత కాలము క్లిష్టపరిస్థితు లేర్పడినప్పుడు ప్రభుత్వాల పర్యవేక్షణ అంతో యింతో తప్పదు. అట్టి పర్యవేక్షణే కడచిన యుద్ధకాలంలో జరిగింది. అప్పు డధికారంలో వున్న ప్రభుత్వాలు నిరంకుశప్రభుత్వాలు కావడంచేత దేశీయ పత్రికలు గొప్ప నిర్బంధాలు అనుభవించవలసి వచ్చినది. అది కారణంగానే అఖిలభారత పత్రికా నిర్వాహకుల సంఘమేర్పడి ప్రభుత్వమువారు కొన్ని సల

హాలు తీసుకోకుండా నిర్బంధములు విధించరాదని కోరినారు. ఈ కోరికను కొంతవరకూ ప్రభుత్వం మన్నించవలసి వచ్చింది. నేడు అఖిలిండియా సంఘము ప్రాంతీయ సంఘాలు వున్నవి. యుద్ధకాలంలో ఏదో కారణం చెప్పి ప్రభుత్వం పత్రికలను నిరోధించినా చెల్లిపోయింది. శాంతి సమయాలలో అట్టి నిరోధం పనికిరాదు. అందులోనూ ప్రజా ప్రభుత్వాలు అట్టి నిరోధాలను నిలుపరాదు. కాని ప్రజా ప్రభుత్వాలకు కూడా క్లిష్టసమస్యలుదయించకపోవు. అట్టి సందర్భాలలో తమ దృష్టిపథాన్ని పత్రికలవారికి స్పష్టంగా తెలియపరచడానికి ఇప్పు డేర్పడిన సంస్థలు పనికవచ్చును. ఈ సంస్థలు తాముచేసే సలహాలనూ చేయవచ్చును. పరస్పర విశ్వాసంతో నడుచుకొంటే ఎంత భేదాభిప్రాయాలున్నా పరస్పర సహనంతో ప్రవర్తించడానికి అల్లరులు అల్లకల్లోలాలకు తావీక క్రమపూర్వాలలో పరివర్తనాలు దేశంలో జరుపుకోడానికి వీలుంటుంది. ఈ పరమావధని సాధించడానికి పత్రికలవారు వుమ్మడిగా ఆలోచించుకొని పత్రికలను నడుపడానికిని ఈ సంస్థ లుపయోగపడును.

## ప్రతిపాదించే అంశాలు

స్వలాభము, దేశలాభము ఆలోచించి ప్రజలు అక్షరాస్యులు కావడానికీ పత్రికలు, గ్రంథములు చదివే అలవాటు ఏర్పడడానికీ అన్ని పత్రికలున్నూ కృషిచేయవలెను. ఆ కృషిలో వుండేవారికి పూర్ణప్రోత్సాహ మీయవలెను.

పత్రికలలో పనిచేసే సంపాదకులు, పత్రికలకు వార్తలుపంపే విలేఖరులు అనుభవించవలసిన స్వాతంత్ర్యాలను గురించి చక్కటి నియమా లేర్పడవలెను.

దేశభాష పత్రికలు పూర్ణప్రయోజనకారులు కావలెను. కాబట్టి ప్రాంత వ్యవహారములన్నిటినీ ప్రాంతభాషలోనే జరుపుట కేర్పాటులు జరుగవలెను.

మనకు రాజకీయ స్వాతంత్ర్యం సమకూరుస్థితి యేర్పడినది. కాబట్టి పత్రికలు నిర్మాణ కార్యకలాపానికి ఎక్కువ ప్రాముఖ్య మీయవలెను.

పత్రికల స్వాతంత్ర్యమును అరికట్టే నిర్బంధాలు తొలగించుటకు ప్రభుత్వాలు చర్య జరుపవలెను. దేశభాషలలో లిపిసంస్కారము అత్యవసరముగా జరుపవలెను. టైపురైటరు వగైరా నూతన సామగ్రి అభివృద్ధికి తగిన ప్రయత్నము చేయవలెను. పత్రికల బట్వాడాకు ఎక్కువ సదుపాయములు టపా, రైలు వగైరాలలో జరుగవలెను.

మనదేశ ప్రజలతో ఏర్పడే వ్యాపారసమితి నేర్పరచి ప్రపంచవార్తలు పత్రికలకిచ్చే యేర్పాటు చేయవలెను.

పత్రికా ప్రకటనకు కావలసిన కాగితము, సిరా, ఇతరపరికరాలు సాధ్యమయినంత యెక్కువగా మన భూమిలోనే వుత్పత్తిచేసే ప్రయత్నము చేయవలెను.

స్త్రీలు, పిల్లలు, కార్మికుల ప్రత్యేక పత్రికలకు ప్రభుత్వము, విద్యాలయాలు, ప్రచురణసంఘాలు ప్రజ విరివిగా ప్రోత్సాహ మీయవలెను.



# ఇంటగెలిచి రచ్చగెలవాలి

## శ్రీ కపిల కాశీపతి

ఆంధ్రదేశంలో పుట్టి, ఆంధ్రదేశంలోనే పెరిగి, జాతీయ సంస్కృతికి మేలుజేసి జగద్విఖ్యాతి పొందిన వ్యక్తులు అరుదు; లేరనే చెప్పాలి! ఒక్క కోడి రామమూర్తి నాయుడు తప్ప. ఇతర జాతులలో అల్లాకాదు. రాజకీయనాయకులు గాని, విజ్ఞానవేత్తలుగాని, ముందుగా తమ రాష్ట్రంలో పేరు ప్రతిష్టలు సాధించి, తదుపరి ప్రపంచఖ్యాతి సంపాదిస్తారు. గురుదేవుడైన రవీంద్రుడు ఆదినించి అంతంవరకూ వంగదేశీయుడే. వంగభాషా కవిచంద్రుడే. ఆ పునాది మీదే అతని విశ్వకల్యాణతత్వం విస్తరించింది. వంగదేశీయులు గురుదేవుణ్ణే పూజించి అధిష్ఠానం దైవంచేశారు. ఆ భక్తితత్వమే ప్రపంచం అంతా పాకింది.

ఆంధ్రదేశంలో అల్లాకాదు. బైట పేరు ప్రఖ్యాతులు సంపాదించి సభాగౌరవం పొందిన తెలుగువాడికి దేశంలో పలుకుబడిలేదు. స్వదేశంలో వూరూ పేరూ లేదు. ఒకవేళ ఖర్మంజాలక ఏ ఒకరికో దేశంలో పలుకుబడి కలిగితే వారికి దేశాంతరంలో నామరూపాలు లేకుండా చెయ్యడం ఆంధ్రుల సంప్రదాయధర్మం. వారసత్వపు హక్కు. మనవాళ్ళకి పొట్టపూజేగాని వీరపూజ లేదు. "మనవాళ్లు వట్టి వెధవలోయ్." అన్నాడు గిరీశం. గిరీశం ఆంధ్రుడు. పదహారణాల అసలైన సిసలైన ఆంధ్రుడు. అటువంటి వ్యక్తి ఏజాతిలోగాని అరుదు. కానైతే గిరీశం సంగతి ఇతర జాతులికి తెలియదు.

ఆవేశంలో, ఆత్మస్వాతంత్ర్యంలో, మేధాశక్తిలో, కళాసృష్టిలో, దేశభక్తిలో ఆంధ్రుడనేవాడు ఈ భూలోకంలో ఎవరికీ తీసిపోడు. అన్నీ వున్నాయిగాని అయిదోతనం లేదన్నట్టుంది మనజాతిసంగతి. అయిదోతనం వుంటేనే తక్కిన నాలుగుతనాలూ రాణిస్తాయి.

మనతరంలో అవతరించిన వో సంపూర్ణాంధ్రుణ్ణి తీసుకుందాం. అతని పేరు దుగ్గిరాల గోపాలకృష్ణయ్య. ముప్పైయెనిమిది సంవత్సరాల స్వల్పజీవితంలో వో వెలుగు వెలిగి ఆరిపోయాడు, కొంచెం హెచ్చుతగ్గులతో అతనితో సమకాలికులైన ఇతరజాతీయపేరుల్ని తీసుకుందాం. మహారాష్ట్రలో బాల గంగాధర తిలక్, వంగదేశంలో చిత్తరంజన్ దాస్. గోపాలకృష్ణయ్యకి వారికున్న మేధాశక్తివుంది గాని వారికుండే చాకచక్యం లేదు. వాళ్ళ ప్రతిభేగాని, వాళ్ళపట్టుదల లేదు. వాళ్ళ ఆవేశమేగాని వాళ్ళ వోరిమి లేదు. వాళ్ళ దేశభక్తేగాని వాళ్ళ రాజనీతి లేదు. అందుకే ఆరిపోయాడు. దీనికి కారణం ఆంధ్రత్వమే. ఆంధ్రదేశమే.

తెలుగువాళ్ళలో పైత్యప్రకోపం ఎక్కువ. ఈ ప్రకోపంవల్ల కామెర్లు రావాలి వైద్యశాస్త్రరీత్యా. భౌతికంగా కాకపోయినా సూక్ష్మంగానైనా ఈ కామెర్ల తత్వం తెలుగువాడి మేధస్సుని ఆవేశించింది. స్వభావం అసూయా ప్రధానంగా మార్చింది. మనవాళ్లకి పొరుగింటి పుల్లకూర రుచి. అంతా ఇంటికుక్కతత్వం. అందుకనే ఇన్నాళ్ళుగా ఉపాసించిన రాష్ట్రలక్ష్మి ఆంధ్రుడికి సాక్షాత్కరించలేదు. ఉపాసనా విధానంలో వుండే స్వల్ప దోషాలవల్ల జెడిసి కొడుతోంది.

అందుచేతనే అనాదినించీ వికసించవలసిన, వికసించగలిగిన, ఆంధ్రత్వం పరాయిదేశాల పాలైంది. ఆ దేశాలమీద ఆధారపడి, ఆ దేశాల్ని బాగుజేసి, జాతీయసంస్కృతికి మేలు చేసిన ఆంధ్రుల్ని, ఆంధ్రజాతి అనవసరంగా ఆరాధిస్తుంది—మావాడేనని చంకలు కొట్టుకుంటుంది.

ఆంధ్రసామ్రాజ్య విజృంభణతో పాటు తమిళదేశానికి వలసపోయి నాద బ్రహ్మోపాసనలో సిద్ధిపొందిన త్యాగరాజస్వామి ఆంధ్రుడు. కానైతే రాష్ట్రేతరాంధ్రుడు. మనోవాక్కాయకర్మలతో ఈనాడు తమిళవిజ్ఞానలక్ష్మి త్యాగబ్రహ్మోపాసన చేస్తోంది. ఆంధ్రుడుచూసి సంతోషిస్తున్నాడు. ఏమీ చెయ్యడం లేదు.

ఆంధ్రదేశంలోపుట్టినవాడు ఆంధ్రదేశంలోనే పెరిగినవాడు, గోలకొండతానీషా సభలో రాజగౌరవంపొంది సన్మానంపొందినవాడు సిద్ధేంద్రయోగి; విశిష్టమైన భరతనాట్యశాస్త్రం ఆంధ్రదేశానికి ప్రసాదించాడు. ప్రసాద మహత్యం ఆంధ్రులకి తెలియలేదు. విమలసిద్ధాన్నం విరజిమ్ముకున్నారు. సిద్ధయ్యకూచిపూడిలో కూరుకుపోయాడు. ఆప్రసాదఫలితంవల్ల తమిళదేశంలో తంజావురోద్యానవనాలలో రాష్ట్రేతరాంధ్ర సౌభాగ్యం వెల్లివిరిసింది. ఆశాస్త్రాన్ని ఈనాడు ఇతర దేశాలలో తంజావూరు నాట్యంగా పరిగణించి గౌరవిస్తున్నారు.

మనవిద్య ఇతర రాజ్యాలలో రాణిస్తుంది. మనమేధస్సు ఇతర దేశాలలో తేజరిస్తుంది. మనవాళ్లు పరాయిదేశాలలో గౌరవం పొందుతారు. మనము మాత్రం ఇల్లాగే వుంటాం.

ఆంధ్రపత్రికా రచయితలు ఇతర రాష్ట్రాల పత్రికలు ప్రతిభతో నడుపుతున్నారు. మన దేశంలోవుండి మనదేశానికి సేవచేసే భాగ్యం వారికింకా కలగలేదు. కలిగే ఆశలు మాత్రం లేకపోలేదు. అంతవఱకు శుభసూచనే. యావద్భారత దేశంలోనూవున్న పై అంతస్థు ఏ సలుగురిలోనో ఎన్నికగన్న రాధాకృష్ణయ్యగారికి ఆంధ్రదేశం ఇరుకుజేసి పారేశాం. ఢిల్లీకోటలో పాగావేసి ఆనాడు పండితరాయలే గంగాతీరాన్ని గౌరవం సాధించాడు, ఈనాడు రాధాకృష్ణుడే సాధిస్తున్నాడు.

మనకి ఆత్మాభిమానమేగాని ఆత్మగౌరవం లేదు. ఆవేశమేగాని దురాలోచన లేదు. ఇంకొకడికి పట్టం గట్టి ప్రతిభ చూపించగలం. మన రాజ్యం చక్కబెట్టుకోలేం. ఆత్మ సంస్కారం లేని సంఘసంస్కార ప్రయత్నం ఫలించదు. చూసి నేర్చుకోడం మనకపుడి రివాజు. ఆంధ్ర మానవుల్ది మాత్రం కాదు. మనకి తోడునీడగా వున్న తమిళ జాతినీ, మనమీద ప్రభుత్వం చేసిన బ్రిటిషు జాతినీ, ప్రస్తుత భారతీయ ప్రభావానికిగాని, పరిస్థితులికిగాని కారకులైన ఘూర్జరజాతినీ చూసి మనం నేర్చుకోవలసిన విషయాలు చాలావున్నాయి. నోరు మంచిదైతే వూరు మంచిదన్నారు. తెనుగువాడు బాగుపడాలంటే నోటి మంచితనం నేర్చుకోవాలి. నోటి తొందరవల్లనే మనకి రాష్ట్రపతిత్వం రాకుండాపోయింది.

తెనుగువాడు రచ్చలో గెలుస్తున్నాడు, రాణిస్తున్నాడు, దేశాంతరంలో బాగుపడుతున్నాడు, ప్రతిభ చూపిస్తున్నాడు. ఆఖరికి క్రికెట్టులో కూడా పేరుపొందిన నాయుడు సోదరులు రాష్ట్రేతరాంధ్రులు. జర్మనీలో కూడా పేరుపొంది, హిట్లరుకి జాతకం చెప్పిన కొందరు కొల్లు మునసబు తమ్ముడు జ్ఞానానందయోగి ఈ

నాడు రాష్ట్రేతరాంధ్రుడు. పరిగెత్తి పాలు తాగడం కంటె నుంచుని నీళ్లు తాగడం మంచిదనే తత్వం తెనుగువాడిది. అది పోవాలి. బర్మాలో తైలంగ సామ్రాజ్యం స్థాపించిన స్థైర్యం, జాఫ్నాకి వారావధి కట్టిన ధైర్యం, మళ్లీ రావలంటే తెలుగువాడు ఇల్లు చక్కబెట్టుకోవాలి. తోటివాడి ప్రభావం గుర్తించి వాడికి దోహదం చెయ్యాలి. వెధవకక్ష సాధించడం మానెయ్యాలి. మన జాతీయ చరిత్ర కక్ష భూయిష్టం. అంచేత కష్ట భూయిష్టం. బొబ్బిలియుద్ధం కక్షకోసం జరిగింది. పల్నాటి యుద్ధం కక్షకోసం జరిగింది. మన గ్రామ యుద్ధాలు ఈనాడు కక్షకోసమే, కోర్టులలో కోడిపందెం బొంగరాల కక్షలోంచి మనం ఎన్నికల కక్షలోకి పరిణమించాం. మన సుగుణాలు మర్చిపోవడంవల్ల ఇటువంటి వ్యక్తి ప్రాధాన్యమైన, అహంకార పూరితమైన జాతికి పరమేశ్వరుడు మరో లక్షణం ప్రసాదించాడు. అది భక్తి. ఏభక్తి తత్వమైనా మన ప్రజాసామాన్యంలో పాకిపోతుంది. అంచేత సుగుణం ఏమిటీ అంటే జనబాహుళ్యం చెడిపోలేదు. ఏ కొద్దిమందినో మాత్రం ఈ కొత్త అవగుణాలు ఆవేశించాయి. వారు ముఖ్యంగా విద్యావంతులని పిలవబడే వారు. వారు తిరిగీభక్తిలోపడాలి. దేశం బాగుపడాలంటే, భాషమీద, రాష్ట్రంమీద, పెద్దలమీద, గురువులమీద భక్తి కావాలి. దానికి నమ్రత కావాలి. ఈ భక్తి నమ్రతల మూలంగానే ముగ్గురు ఆంధ్రరాజులు ఆ చంద్ర తారార్కమైన కీర్తి గడించారు. వారు మహాసామ్రాజ్యాలు సంపాదించి ఈ రాజ్యం ఏలిన ఇహలోక రాజులుకారు. మానవ హృదయ సామ్రాజ్యం పాలించే పరలోకరాజులు. కంచెర్ల గోపరాజు, బమ్మెర పోతరాజు, కాకర్ల త్యాగరాజు.

ఈ ముగ్గురు రాజుల త్యాగానికీ ఓ లక్ష్యం వుంది. అది ఏమిటీ అంటే చంచలమైన ఆంధ్ర హృదయానికి నిర్మాణస్థైర్యము చేకూర్చడం. అదీ అసలైన ఆంధ్రోద్యమం. నేటి ఆంధ్రోద్యమానికి భౌతికమైన రాజకీయలక్ష్యం ఒకటే. దానిమీద కూడా ఆంధ్రజాతికి నిర్లక్ష్యమే. ఆంధ్రుని అవగుణాలన్నీ ఒక్క మాటలో చెప్పాలంటే, ఆమాట "నిర్లక్ష్యం." ఇందులోనే మన నిరసాలన్నీ ఇమిడి వున్నాయి. ఈనిర్లక్ష్యభావం పోయేదాకా మనకి పుట్టగతులు లేవు. శ్రీరామ భక్తులైన ఆంధ్రులికి రామబాణం లాగే లక్ష్యం వుండాలి. అది సాధించాలి. అది సాధించడానికి ఆంధ్రస్వభావంమారాలి. బాతాఖానీ అనేది మన జాతీయవినోదం. మన మాటలు కోటలు దాటుతాయి. క్రియమాత్రం శూన్యం. పూర్వయుగంలాగే ఆధునిక యుగంలో కూడా ఉత్తరకుమార ప్రజ్ఞలకి తావులేదు. స్వస్వరూపజ్ఞానం కలిగి భౌతిక లక్ష్యానికి ఆధ్యాత్మిక లక్ష్యం సంధించి, స్వభావక్రమం మార్చుకునేదాకా మన దానకర్ణత్వానికి శల్యసారధ్యం తప్పదు. తన్ను మాలినధర్మం మానేసి ప్రతి తెలుగు వాడూ ఇంట్లో గెల్చిన తర్వాతగాని రచ్చకెక్కకూడదు. అప్పుడే ఆంధ్రోద్యమం సార్థకం అవుతుంది.

# * ఢిల్లీకి ప్రధాన మంత్రియైన ఆంధ్రుఁడు *

డాక్టర్ నేలటూరు వెంకటరమణయ్య

క్రీ. శ. ౧౩౫౧ మొదలు ౧౩౮౮ వఱకును ఢిల్లీ సామ్రాజ్యమును పాలించిన ఫీరోజ్‌షా తుఘ్లుకు పాలనమున నతనికి సర్వేశ్వర ప్రధానియై యతని కార్యమునకును ఖడ్గమునకును కర్తయై యతని మేలుబడిని జయప్రదముగ సాగించిన రాజకార్యమర్మజ్ఞుఁడు ఖానెజహాను. ఫిరోజ్‌షా సింహాసనము నధిష్ఠించిన తరువాత అహమ్మదు అయాజ్ ఖ్వాజా-ఇ-జహానుని స్థానమున నితనిని దనకు ముఖ్యప్రధానిగా విధించుకొనెను—తాను దూరదేశములకు దండయాత్ర వెడలవలసినప్పుడెల్ల రాజ్యమును రాజధానిని ఖానెజహానుని కప్పగించి పోవువాఁడు;- రాజ్యపాలనమును ఖానెజహానుఁడు మిక్కిలి సామర్థ్యముతో నిర్వహించుటవలన పాదుశాహ యెంతకాలము దండయాత్రలందు నిమగ్నుఁడై యుండినను ప్రభుత్వ మెప్పటివలె సడలక నడచెడిది. ఇతని యెడ సుల్తానున కత్యంతమైన విశ్వాసమును అభిమానమును గలిగినవి. ఇతని సలహాననుసరించక ఫీరోజ్‌షా యేకార్యమును సేయువాఁడు కాఁడు; కావున క్రీ. శ. ౧౩౭౦ న నితఁడు గతించువఱకు ఢిల్లీ సామ్రాజ్య పాలనయంతయు నితనిమీఁదనె యాధారపడి యుండినది.

జన్మముచేతను జాతిచేతను ఖాన్—ఇ—జహాను డాంధ్రుఁడు. ఇతనికి సమకాలికుఁడు తారీఖిఫీరోజ్‌షాహి యను చరిత్రగ్రంథమును రచించిన షంసిశిరాజ్ అఫీఫను చరిత్రకారుఁడితని పూర్వవృత్తాంతమును సంగ్రహముగ దెలియబరచియున్నాఁడు. మహమ్మదీయదీక్ష బుచ్చుకొనకముందు ఇతని నామధేయము 'కన్నా'- కాకతీయ ప్రతాపరుద్ర మహారాజు ఢిల్లీ సుల్తాను కుమారుఁడును యువరాజు నగు ఉల్లూఘ్‌ఖాను మహమ్మదుబిన్ తుఘ్లుకున కోడి యతనిచే బంధీకృతుఁడై ఢిల్లీకి గొంపోవబడునప్పుడు మార్గమధ్యమున నతఁడు పరలోకగతుఁడాయెను. అప్పుడా మహారాజుతోఁగూడ బందీలుగ పోవుచుండిన పెద్దదొరలలో నీ 'కన్నా' యొక్కఁడు. ఇతఁడు ప్రతాపరుద్రుని ముఖ్యసేనాపతులలోఁ జేరందినవాఁడు. ప్రతాపరుద్రుఁడు స్వర్గస్థుఁడైనపిమ్మట నితఁడు హిందూధర్మమును త్యజించి మహమ్మదీయమతమును స్వీకరించి మహమ్మదుబిన్ తుఘ్లుకు కొలువున జేరెను. అతఁడు 'కన్నా'కు మక్బూలను నామకరణము జేసి గొప్పయుద్యోగము నొసగెను. తండ్రిని చంపి క్రీ. శ. ౧౩౨౫ లో నతఁడు ఢిల్లీ సామ్రాజ్యమున కభిషిక్తుఁడైన వెంటనే మక్బూలునకు ఖానెజహాను బిరుదొసగి గుజరాతు మండలమునకు పాలకునిగ నియమించెను. క్రీ.శ. ౧౩౩౫ వ సంవత్సరమున దక్షిణదేశమున రేగిన యల్లరుల నణచుటకు వచ్చినప్పుడు మహమ్మదు బిన్ తుఘ్లు కితని దెలింగాణమునకు పాలకునిగ

నియమించెను. ఇతని జన్మదేశము తెలింగాణ మగుటచే నతని కచటి రాజకీయ మర్మము లన్నియు జక్కగ దెలిసియుండుననియు, నచటి ప్రజలయం దతనికి పలుకుబడి యుండుటచే వారిపై దనయధికారమునుచలామణిచేయుట కతడె తగిన యధికారియనియు దలచి, సుల్తా నితని గుజరాతు నుండి తెలింగాణమునకు మార్చినట్లున్నది. కాని సుల్తాను కోరిక సిద్ధించదాయె.

దైవదుర్విపాకముచే బ్రతాపరుద్రుడు మహమ్మదీయులకు బట్టుపడి యాంధ్రదేశమంతయు తత్క్షణమే మ్లేచ్ఛాక్రాంత మైనను తురకల యధికారము స్థిరముగ నిలువలేదు. తురకల యుపద్రవమువల్ల ప్రజలయం దైకమత్యము కుదిరి నూతనప్రబోధము గలిగినది. సమసిపోవ సంసిద్ధముగనుండు నిజధర్మమును సంస్కృతిని సంరక్షించుటకు రాజకీయ స్వాతంత్ర్యస్థాపన యావశ్యకమని వారు గ్రహించిరి. నూతనజాతీయోద్యమ మొకటి పొడచూపినది. అంతకు పూర్వ మెన్నడు నెఱుగని చైతన్యము ప్రజలయందు కలిగి వారి నుఱ్ఱూతలూచినది. ప్రజలేకమై ముసునూరి నాయకులను ముందుంచుకుని ఢిల్లీసుల్తానును డీకొనిరి. వారిసంరంభమునకు తాళజాలక మహమ్మదీయ దళములు విచ్చిపారనారంభించినవి. ఈ పరిస్థితియందు ఆంధ్రునొక్కని నాంధ్రదేశమునకు నియమించిన నతడుపొంగివచ్చు ప్రజావాహిని కడ్డుపడి తన యధికారమును నిలుపగలడని నిశ్చయించి మక్బూలును ఆంధ్రదేశపాలకుని జేసెను. మక్బూ లాంధ్రుండే; కానిస్వజాతిధర్మమును ద్యజించి తనవారికి సహజ శత్రువులైన మహమ్మదీయుల మతమును స్వీకరించి తాజెడ్డకోతి వనమెల్ల జెఱచిన ట్లాంధ్రదేశమున మ్లేచ్ఛప్రభుత్వమును మ్లేచ్ఛధర్మము నెలకొల్పుటకై ఢిల్లీశ్వరునిచే నియమింపబడినవాడు. కావున ఆంధ్రుడైననేమి యన్యుడైననేమి? చీకటికి వెల్లదనమబ్బునా? తురకతురకగా అని చింతించి మక్బూలును మఱింత తీవ్రప్రహరింప నారంభించిరి. అతడు దేశమునం దెచ్చటను నిలువలేక క్రీ. శ. ౧౩౩౬లో నాంధ్రదేశమునకు స్వస్తిచెప్పి ఢిల్లీపోయి చేరెను. మరల సుల్తా నితని గుజరాతు మండలమున కధిపతిగ నియమించినట్లున్నది. క్రీ. శ. ౧౩౪౫ లో గుజరాతు నితడు పాలించుచుండినట్లు ఇబ్నె బతూతా వ్రాసియున్నాడు. మఱియు నా సంవత్సరమున నితడు గుజరాతునుండి ఖజానాతోగూడ ఢిల్లీకి బోవుచుండగా మార్గము మధ్య బరోడాసమీపమున సుల్తానుమీద తిరుగుబాటు చేసియుండిన అమీరులు కొందఱకస్మాత్తుగ నితనిపై కురికి ధనమును గుఱ్ఱములను దోచుకొనిరనియు దరువాత పయనము సాగించజాలక నెహర్వాలకుబోయి తలదాచుకొనెననియు దెలియవచ్చుచున్నది. ఇట్లు మక్బూలు శత్రువులకోడి రాష్ట్రపాలనను నిర్వహించజాలకపోగా మహమ్మదుబిన్ తుఘ్లుకు మరియొకని గుజరాతునకు మండలాధి

పతిగ నియమించి పంపెను. ఆతడును తన యధికారమును నెగ్గించుకొనజాలకపోగా సుల్తా నొక పెద్ద సైన్యమునిచ్చి మక్బూలును శత్రు సంహారము సేయనంపెను. నర్మదా తీరమున విప్లవకారులపై బడి ఘోరముగపోరి మక్బూలు వారిని చెల్లాచెదరు గావించెను; తరువాత సుల్తాను ఢిల్లీనుంచి తరలివచ్చి యితని గలుసు కొనెను. అదిమొదలు క్రీ. శ. ౧౩౫౧ వఱకును మక్బూలు సుల్తానుతోగూడ గుజరాతున పర్య టనము సల్పుచు విప్లవకారులతో పోరాడు చుండెను. ఇంతటనె సుల్తాను పక్షమున ఢిల్లీ పురమును పాలించుచుండిన మల్లిక్ కబీరను నతడు కాలధర్మమునందె నని వార్తరాగా సుల్తాను ఇతనిని అహమ్మదు అయాజ్‌తోగూడ ఢిల్లీపాలకునిగ నియమించి యచటికంపెను. క్రీ. శ. ౧౩౫౧ లో సుల్తానుయొక్క మరణ కాలము వఱకు నచటనేయుండెను. సుల్తాను మరణానంతరము మక్బూలు అయాజుతో ప్రతి ఘటించిఫీరూజుతుఘ్లకుపక్షమవలంబించియతనిని ఢిల్లీ సింహాసనము నెక్కించెను. అదిమొద లితడు ఢిల్లీసామ్రాజ్యమునకు సర్వేశిరప్రధా నియై సుల్తానునకు రెండవవాడై సర్వాధికార మునకును గర్తయై పాలించెను.

సంగ్రహముగ మహమ్మదీయ దీక్షను బుచ్చు కొని మక్బూలునామమును ధరించిన వెనుక జరిగిన 'కన్నూ' చరిత్ర ఇది. ఈ 'కన్నూ' యెవ్వడు? ప్రతాపరుద్రుని సచివులలోగాని దండనాయకులందుగాని యితనిపేరు గలదా? యను విషయముల నింకను పరిశీలించవలసి యున్నది-ఆకాలపు శాసనములందుగాని వాఙ్మ యమునగాని 'కన్నూ' యెచ్చటను బేర్కొన బడి యుండలేదు; ఇది వింత కాదు; 'కన్నూ' యనునది యతని వాస్తవమైన పేరుకాదు; హిందూనామములను చక్కగా వ్రాయ నెఱుగని పారశీకచరిత్రకారులు కల్పించినయపభ్రంశ రూపము. మారనకవి వ్రాసిన మార్కండేయ పురాణమువలన ప్రతాపరుద్రుని సేనాధ్యక్షు లలో గన్నయ యను చతుర్థకులజు డొకడుండి నట్లు తెలియవచ్చుచున్నది. ఇతని పితామహుడు నల్లయ: తండ్రి నాగయ; తల్లి కాకతి గణపతి యొక్క తలవరియగు మేచయనాయకుని కుమా రితయగు మల్లాంబ. ఎల్లయ మేచయ ననువారలు తమ్ములు. మార్కండేయపురాణ తృతీయా శ్వాసారంభ పద్యమున గన్నయను 'కర్ణా' యని మారన్న సంబోధించియుండుటచే 'గన్న' శబ్దము 'కర్ణ' శబ్దభవమని తోచుచున్నది. మఱియు నీ నాగయగన్నయ ప్రతాపరుద్రుని మెప్పించి రాజ చిహ్నములు బడసినట్లు,

ఎలమి బ్రతాపరుద్ర మనుజేంద్రునిచేఁ బడసెఁ బ్రవీణుఁడై
కొలిచియు శౌర్యలీల రిపుకోటి రణావని గీటడంచియుఁ
బలరిపుతుల్యవిక్రముఁడు నాగయగన్న విభుండు తేజముఁ
విలసితరాజచిహ్నములు విశ్రుతలక్ష్మియు నాయకత్వమున్

అనుపద్యమువలనవిదితమగుచున్నది. ఇంకను రుద్రదేవ సామ్రాజ్యవర్ధన'ప్రతాపుత

స్థిరవినీతీకరణ కుశలు'డనియును, 'కాకతిక్ష్మాతలాధీశకటకపాలుఁ'డనియును, 'శ్రీమత్ప్రతాపరుద్ర మహామండలనాథ మండలావనదక్షుఁ' డనియును, 'శ్రీరుద్రదేవ నృపతిస్ఫారదయాలబ్ధవిభవుఁ'డనియును, 'మహితాంధ్ర నరేంద్ర దయాకటాక్షుఁ' డనియును, 'శ్రీకాకతినృపరాజ్య ప్రాకార ఋత భుజాపరాక్రమగణ్యుఁ' డనియును, 'కాకతినరపాల కటకపాలనస్థిరశౌర్యుఁ'డనియును, 'కాకతీశ్వర పురపాలన ప్రకట శౌర్యవిశేషుఁ'డనియుఁ గీర్తింపఁబడి యున్నాడు. దీనిబట్టి చూడఁగా గన్నయ ప్రతాపరుద్రునికి నమ్మిన దండనాథుఁడనియు నతనిపురరక్షకుఁడై పేరుప్రఖ్యాతులు వడసెనని నిశ్చయమగుచున్నది. 'గన్న,కన్నూ' శబ్దముల పోలికనుబట్టిచూడగా నాగయగన్న సేనానియే ప్రతాపరుద్రుని మరణానంతరము మహమ్మదీయ మతమును స్వీకరించి మల్లిక్ మక్బూలను బిరుదనామమును బొంది మొదట మహమ్మదుబిన్ తుఘ్లకునకు నమ్మిన సేనానాయకుడై తరువాత ఫీరోజు తుఘ్లకునకు ముఖ్యప్రధానియై ఢిల్లీ సామ్రాజ్యభారమును వహించెనని తోచుచున్నది. మహమ్మదీయ మతము నవలంబించక పూర్వము గన్నూ తెలింగురాజు కొలువున గడు ప్రసిద్ధుడై తనపారిషదాగ్రగణ్యుడై యుండెనని షంసిశిరాజ్ చెప్పినమాటలు నాగయగన్ననికి చక్కఁగ నన్వయము కాఁగలవు. మఱియు నీగన్నయకుఁగొంత స్త్రీచాపల్యము గలిగియుండినట్లు మారన మార్కండేయ పురాణమున సూచనలు గానవచ్చుచున్నవి. మల్లిక్ మక్బూలు ఖానెజహానునకును స్త్రీలాంపట్యము గలదు. ఇతని యంతఃపురమున నానా దేశసంజాతలగు సుందరులు రెండువేలమంది యుండిరట. ఈయంశములుగూడ నాగయ గన్నయయే కన్నూమల్లి మక్బూలను నభిప్రాయమును బలపఱచుచున్నది.



# నూతన విశాఖపట్టణం జిల్లా

**1936**లో ఒరిస్సారాష్ట్రమేర్పడకపూర్వం వుండిన గంజాం జిల్లాలోని, ఉత్తరభాగం ఒరిస్సా రాష్ట్రములో చేర్చడంచేత దక్షిణ భాగమును అనగా శ్రీకాకుళం తాలూకా, నరసన్నపేటతాలూకా, టెక్కలి తాలూకా, యిచ్ఛాపురం తాలూకా, పాతపట్నం తాలూకాలను చేరను పర్లాకిమిడి తాలూకాలోని భాగమును విశాఖపట్టణం జిల్లాలో చేర్చడమైనది. అందుచేత ఆంధ్రదేశమందున్న జిల్లాలన్నిటిలోను, విశాఖపట్టణం జిల్లా చాల పెద్దది. 17,186 చ॥ మైళ్ళ విస్తీర్ణము, 38 లక్షల జనసంఖ్య గలది, ఈ జిల్లాచరిత్ర, చాలకాలము, కళింగదేశపు చరిత్రలో, ఒక భాగముగ పరిగణించవలసి యున్నది. కళింగదేశము, ప్రాచీనకాలములో 4 భాగములుగా ఏర్పడియుండెను. ఉత్తర కళింగము, మధ్య కళింగము, దక్షిణ కళింగము. ఉత్తర కళింగము, చిలుక సముద్రమునకు ఉత్తరమున వ్యాపించియుండెను. దానికే ఉత్కళింగమని పేరు. అందుండిన ఓఢ్రులు ఉత్కళులని పేరు వచ్చుటకు ఉత్కళింగమను పేరే కారణము. మధ్య కళింగము చిలుక సముద్రమునుండి, యెల్లమంచిలి వరకు వ్యాపించినది. అందు నివశించినవారు ఎక్కువగా కాళింగులు, కాపులు మొదలైనవారు కళింగ దేశమును, అశోకుడు జయించినతర్వాత కళింగదేశములో బౌద్ధమతము కొంతవరకు వ్యాపించెను. అశోకునితర్వాత మౌర్యవంశమంతరించినతోడనే, కళింగ రాజ్యము స్వతంత్ర రాజ్యమైనది. క్రీ॥ పూ॥ 160 లో ఖారవేలుఉ కళింగ రాజ్యాధిపతులు. క్రీ॥ శ॥ 275లో సింహళ ద్వీప రాజైన మహేశుడు, కళింగరాజునుండి బుద్ధుని దంత మొకటి సంపాదించి, కొండీపట్టణమున బౌద్ధాలయము నందు భద్రపరచెను.

దక్షిణ కళింగమందు, అనగా, ఎల్లమంచిలినుండి, రాజమహేంద్రవరమువరకు వ్యాపించియుండిన భాగములోను, దానికి దక్షిణమున ఒంగోలు వరకు వ్యాపించిన దేశములో శాతవాహనాంధ్రుల సామ్రాజ్యము విస్తరించి యుండెనుగాని, విశాఖపట్టణం జిల్లాలో మాత్రము క్రీ॥ శ॥ మూడవ శతాబ్దములో కళింగ రాజులే బలము గల్గియుండిరి. ఆ పిమ్మట, కడపటి శాతవాహనుడు, పిమ్మట యిక్ష్వాకులు, ఆపిమ్మట విష్ణుకుండినులు, విశాఖపట్టణం జిల్లాలో రాజ్యములేర్పరచుకొని, వుండిరని చెప్పవచ్చును.

క్రీ॥ శ॥ 326 మొదలు 375 వరకు, గుప్తసామ్రాజ్యము నేలిన, సముద్రగుప్తుడు దక్షిణదేశమందు దండయాత్ర చేసినప్పుడు కళింగదేశములో నాల్గురాజ్యములుండెను. గిరికోత్తూరు (మహేంద్రగిరి దగ్గరనున్న కొత్తూరు కాబోలు) స్వామిదత్తుడును, ఏరండపల్లెను (అనగా అముదాలవస) దమనుడును దేవరాష్ట్రము (విశాఖపట్టణమునకు చేరువగానున్నది గాబోలు) కుబేరుడును, పిష్టపురమున (అనగా పిఠాపురమున) మహేంద్రుడును, ఆయా ప్రాంతములందు రాజ్యమేలుచుండిరి.

వీరేవంశపు వారైనది తెలియదు. వీరు స్వతంత్ర రాజులో, లేక వేంగీపుర మహారాజైన సాలంకాయన వంశ హస్తివర్మునికి కప్పము చెల్లించుచు, మండలాధిపతులుగావుండినవారో తెలియదు.

వెంగిరాజ్యమును పరిపాలించిన సాలంకాయనులు, పిష్టపురమునకు దండెత్తివచ్చినతర్వాత, పిష్టపురమున రాజ్యముచేయుచుండిన మాఠరవంశ రాజులు, పిష్టపురమును(పిఠాపురమును) విడచి, విజయసింహపురమునకు తమరాజధానిని మార్చుకొనిరి. ఈ పురము, శ్రీకాకుళమునకు చేరువనున్న సింగపురం గావచ్చు. మరికొద్ది సంవత్సరములకు, విష్ణుకుండినులు, దక్షిణ దేశమందు ప్రబలి, సాలంకాయనుల, బలము అణచివేయుటచేత మాఠరరాజులరాజ్యము మరల పిష్టపురంవరకును వ్యాపించినది. గాని అట్టేకాలము నిలువలేదు. విష్ణుకుండినుల నాణెములు సింహముఖ చిహ్నములుగలవి. విశాఖపట్టణం జిల్లాలో దొరికినవి. పిమ్మట 200 సం॥ కాలము, ఈ జిల్లాచరిత్ర, తెలుసుకొనుటకు ఆధారములు తక్కువ. తూర్పుగాంగ వంశమునందలి, మొదటి వంశపు రాజుల శాసనములు, విశాఖపట్టణం జిల్లాలోను, టెక్కలి మొదలుకొని, చీపురుపల్లివరకునుగల గ్రామాలలో పెక్కుచోట్ల దొరికినవి. ఈ శాసనములబట్టి, కొందరి రాజులపేర్లు, వారి దానములు, కొన్ని గ్రామాల పేర్లు మాత్రమే తెలియదగును గాని, తక్కినచారిత్రిక విశేషములు అంతగా తెలియవు.

ఆ పిమ్మట క్రీ॥ శ॥ 720 నుండి, 1456 వరకును రెండవ గాంగవంశపురాజులు కామార్ణవుని సంతతివారు, మధ్య కళింగదేశమును, పరిపాలించిరి. ఈ రాజులకు, శ్రీకాకుళం చేరువనున్న, ముఖలింగనగరము రాజధాని; నగరికటకము సైనికస్థలము; కళింగపట్టణము, ఓడరేవు,

ఈ గంగవంశపు రాజులలో ఎక్కువ ప్రసిద్ధి చెందినవారు అనంతవర్మచోడ గంగదేవు. ఇతడు గంగవంశపు రాజరాజునకును, చోడవంశపు రాజేంద్రచోడుని కుమార్తె యైన రాజసుందరికిని, పుట్టినవాడు. క్రీ॥ శ॥ 1075 నుండి సుమారు 1142 వరకును కళింగదేశమందలి మధ్యభాగమును కొంతవరకు దక్షిణభాగమును పరిపాలించెను. 1130—1186 లో ఈ అనంతవర్మ చోడగంగదేవు ఉత్కళరాజ్యమును జయించి కటకపురిని రాజధానిగా చేసుకొనెను. అంతవరకును రాజధాని నగరముగా నుండిన ముఖలింగ నగరమందు అతని కుమారుడు మండలాధిపతిగా రాజ్యమేలుటకు ప్రారంభించెను. 1136 నుండి 1430 వరకు గంగవంశపురాజులు కటకపురిలో సామ్రాజ్యమేలుచుండిరి. ఆ రాజుల కుమారులు ముఖలింగ నగరమున మండలాధిపతులుగ మధ్యదక్షిణ కళింగములను పరిపాలించుచుండిరి.

1430 లో గంగవంశము అంతరించి సూర్యవంశపు కపిలేంద్ర రాజవంశము కళింగరాజ్యము నేలుటకు మొదలుపెట్టెను. అయినను గంగవంశపు రాజులలో కడపటి రాజులందు రెండవ భానుదేవుని కుమారుడు గంజాం జిల్లాలోని కిమిడి దేశమునకు రాజులై ఆ రాజ్యమును మూడుభాగములుగా పంచుకొని ఎవరిభాగము వారు పాలించుటకు ప్రారంభించిరి. దానివలన పెద్దకిమిడి, చిన్నకిమిడి, పర్లాకిమిడి రాజ్యములు పుట్టినవి. వీటిలో మొదటి రెండును ఇప్పుడు క్రొత్తగా ఏర్పడిన ఒరిస్సా రాష్ట్రమందలి గంజాంజిల్లాలో నున్నవి. పర్లాకిమిడి రాజ్యమందు ఒక మూడవభాగము (పర్లాకిమిడి పట్టణము, రెండువందల గ్రామములు) మాత్రమే ఒరిస్సా రాష్ట్రములో చేరినవి. కడమ రెండు భాగములున్ను చెన్నపురి రాష్ట్రమందే నిలిచియున్నవి.

కపిలేంద్ర దేవునితో 1430 లో ప్రారంభమయిన సూర్యవంశపు రాజ్యము దక్షిణదేశమున ఎక్కువగా వ్యాపించినది. కపిలేంద్రుడు, అతని కొడుకు పురుషోత్తముడు, పురుషోత్తముని కొడుకు ప్రతాపరుద్ర గజపతి క్రమక్రమముగా నెల్లూరుజిల్లాలోని ఉదయగిరివరకును తమ అధికారమును వ్యాపింప చేసికొనిరి. కిమిడిరాజులు వారికి లోబడి కప్పము చెల్లించుచు తమరాజ్యము తాము ఏలుకొనుచుండిరి.

1520 లో కృష్ణదేవరాయలు పొట్నూరువద్ద ప్రతాపరుద్రుని ఓడించి సింహాచలమువరకును తన అధికారమును బలపరచుకొనుటచేత విశాఖపట్టణముజిల్లాలో దక్షిణభాగము ఉత్కళరాజుల వశము తప్పినది.

1565 లో తల్లికోట యుద్ధమున విజయనగర రాజులు పూర్తిగా ఓడిపోవుటచేత విజయనగర సామ్రాజ్య మంతరించెను. ఆ తరువాత 1575 మొదలుకొని 1687 వరకు గోల్కొండ నవాబుల అధికారము గంజాం, విశాఖపట్టణము జిల్లాలలో వ్యాపించినది. పిమ్మట ఔరంగజేబు మొగల్ పాదుషా దక్కనుదేశమును జయించి 1687 లో దక్కనుసుభా ఏర్పడుట జరిగినది. మరి కొద్దికాలమునకే హైదరాబాదు నైజాము స్వతంత్రాధికారము పొంది ఉత్తరసర్కారులు ఏలుతు శ్రీకాకుళమువద్ద ఒక మండలాధిపతిని నిలిపి గంజాం విశాఖపట్టణము జిల్లాలనుండి కప్పము రాబట్టుకొనుచుండెను. ఈ మండలాధిపతులలో ఒక నవాబు ఇచ్ఛాపురమునందును, మరియొక నవాబు శ్రీకాకుళమువద్దను మండలాధిపత్యము వహించి యుండిరి. పర్లాకిమిడి రాజులు శ్రీకాకుళము సర్కారుకు కప్పము చెల్లిస్తూ తమరాజ్యము తాము ఏలుకొనుచుండిరి. 1753 లో నైజాము ఫ్రెంచివారికి ఉత్తర సర్కారులను యిచ్చివేయుటచేత ఫ్రెంచివారి బుస్సీ విజయనగరము రాజైన విజయరామరాజును శ్రీకాకుళము సర్కారుకు మేనేజరుగా నియమించెను.

1756 వరకు శిస్తువసూళ్ళు సరిగా కాకపోవుటవల్ల బుస్సీదొర స్వయముగా విశాఖపట్టణముజిల్లాకు దండులో వచ్చెను. ఆ కాలములోని విజయనగరం బొబ్బిలి రాజులకు వైరము ఎక్కువగా వుంటచేతను, బొబ్బిలి రాజు పైకము చెల్లించుటమాని ఫ్రెంచివారి అధికారమును ఎదిరించినట్లు వినుటచేతను విజయ రామరాజు సాయముతో బుస్సీదొర బొబ్బిలికోట ముట్టడించెను. బొబ్బిలివారు తీవ్రముగా యుద్ధముచేసిరి. కంఠములో ప్రాణమున్నంతవరకును తమ కోటశత్రువులకు వశముకాకుండ పోరాడిరి. తుదకు బొబ్బిలి వీరులందరును మరణించిరి. స్త్రీలు సహగమనముచేసిరి. నిర్జనమైన బొబ్బిలికోట నాశనమై బుస్సీకి వశమైనది. దీనికి ముఖ్యకారకుడైన విజయ రామరాజు సైతము బొబ్బిలి వారి పాపారావుచే హతుడై మరణించెను. బొబ్బిలివారందరు చచ్చినను బాలుడుగా నుండిన బొబ్బిలిరాజకుమారుడు సురక్షితుడై యుండుటచేత అతనిని బుస్సీదొర బొబ్బిలి పాలకునిగ పరిగణించి బొబ్బిలి రాజ్యమును పునరుద్ధరింప చేసెను. 1758 లో బుస్సీ గంజాం జిల్లా విడిచిపెట్టి హైదరాబాదుకు పోయెను. విజయ రామరాజు కుమారుడైన ఆనందరాజు ఫ్రెంచివారి మైత్రి విడిచి వారికి విరోధులైన ఆంగ్లేయులతో కలిసి కుట్రలు

పన్ని ఆంగ్లేయులను ఆహ్వానించుటచేత ఆంగ్లేయ వీరుడైన కర్నల్ ఫోర్డ్ విశాఖపట్నం జిల్లాకు దండెత్తి వచ్చెను. అతడు త్రోవలో పిఠాపురమునకు చేరువగానున్న గొల్లప్రోలులో ఫ్రెంచివారిని ఓడించెను. విజయనగరమువరకును గల ప్రదేశము ఆంగ్లేయుల అధికారమునకు లోబడునట్లు చేసెను. 1759 లో ఫ్రెంచివారి అధికారము ఇండియాలో పడిపోయినతర్వాత నైజాము ప్రభువు సలాబత్ జంగ్ ఆంగ్లేయులకు గుంటూరు తప్ప తక్కిన ఉత్తర సర్కారులన్నిటిని ఇచ్చి వేసెను. ఇందుకు 1762 లో మొగల్ ప్రభుత్వమువారును సమ్మతించిరి. 1766 నాటికి ఉత్తర సర్కారులలో ఆంగ్లేయుల ప్రభుత్వము ప్రారంభమైనది. 1767 లో చెన్నపురియందు నెలకొన్న ఆంగ్లేయ ప్రభుత్వమువారు కాట్స్ ఫర్డ్ దొరను విశాఖపట్టణము గంజాం జిల్లాలకు అధికారిగా నియమించి పంపిరి. ఇతని అధికారమును విజయనగరమువారు మన్నించిరిగాని పర్లాకిమిడి రాజు నారాయణదేవ్ మన్నించక ఆంగ్లేయులను ఎదిరించెను. అప్పుడు 1768 లో టిలారు స్టేషనుకు చేరువగానున్న జలుమూరు గ్రామమువద్ద అతనికిని ఆంగ్లేయులకును యుద్ధమాయెనది. నారాయణదేవ్ ఓడి పారిపోయెను. ఈ యుద్ధములో ఆంగ్లేయులకు విజయము కలిగినను 1800 వరకు పర్లాకిమిడి రాజులు ఆంగ్లేయుల అధికారమునకు లోబడక ఎదుర్కొనుచునే వుండిరి. 1802 నాటికి ఉత్తర సర్కారులలో తక్కిన భాగములతోపాటు గంజాం, విశాఖపట్టణం జిల్లాలు సైతము ఇంగ్లీషు ప్రభుత్వంలోనికి వచ్చినవి. 1802 లో పర్మినెంట్ రెవిన్యూ సెటిల్ మెంటు చట్టము ననుసరించి ఉత్తర సర్కారులలో జమీందారీలు ఏర్పడినవి. స్వతంత్ర రాజులందరును జమీందారులైనారు.

తూర్పుగోదావరిజిల్లా :

ఈ జిల్లాచరిత్ర క్రీ. శ. 500 వరకును ఇంచుమించుగా విశాఖపట్టణంజిల్లా చరిత్రలో సూచించినట్లే సాగినది. విష్ణుకుండినుల అధికారము పోయినతర్వాత పల్లవులు ఈ జిల్లాలో సైతము తమ అధికారము కొంతమేర వ్యాపింపచేసుకొని యుండవచ్చును.

1615 లో చాళుక్య రాజులు వేంగిదేశమును జయించిరి. రెండవపులకేశి వేంగీనగరమున (ఏలూరు సమీపమున) తన సోదరుడైన కుబ్జవిష్ణువర్ధనుని మండలాధిపతిగా నియమించెను. ఇతడు కొద్ది కాలములోనే స్వతంత్రుడై పులకేశి చనిపోయినతర్వాత వేంగిదేశమందు తూర్పు చాళుక్యరాజ్యము స్థాపించిన వాడయ్యెను. ఈ రాజ్యము శీఘ్రకాలములో విస్తరించి తూర్పుగోదావరి జిల్లాలో సైతము వ్యాపించినది. పదియవ శతాబ్దమున ఈ వంశపురాజులలో రాజమహేంద్రుడు తన రాజధాని వేంగీనగరమునుండి రాజమహేంద్రవరమునకు మార్చుకొనెను. ఈ రాజమహేంద్రుని పేరునుబట్టి రాజమహేంద్రవరమను పేరు వచ్చినది. 1022 మొదలు 1063 వరకును రాజ్యమేలిన రాజరాజనరేంద్రుని కాలమున ఈ నగరము మంచి ఉన్నత దశలో వుండెను.

అతని ఆస్థానకవి నన్నయభట్టు సంస్కృతమహాభారతమును ఆంధ్రీకరించుటకు పూనుకొని ఆది సభా పర్వములును, అరణ్యపర్వమునందలి కొంత భాగమును రచించెను.

గోదావరి, కృష్ణ, గుంటూరు జిల్లాలలో వ్యాపించి యుండిన చాళుక్య రాజులకున్నూ, దక్షిణ దేశమందు వ్యాపించి యుండిన చోళరాజ్యము రాజులకున్నూ సంబంధ బాంధవ్యము లుండెడివి. రాజరాజ నరేంద్రుని తల్లి రాజరాజ చోళుని కూతురు. ఆమె సోదరుడైన రాజేంద్ర చోళుని కూతురుని రాజరాజ నరేంద్రుడు పెండ్లియాడెను. పిమ్మట రాజరాజ నరేంద్రుని కుమారుడు రాజేంద్రచోళుడు, సైతము తన మేనమామ కుమార్తెను పెండ్లియాడెను. అంతేగాక అతడు తన మేనమామలకు పుత్రసంతానము లేనందున చోళరాజ్యమునకు సైతమురాజై కులోత్తుంగ చోళదేవు అను పేరను, తూర్పు చాళుక్య చోళరాజ్యముల రెంటికిని రాజాధిరాజయ్యెను. ఇతనికుమార్తెయైన రాజ సుందరిని కళింగ దేశపు గంగవంశపు రాజైన రాజరాజు పెండ్లియాడెను.

కులోత్తుంగ చోళదేవు చోళరాజ్యములోనే నివశించి సామ్రాజ్యము నేలుచుండుటచేత రాజమహేంద్రవరము ప్రసిద్ధి తగ్గినది.

చోళరాజ్యము క్షీణించిన తర్వాత వెలనాటి చోళ ప్రభుత్వము ఈజిల్లాలో కొంతకాలము ప్రబలియుండెను. ఈ ప్రభుత్వమునకు లోబడి హైహయ నాయకులు కోనసీమలో రాజ్యమేలుచుండిరి. నారెండ్ల నాయకులు ఏలూరులోను, అన్నలరెడ్డి మొదలైన రెడ్డినాయకులు రాజమహేంద్రవరం తాలూకాలో కోరుకొండవద్దను తమతమ రాజ్యములను ఏలుకొనుచుండిరి. 1800 లలో కాకతీయ ప్రతాపరుద్రుడు ఈ జిల్లాను జయించెను. 1325 నుండి 1395 వరకున్న కోరుకొండ రెడ్డిరాజులు

స్వతంత్రరాజులై ఇప్పటిరాజమహేంద్రవరముతాలూకా ఏలుచుండిరి. ఈరెడ్ల రాజులలో కోనరెడ్డి మొదటి వాడు. పిమ్మట ఇతని వంశస్తుడైన మున్మిడిరెడ్డి తుని వరకును తన రాజ్యమును విస్తరింప చేసికొనెను.

పిమ్మట 1422 మొదలు 1450 వరకును రాజమహేంద్రవరము కొండవీటిరెడ్ల అధికారమునకు లోబడి యుండెను. ఆరెడ్ల రాజులలో కుమారగిరి తనకుమరదియు మంత్రియు అయిన కాటయ వేమారెడ్డిని రాజమహేంద్రవరమున మండలాధిపతిగా నిల్పెను. 1422లో మరియొక రెడ్డివంశమునకు సంబంధించిన అల్లారెడ్డి రాజమహేంద్రవర రాజ్యమును జయించి తనరాజవంశమును స్థాపించెను. అతని శాసనములు పాలకొల్లు, పలివెల, ద్రాక్షారామములలో కలవు. వాటినిబట్టి చూడగా ఇతడు మొదట కాటయ వేమునికి విరుద్ధుడై ఒరిస్సా ప్రభువైన కపిలేంద్ర దేవుతోను ఆనాటి విజయనగర రాజులతోను కలిసి అల్ఫాఖాన్ అను మహమ్మదీయ వీరుని ఓడించినట్లును, పిమ్మట కొండవీటి రెడ్లను ఎదిరించి తుదకు రాజమహేంద్రవర రాజ్యమును జయించినట్లును, కనబడుతున్నది. 1458 మొదలు 1459 వరకును రాజమహేంద్రవరము ఒరిస్సా కపిలేశ్వరుని ప్రభుత్వమునకు రాజమహేంద్రవర రాజ్యము లోబడి యుండెను. 1471 లో భామినీ సుల్తానులు రాజమహేంద్రవరమును ముట్టడించి పట్టుకొనిరి. 1478 లో దీనిని విజయనగరమువారు పట్టుకొనిరి. 1479-80 లో కుతుబ్ జర్రా మహమ్మదీయులు మరల స్వాధీనపరచుకొనిరి. పిమ్మట ఇది ఒరిస్సా గజపతి యధికారమునకు లోబడినది. 1515 లో కృష్ణదేవరాయలు ప్రతాపరుద్ర గజపతిని పారద్రోలి రాజమహేంద్రవరమును స్వాధీన పరచుకొనెను. కృష్ణదేవరాయలు చనిపోయిన తర్వాత విజయనగర సామ్రాజ్యము క్షీణింపగానే ప్రతాపరుద్రుని తర్వాత ఒరిస్సారాజులు మరల ఈ జిల్లాలలో తమ అధికారమును వ్యాపింపచేసికొనిరి. 1545 లో విజయనగరమువారు ఒరిస్సా విద్యాధరరాజును రాజమహేంద్రవరమునుండి పారద్రోలిరి. తుదకు 1571 లో గోల్కొండ నవాబుల పాలనమునకు ఈ జిల్లా లోబడినది. తర్వాతి చరిత్ర విశాఖపట్టణము జిల్లా చరిత్రలో సూచించినట్లు సాగినది.

## పశ్చిమ గోదావరిజిల్లా :

ఈ జిల్లా 1918 లో ఏర్పడినది. అంతకు ముందున్నది కొంతకాలము గోదావరిజిల్లాలోను, కొంతకాలము కృష్ణాజిల్లాలో వుండుటచేత దీనిచరిత్ర ఆ రెండు జిల్లాలచరిత్రను అనుసరించియే వుండును. ఈ జిల్లాలో పెదవేంగి అను గ్రామము నేటికిని నిలిచియున్నది. ఇక్కడనే కుబ్జవిష్ణువర్ధనుడు తూర్పు చాళుక్యరాజ్యమును స్థాపించెను. తత్పూర్వము అనగా 275 మొదలుకొని 450 వరకును సాలంకాయనులు వేంగీపురమున రాజ్యము స్థాపించి పశ్చిమ గోదావరీ మండలమును పరిపాలించుచుండిరి. వీరు కట్టించిన సూర్యదేవాలయము ఇటీవల శిథిలమైనను నేటికిని నిలిచియున్నది. సాలంకాయనుల తర్వాత విష్ణుకుండినుడు ఈ వేంగిలోనే రాజ్యము స్థాపించి ఏలుచుండెను.

నరసాపురం ఏలూరికి ఆగ్నేయదిక్కున 43 మైళ్ళ దూరమున వున్నది. 1665లో ఇక్కడ ఇనుప కార్ఖానా పెట్టికొన్నారు. ఈ నరసాపురానికి ఉత్తరమునగల పండపోలం ఆంగ్లేయులు ఆక్రమించి 1677 లో ఒక కార్ఖానా స్థాపించినారు. అంతకుపూర్వమే ఫ్రెంచివారు కూడా ఒక కార్ఖానా పెట్టికొనియుండిరి.

## కృష్ణాజిల్లా :

తూర్పు గోదావరి, పశ్చిమ గోదావరి, కృష్ణ, జిల్లాలలో ప్రాచీనకాలమందు కొండలలోను, అడవులలోను ఆదిమనివాసులైన చెంచులు, కోయలు, యానాదులు, వుండేవారు. ఇప్పటికిని వీరి సంతతివారు కొండలకు చేరువనున్న పల్లెలలో నివసించియున్నారు. క్రీ॥ శ॥ రెండవ శతాబ్దమున ఆంధ్రులు తమ రాజ్యమును ఈ జిల్లాలో ఎక్కువగా వ్యాపింపచేసుకొని కృష్ణానదీతీరమునందు నగరములను నిర్మించుకొనిరి. వీరు బౌద్ధమతమును అవలంబించినవారు గనుక బౌద్ధస్తూపములు, చైత్యములు, ఆలయములు, పెక్కుచోట్ల వెలసినవి. నాల్గవశతాబ్దము నాటికి ఈ జిల్లా పల్లవరాజుల ప్రభుత్వమునకు లోబడినది. పిమ్మట సాలంకాయనులు, విష్ణుకుండినులు ఈ జిల్లాపైతము లోబరచుకొనిరి. ఏడవ శతాబ్దమునుండి పదకొండవ శతాబ్దమువరకును ఈ జిల్లా తూర్పు చాళుక్యరాజ్యమందును ఆ పిమ్మట 17 వ శతాబ్దమువరకు నెల నాటి చోళరాజ్యమందును ఒక భాగముగా వుండెను. అయినను కొన్ని సంవత్సరములు మాత్రము కాకతీయ ప్రభుత్వమునకు లోబడినది. 1328 నుండి 1424 వరకు కొండవీటి రెడ్ల పరిపాలనమునందుండెను. ఆ పిమ్మట కటకపుర ఒరిస్సారాజ్యము నేలుచుండిన కపిలేంద్రదేవు, పురుషోత్తమదేవు, ప్రతాపరుద్ర గజపతి మొదలైన రాజులు ఈ జిల్లాపైతము తమ యధికారమునకు లోబరచుకొనిరి. 1516 నాటికి కొండపల్లిలోనున్న దుర్గము ఒరిస్సా

రాజుల అధికారమం దుండిన ప్రదేశమునకు దక్షిణపు పొలిమేర దుర్గమైయుండెను. పిమ్మట కృష్ణదేవరాయలు ఒరిస్సా గజపతిని పారదోలిన తర్వాత తక్కిన తెనుగు జిల్లాలతోపాటు ఈ జిల్లాసైతము రాయలవారి అధికారమునకు లోబడియుండెను. ఆ తర్వాత చరిత్ర పైజిల్లాల చరిత్రను అనుసరించి సాగినది.

ఈ జిల్లాలో బాపట్ల ఆరుమైళ్లి దూరమునవున్న మోటుపల్లి చాలకాలము ప్రఖ్యాతిపొందిన ఓడరేవు. దీని ప్రాచీననామము మోసలాపురము. ఇది ఈ జిల్లా కాకతీయ రాజ్యములో చేరియున్నపుడు మంచి ఉన్నతదశలో వుండెను. కర్పూరము, ముత్యములు, పన్నీరు, దంతము, కస్తూరి, జవ్వాజీ,సుగంధద్రవ్యములు, మిరియములు,పట్టు, నూలు, రాగి, సత్తు మొదలైన సామగ్రి ఈ రేవులో మన దేశమునకు పై దేశములనుండి దిగుమతి యగుచుండెను. దీని వైభవమును మార్కోపోలో ఎక్కువగా శ్లాఘించెను.

## గుంటూరు జిల్లా :

గుంటూరుజిల్లా ఉత్తర సర్కారులలోనిది. నైజాము ప్రభుత్వములోనికి వచ్చిన తరువాత సర్కారు అను పేరు వచ్చినది. ఆ కాలంలో రాజమహేంద్రవరం సర్కారు, మచిలీపట్టణం సర్కారు, గుంటూరు సర్కారు అని మూడుసర్కారులు గల ప్రదేశము ఆంగ్లేయుల అధికారములోనికి వచ్చిన తర్వాత కొంతకాలము ఉత్తర సర్కారులన్న పేరుతోనే ఉండి 1859 గోదావరిజిల్లా, కృష్ణజిల్లా అనే రెండుజిల్లాలుగాను ఏర్పడెను. ఈకృష్ణా జిల్లాలోనే గుంటూరుజిల్లా చేరియుండెను. పిమ్మట గుంటూరుజిల్లా ప్రత్యేక జిల్లాగ ఏర్పరచినారు. అందుచేత గుంటూరుజిల్లా చరిత్ర, కృష్ణజిల్లా చరిత్ర ననుసరించి ఉండును. అయినను ఈ జిల్లాకు విశిష్టమైన చరిత్రాంశములు కొన్ని కలవు. ఈ జిల్లాలో ఆదిమనివాసులందు చెంచులు, ఎఱుకలు, మాత్రమే కాక నాగులుసైతము ఎక్కువగా వుండేవారు. నాగులేరు అను పేరు ఈ నాగులనుండే వచ్చినది. క్రీ॥ శ॥ మొదటి మూడుశతాబ్దముల కాలములోను ఆంధ్రులు తర్వాత 240 మొదలు 340 వరకు కొంత ప్రదేశమందు పల్లవులు, మరి కొంత ప్రదేశమందు ఇక్ష్వాకులు, స్వల్పకాలము బృహత్ పాదాయనులు, విష్ణుకుండినులు తమ ప్రభుత్వమును ఈ జిల్లాలో సైతము వ్యాపింప చేసుకొనిరి.

620 నుండి 1080 వరకు తూర్పు చాళుక్యులును, 1080 నుండి 1280 వరకు చోళులును పిమ్మట 1328 వరకు కాకతీయులును, తమ ప్రభుత్వము ఈ జిల్లాలో సైతము వ్యాపింప చేసికొనిరి. పిమ్మట ఈ జిల్లాలో కొండవీటి ప్రదేశమున రెడ్డిరాజ్య ముదయించిపైజిల్లాలకు సైతము వ్యాపించినది. 1428లో పోలయ వేమారెడ్డితో ప్రారంభమయిన రెడ్డిరాజ్యము 1424 నుండి 1425వరకు రాజ్యమేలిన రాచవేమారెడ్డి నాటివరకు ప్రబలియుండెను. ఈ కొండవీటి రెడ్డిరాజులలో అనేకులు విద్యను, కవిత్వమును, కళలను పోషించినారు. అందులో కొందరికి ఆంధ్ర సంస్కృత భాషలందు గొప్పపాండిత్యము కూడా ఉండేది. 1382 మొదలు 1395 వరకు రాజ్యమేలిన కుమారరెడ్డికి సంస్కృతభాషా పాండిత్యము ఎక్కువగా నుండెను. అతని మరది కాటయ వేమారెడ్డి, కాళిదాసు మహాకవి రచించిన నాటకముల మూడింటికని కుమారగిరిరాజీయమను పేర వ్యాఖ్య రచించెను. పెదకోమటి వేమారెడ్డికి సంస్కృతభాషా పాండిత్యము సుప్రసిద్ధ మగుటచేత సర్వజ్ఞ చక్రవర్తి అనే బిరుదము పండితులు ఇచ్చియుండిరి. ఇతడు అనేక గ్రంథములు రచించెను. అందులో అమరు శతకమునకు వ్యాఖ్యయైన శృంగార దీపిక సాహిత్య చింతామణి ముఖ్యమైనది. గద్యకవి సార్వభౌముడు అనే బిరుదము వహించిన వామనభట్ట బాణకవి అతని ఆస్థానమున విద్వాంసులుగా నుండి వేమభూపాల చరిత్ర మొదలైన గ్రంథములను రచించెను. ఈ పెదకోమటి వేమారెడ్డి ఆస్థానమునందే విద్యాధికారిగాను కవీశ్వరుడుగాను ఉండిన శ్రీనాధుడు తెలుగు ప్రబంధములుగాక సంస్కృత భాషలో సైతము ఉత్కృష్టములైన గ్రంథములను రచించెను.

1360 మొదలు 1482 వరకు వాయువ్య దిక్కునుండి గోల్కొండ నవాబులున్ను ఈశాన్యమునుండి ఒరిస్సా రాజులున్ను ఈజిల్లాకు దండెత్తి వచ్చుచుండిరి. 1576 లో విజయనగరపు కృష్ణదేవరాయలు కొండవీటి రాజ్యమును జయించెను. పిమ్మట నల్లకొండ కొండవీటి దుర్గములు 1536 సరికి గోల్కొండ కుతుబ్‌షాకు లోబడినవి. ఆ పిమ్మట విజయనగర సామ్రాజ్యము అంతరించిన తర్వాత ఈజిల్లా సైతము గోల్కొండ నవాబుకు లోబడి తర్వాత మొగలు సామ్రాజ్యములోచేరి ఆ తర్వాత ఫ్రెంచివారి అధికారము లోనికివచ్చి తుదకు 1770 సరికి ఆంగ్లేయుల పరిపాలనలోనికి వచ్చినది.

ఈజిల్లాలో చరిత్ర విషయమున ప్రసిద్ధిపొందిన స్థలములు కొన్నిగలవు.

అమరావతి:—ఇది గుంటూరునగరమునకుఉత్తరమున సత్తెనపల్లి తాలూకాలో ఇరవైమైళ్ళ దూరాన కృష్ణానది ఒడ్డున వున్నది. ఆంధ్ర రాజ్యము ఈ ప్రదేశమున విస్తరించియున్న కాలములో అనగా క్రీ॥ శ॥ రెండవ శతాబ్దమందు అమరావతి గొప్ప పట్టణమైయుండెను. ఆ కాలమున బౌద్ధులైన ఆంధ్రులు నిర్మించిన పెద్దపెద్ద కట్టడములలో కొన్ని నేటికిని కనబడుచున్నవి. అప్పటి బౌద్ధస్తూపములలో ఇక్కడ కట్టించిన స్తూపము కడు పెద్దది.

ధరణికోట —అమరావతికి సమీపమునందే పడమటి వైపున ఉన్నది. పూర్వకాలములో ఇది ధాన్యకటకమను పేరను ఆంధ్రరాజులకు రాజధాని నగరమైయుండెను.

పల్నాడను అనే పేరుగల తాలూకాలో పల్నాటి వీరచరిత్రకు సంబంధించిన గురజాల, మాచెర్ల, కారంపూడి మొదలైన గ్రామములు కలవు.

ఉండవల్లిలో ప్రాచీనకాలపు బౌద్ధవిగ్రహములును అక్కడి కొండలలో గుహలున్ను కలవు.

నెల్లూరు జిల్లా :

తక్కిన జిల్లాలలోవలెనే ఈ జిల్లాలో సైతము ఆదిమనివాసులైన ఎరుకలు, చెంచులు కలరు. వీరేకాక ఈ జిల్లాలో యానాదులు అత్యధికముగా ఉన్నారు. ఈ జిల్లా ప్రాచీన చరిత్ర విషయములు కాల నిర్ణయముచేసి చెప్పుటకుతగిన ఆధారములులేవు. గాని, తెలిసినంతమటుకు ప్రాచీన పల్లవరాజ్యము క్రీ॥ శ॥ 220 మొదలు 340 వరకు ఈ జిల్లాలో సైతము కొంతవరకు వ్యాపించినదని చెప్పవచ్చును. పిమ్మట ఆంధ్ర చోళరాజులు ఈ ప్రదేశమును స్వాధీనము చేసుకొనిరి. అప్పుడీ ప్రదేశమునకు పాకనాడని పేరు. పదకొండవ శతాబ్దములో చోళరాజులకు కప్పము చెల్లించుతూ నెల్లూరు జిల్లాలో రాజ్యమేలుచుండిన ముకుంటిరాజు తన దేశమునకు దండెత్తివచ్చిన చాళుక్యులను పారదోలెను. పదమూడవ శతాబ్దములో నెల్లూరు జిల్లాయందలి దక్షిణభాగమున సూర్యవంశపు రాజైన మనుమసిద్ధి రాజ్యమేలుచుండెను. అతని ఆస్థానములో తిక్కన సోమయాజి మంత్రిగానుండెను. ఇతడు 1190 మొదలు 1256 వరకు కాకతీయరాజ్యము నేలిన గణపతి రాజునకు సమకాలికుడు. మనుమసిద్ధిని,మనుమసిద్ధి జ్ఞాతులైన అక్కన, బయ్యనలు రాజ్యమునుండి తొలగించినపుడు తిక్కన సోమయాజి ఓరుగంటికి రాయబారిగాపోయి తన ప్రభువును మరల రాజపదవియందుంచుటకుతగిన సహాయము చేయవలసినదని గణపతి రాజును వేడుకొనెను. అతనికోరిక ప్రకారము గణపతిరాజు పెద్దసైన్యముతో వెడలి అక్కన, బయ్యనలను పారదోలి మనుమసిద్ధికి మరల రాజ్యము లభించునటుల తోడ్పడెను. అట్లుచేయుటవల్ల కాకతీయుల యధికారము నెల్లూరిజిల్లాపై సైతము చెల్లుటకు ప్రారంభమయినది.

ఢిల్లీ సుల్తానుల దండయాత్రలవలన కాకతీయ సామ్రాజ్యము నశించినతర్వాత గుంటూరు జిల్లాలో కొండవీటి సీమరెడ్ల రాజ్యము 1328 మొదలు 1427 వరకును ప్రబలియుండెనుగదా! ఆ రెడ్డిరాజుల అధికారమునకు నెల్లూరు జిల్లాలో చాలా భాగము లోబడినది. అంతకుపూర్వమే రేచెర్ల చెవిరెడ్డిన్ని అతని వంశమువారున్ను వెంకటగిరిలో రాజ్యమేర్పరచుకొనిరి. చెవిరెడ్డి రాజ్యమేర్పడుటకున్ను ఆ చెవిరెడ్డికి రేచెర్ల అనే పేరు కలుగుటకున్ను ఒక కథ చెప్పుదురు. అనుమగల్లు అనే గ్రామంలో ఒక రైతు భూమి దున్నుతుండగా ఒకచోట తొమ్మిది లక్షల రూపాయల విలువగల నిక్షేపమున్ను ఒక రాగి పట్టాశాసనమున్ను దొరికినవి. ఇవి ఎవరికి దొరుకునో వారు నరబలిఇచ్చి ఆధనము వాడుకోవలెననిన్ని అట్లు చేసినవారు సంపన్నులు కాగలరనిన్ని ఆ శాసనములోవున్నది. అప్పుడు ఆ రైతువద్దనున్న సేవకుడు రేచెర్ల అనేవాడు రెండు షరతులకు చెవిరెడ్డి ఒడబడినయెడల తానే బలియగుటకు ఒడబడుదునని చెప్పెను. చెవిరెడ్డిన్ని అతని సంతతివారున్ను రేచెర్ల అనే పేరు తమ యింటిపేరుగా పెట్టుకోవలెననిన్ని రెడ్డి సంతతివారు తమ యింట పెండ్లికార్యము తలపెట్టినపుడు రేచెర్ల కులమువారిలో ఒకరికి పెండ్లిచేయకుండా తమ యింటి పెండ్లిపని జరిపింపకూడదనిన్ని ఆ సేవకుడు తన కోరికలను తెలియచేసెను. చెవిరెడ్డి అందుకు సమ్మతించుటచేత రేచెర్ల బలియయ్యెను.

ఒరిస్సా ప్రతాపరుద్ర గజపతి 16వ శతాబ్దము ప్రారంభించుసరికి ఉదయగిరివరకును తన రాజ్యాధికారమును వ్యాపింపచేసికొనెను. ఆ పిమ్మట కొద్దికాలమునకే విజయనగరపు కృష్ణదేవరాయలు ప్రతాపుని ఉదయగిరి

కోట ముట్టడించి అతని సేనలను పారదోలెను. అప్పటి నుండిన్ని కొంతకాలము ఈ జిల్లా విజయనగరమువారి అధికారమునకు లోబడియుండెను. తల్లికోటయుద్ధములో విజయనగరమువారు పూర్తిగా ఓడిపోవుటచేత ఈ జిల్లా సైతము గోల్కొండ నవాబు వశమైనది. పిమ్మటి వృత్తాంతము గుంటూరు జిల్లా చరిత్ర ననుసరించియే సాగినది.

కడపజిల్లా :

పల్లవులనాటివరకును ఈ జిల్లా చరిత్రమనకంతగా తెలియదు. క్రీ॥ శ॥ 225 మొదలు 630 వరకు పల్లవులు రాయలసీమ జిల్లాలలోను, చిత్తూరు, చెంగల్పట్టు, నెల్లూరు, గుంటూరు జిల్లాలలోను ప్రబలి ఉండిరి. మొదట అదోని, తర్వాత కంచి, ఈ రాజ్యమునకు రాజధాని. తర్వాత వింధ్యపర్వతములకు దక్షిణమున వ్యాపించిన చాళుక్య రాజ్యము కడపజిల్లాకు సైతము వ్యాపించినది. అందుచేత ఈ జిల్లాలో తరుచుగా యుద్ధములు పల్లవులకును, చాళుక్యులకును జరుగుచుండెను. ఆ యుద్ధములలో ఒక పెద్ద యుద్ధము జమ్మలమడుగు తాలూకాలో పెద్ద ముడియమువద్ద చాళుక్య విజయాదిత్యునకును, త్రిలోచనపల్లవునకును జరిగెను. ఆ యుద్ధములో చాళుక్యులకు విజయము కలిగినను కడపజిల్లా చాళుక్యులవశము కాలేదు.

పల్లవులతర్వాత కడపజిల్లా చోడరాజ్యములో నొకభాగమై యుండెను. 7 వ శతాబ్దములో కడప, కర్నూలు, అనంతపురం జిల్లాలలో పెక్కుభాగములు చోళరాజ్యములో చేరియున్నట్లు హ్యూన్ త్సాంగ్ చెప్పియున్నాడు. 9 వ శతాబ్దము అంతమైన సరికి కడపజిల్లా అంతా కాకపోయినా అందులో ఉత్తరభాగము బాణవంశరాజుల పరిపాలనములో నుండెను. పిమ్మట రాష్ట్రకూట రాజ్యమేలుచుండిన రాజులలో మూడవ కృష్ణరాజుకాలములో అనగా క్రీ॥ శ॥ 940 నుండి 956 వరకు కడపజిల్లాలో తూర్పుభాగము తప్ప తక్కిన జిల్లా అంత రాష్ట్రకూటరాజుల పరిపాలనలోనికి వచ్చినది. 12 వ శతాబ్దములో ఈ జిల్లా మరల చోళులవశమైనది. అప్పుడు నెల్లూరు, కడప, కర్నూలు జిల్లాలు గల చోళరాజ్య భాగము నేలుచుండిన చోళరాజులకు తెలుగు చోళులని పేరు. అందులో పడమటనున్న కడప, కర్నూలు జిల్లాలకు మేల్ (ఎగువ) పాకనాడు, నెల్లూరు జిల్లాకు పాకనాడు; తూర్పు తీరప్రదేశమునకు కీల్పాకనాడు అని ఆనాటి పేర్లు. పిమ్మట 13 వ శతాబ్దములో కాకతీయులు కడప జిల్లాలో ప్రవేశించి పడమటి భాగము కొంత, మధ్యభాగము కొంత స్వాధీనపరచుకొనిరి. మరి కొంతకాలమునకు హొయిసలారాజులు రాయచోటి తాలూకా తప్ప తక్కిన జిల్లా అంత శమ పలుకుబడిలోనికి తెచ్చుకొనిరి. కాని మరికొద్దికాలమునకే మాలిక్కాఫర్ దక్షిణ దండయాత్రలవలన దక్షిణదేశ మందలి చాలాప్రదేశములతోపాటు కడపజిల్లా సైతము మహమ్మదీయుల వశమైనది. 14 వ శతాబ్దములో విజయనగరరాజ్యము కలిసినతర్వాత 1646 వరకున్ను కడప జిల్లా రాయలసీమలో చేరి యుండెను.

విజయనగర సామ్రాజ్య చక్రవర్తులలో కృష్ణదేవారాయలు చనిపోయినతర్వాత కడప జిల్లాలో సదాశివరాయులబావలు రామరాజు తిరుమలరాజు సర్వాధికారులై పరిపాలనము సాగించిరి. 1565 లో తల్లికోట యుద్ధమున హిందువులు పూర్తిగా ఓడిపోయినతర్వాత తిరుమలరాజు పెనుగొండ రాజధానిగా చేసుకొని కడప నేలుచుండెను. 1576-1577 లో మహమ్మదీయులు పెనుగొండ సైతము పట్టుకోగా తిరుమల రాయలకొడుకు రంగ చంద్రగిరి పారిపోయి నివసించెను. 1646 వరకున్ను కడపజిల్లా ఈ రంగని సంతతివారి ఏలుబడిలోనే ఉండినది. బీజాపురము, గోల్కొండ నవాబులు తక్కిన రాయలసీమ జిల్లాలను తీసుకొనిరిగాని కడపజిల్లా మాత్రము రాయల సంతతివారి పరిపాలనములోనే ఉండినది. 1646 లో కడప సైతము గోల్కొండ నవాబులకు వశమైనది. 1687 లో మొగల్ పాదుషా ఔరంగజేబు గోల్కొండ రాజ్యాన్నే జయించడంచేత కడపజిల్లా మొగల్ సామ్రాజ్యములో చేరిపోయెను. అయినను స్థానిక పరిపాలకులు సర్వాధికారముతో కప్పము చెల్లిస్తూ అక్కడ ప్రజలపై అధికారము చెలాయించుతుండేవారు. అట్టివారికి పాలిగార్లు అని పేరు. ఆ పాలిగార్లలో మట్లవాళ్లు ముఖ్యులు. కాకుస్థవిజయమనే తెలుగు ప్రబంధమును రచించిన మట్ల అనంతభూపాలుడు ఈ మట్లసంతతికి చెందినవాడే. 1775 మొదలు 1779 వరకు హైదర్, టిప్పు సుల్తానులు కడపజిల్లా సైతము జయించి స్వాధీనపరచుకొనిరిగాని నైజాము అధికారము ఇక్కడకూడా ప్రబలినది. 1792 మొదలుకొని 1799 వరకు టిప్పుసుల్తానుతో ఆంగ్లేయులు చేసుకొన్న ఒడంబడికలప్రకారము టిప్పుసుల్తాను నైజాము వారికి రాయలసీమజిల్లా లన్నిన్ని

ఇచ్చుకోవలసివచ్చినది. ఆ సమయంలో రాయలసీమ జిల్లాలు నైజాము వారికి ఇప్పించకుండా ఆంగ్లేయులు తామే తీసుకొని ఉందురు. అందుకు తగిన సమర్థత వారికి లేకపోలేదు గాని, నైజాము మైత్రికోరి వారాపని చేయలేదు. అప్పుడు ఆంగ్లేయులకును, నైజామువారికిని కలిగిన మైత్రి నిబంధనల ప్రకారము వుభయులకును కావలశిన సైన్యము నిలబెట్టుకొనుటకుగాను సిబ్బంది ఖర్చులకోసం నైజామువారు ఆంగ్లేయులకు కొంతధనము చెల్లింపవలసియుండెను. అది నైజామువారు చెల్లించలేక రాయలసీమ జిల్లాలను 1801 లో ఇచ్చివేసి వాటిపై వచ్చేశిస్తు సిబ్బందిఖర్చులకోసము ఆంగ్లేయులు ఉపయోగించుకొనవచ్చునని చెప్పిరి. ఆ విధముగా నైజాము వారు ఆంగ్లేయులకు యిచ్చిన మండలము గనుక ఈ రాయలసీమ జిల్లాలకు దత్తమండలము జిల్లాలు అను పేరు వచ్చినది.

## కర్నూలు జిల్లా :

ఈ జిల్లాలో చెంచులు, కిరాతులు, మొదలైన ఆదిమ నివాసులు ఎక్కువగా వుండేవారు. పాండవ వంశపు ఉత్తుంగభోజుని కుమారుడైన నందన చక్రవర్తి ఇక్కడ ఒక రాజ్యము స్థాపించినాడని అతడే ఉత్తరదేశమునుండి 500 బ్రాహ్మణుల కుటుంబముల తెప్పించి వారికి నందవరం అనే అగ్రహారమిచ్చినాడని ప్రతీతి. నందనగుళ్లు అనే గ్రామము నంద్యాల పొలిమేర బంగనపల్లి రాజ్యములోవున్నది. ఈ ప్రాంతమందు నందవరీకులు అనే బ్రాహ్మణులు, నేటికిని ఎక్కువగావున్నారు. వీరికి చౌడేశ్వరీ కులదేవత.

ఆనోని రాజధానిగా వెలసిన పల్లవరాజ్యములో ఈ జిల్లా సైతము చేరియుండెను. తర్వాత కడపజిల్లావలెనే ఇది చాళుక్య రాజ్యములో చేరినది. చోళులకున్ను చాళుక్యులకున్ను యుద్ధములు ఇక్కడను జరిగినవి. 1120 నాటికి కర్నూలు జిల్లాలో ఎర్రమల కొండలకు తూర్పునగల పెద్దభాగము చోళులున్ను పడమటగల చిన్నభాగము యాదవులున్ను వశపరచుకొనిరి. 13 వ శతాబ్దము ఆరంభించిన కొద్దికాలమునకు కాకతీయ గణపతి నెల్లూరివరకు దండెత్తివచ్చి నెల్లూరితోపాటు కర్నూలు జిల్లాకూడా జయించెను. మార్కాపురం తాలూకాలోవున్న త్రిపురాంతక గ్రామంలో ఈ కాకతీయ గణపతి కొంతకాలముండి అతని ప్రభుత్వము ఆప్రాంతమున కొనసాగుటకు అక్కడ అతని మంత్రియైన గోపరాజు రామన్న అనే పేరుగల ఆరువేల నియోగి బ్రాహ్మణుని అధికారమున విడిచిపెట్టిపోయెను. ఈ గోపరాజు రామన్న కర్నూలు జిల్లాలో గ్రామకరణాలుగా ఆరువేల నియోగి బ్రాహ్మణులనే నియమించినారు. అంతకుముందు బలిజవంశపు కవరీలు గ్రామకరణాలుగా వుండేవారు. సముద్రతీరమందలి గ్రామాలలో ఇప్పటికిని ఈ కవరీలే గ్రామకరణాలు. పిమ్మట 1328 మొదలు 1460 వరకు ఈ జిల్లాలోని తూర్పుభాగము అనగా కంభం, మార్కాపురం తాలూకాలు అనవేమ రెడ్డి పరిపాలనములోనికి వచ్చినవి. నంద్యాల భాగము మాత్రము విజయనగరపు బుక్కరాయలు వశపరచుకొనెను. 1520 నాటికి కర్నూలు జిల్లా అంతా కృష్ణదేవరాయల ప్రభుత్వమునకు లోబడినది. పిమ్మట తల్లికోట యుద్ధములో విజయనగరమువారు పూర్తిగా ఓడిపోవుటచేత ఇది బీజాపురము నవాబుల పరిపాలలోనికి వచ్చినది. 1674 లో శివాజీ తరచుగా దండెత్తివచ్చి ఈ జిల్లావారిని దోచుకుంటూ వుండేవాడు. తర్వాత చరిత్ర కడపజిల్లా చరిత్రవలెనే సాగినది.

## అనంతపురం జిల్లా :

తక్కిన రాయలసీమ జిల్లాలతోబాటు ఈ జిల్లాసైతము క్రీ॥ శ॥ 225-340 లో కలసిన పల్లవుల రాజ్యములో చేరియుండెను. ఏదో శతాబ్దములో ఈ జిల్లాలో చాలా భాగము పశ్చిమ చాళుక్యుల పరిపాలనమునం దుండెను. పిమ్మట 750 మొదలు 950 వరకు పల్లవ శాఖవారైన నొలంబుల పరిపాలనములో వుండెను. ఈ నొలంబులైనను సర్వాధికారము గలవారు కారు. ఆ నాటికి బళ్లారి జిల్లాలో తమ ప్రభుత్వము విస్తరింప చేసికొనిన రాష్ట్రకూటులకు లోబడి కప్పము చెల్లించుతూ ఈ నొలంబులు అనంతపురంజిల్లా పరిపాలించుకొనుచుండిరి. పిమ్మట కోలాహలపురమందు (కొల్హాపూర్) రాజ్యము స్థాపించుకొన్న పశ్చిమ గంగవంశపురాజు నారసింహుడు నొలంబుల నోడించి అనంతపురముజిల్లా జయించెను. గాని మరి నల్వై సంవత్సరములకే దీనిని చోళులు జయించిరి. రాజరాజచోళుని కాలము మొదలుకొని కులోత్తుంగచోళుని కాలమువరకును అనగా 975 మొదలు 1076 వరకును ఈ అనంతపురం జిల్లా చోళరాజ్యములో చేరియుండెను. పిమ్మట 1076 మొదలు 1191 వరకును పశ్చిమ చాళుక్యులును, 1191 మొదలు 1212 వరకును ద్వారసముద్రపు హోయిసలావంశపు బళ్ళారిరాజులును, 1212 మొదలు

1247 వరకును యాదవవంశపు సింగనరాజును ఈ జిల్లాకు పరిపాలకులై యుండేవారు. పిమ్మట మాలిక్కాఫర్ దండయాత్రలవలన హోయిసలాల రాజ్యము అంతరించినది. ఆ పిమ్మట శీఘ్రకాలములోనే విజయనగర రాజ్యము ఈ జిల్లాలో విస్తరించినది. విజయనగర రాజులు ఈ జిల్లాలో గుత్తి, పెనుకొండ, దుర్గములను కట్టించిరి. తల్లికోట యుద్ధము జరిగిన తర్వాత సదాశివరాజును తోడ్కొని తిరుమలరాయడు పెనుగొండకు పారిపోయెను. 1568 లో సదాశివుని చంపి తిరుమలరాయుడు పెనుగొండలో సింహాసన మెక్కి రాజపదవిని పొందెను. పెనుగొండలో అయినను మహమ్మదీయుల బాధ తప్పకపోవుటవలన తిరుమలరాయని కుమారుడైన రంగ 1575 లో చంద్రగిరికి వచ్చి నివసించెను. ఈ రంగని వంశమువారే 1639 లో చెన్నపట్టణమును ఆంగ్లేయుల కిచ్చినవారు. 1590 మొదలు 1680 వరకు అనంతపురం జిల్లా బీజాపురంవారి పరిపాలనలో వుండేది. పిమ్మట 1687 లో ఔరంగజేబు దక్షిణ దేశమును జయించినపుడు ఈ జిల్లా సైతము మొగలు సామ్రాజ్యములోచేరినది. 1723 లో దక్కను సుబేదారుగా వుండిన నిజాము స్వతంత్రుడై రాజ్యపరిపాలనము సాగించుతూ వుండెను. మహారాష్ట్రుల దాడులు ఈ జిల్లాకుకూడా వ్యాపించినవి. కాని మహారాష్ట్ర రాజ్యముమాత్రము ఇందు విస్తవించ లేదు. 1746 లో మురహరరావుమాత్రము గుత్తిలో ప్రవేశించి పెనుగొండ సైతము స్వాధీనపరచుకొని శిస్తు వసూలు చేస్తూవుండేవాడు. 1761 లో హైదరు మురహారిరావును చెఱలో పెట్టించి 1775 లో బళ్ళారి, గుత్తి తీసుకొని తన అధికారమును బళ్ళారి, అనంతపురం జిల్లాలలో నెలకొల్పుకొనెను. తరాత్వ చరిత్ర తక్కిన రాయలసీమజిల్లాల చరిత్రను అనుసరించియే సాగినది.

బళ్లారి జిల్లా :

బళ్లారి జిల్లా ప్రాచీనకాలపు చరిత్ర తెలుసుకొనుటకు ఆధారములులేవు. రామాయణములోచెప్పిన విషయములు యథార్థములయితే కిష్కింధదేశము ఈ జిల్లాలోనే ఉండివుండునని అనుకొనవచ్చును. క్రీ॥శ॥ 225 మొదలు 340 వరకు వెలసిన పల్లవులరాజ్యము రాయలసీమలోను చిత్తూరు, నెల్లూరు, గుంటూరు జిల్లాలలోను వ్యాపించి యుండెను. పల్లవుల రాజులలో శివస్కంధవర్మయొక్క హిరహడహల్లి (ఆర్పణహాల్లి) శాసనమునుపట్టి అదోని ఈ పల్లవ రాజ్యమునకు రాజధానిగా వుండేదని తెలియవచ్చినది. పిమ్మట ఈ జిల్లా కాకతీయ ప్రతాప రుద్రునకు వశమైనది. మాలికాఫర్ దండయాత్రలవలన దక్కనుదేశము మహమ్మదీయుల అధీనమున ఉండవలసి వచ్చునన్న భయముతో శృంగేరీపీఠమందు వేదవేదాంగ విద్యల నభ్యసించి విద్యారణ్యులని బిరుదముపొందిన మాధవుడు హరిహర బుక్కరాయలకు తోడై ఒక హిందూ రాజ్యమును అనగొందివద్ద స్థాపించి ఈ హరిహర బుక్కరాయలను రాజ్యాభిషిక్తులుగా చేసెను. ఆ రాజ్యమే విజయనగర రాజ్యముగా పరిణమించినది. విజయనగర సామ్రాజ్యములో బళ్లారిజిల్లా మొదటినుండి ముఖ్యమైన భాగము. హంపీనగరమున నేటికిని విజయనగర సామ్రాజ్యవైభవ చిహ్నములు కనబడుచున్నవి. తర్వాత చరిత్ర తక్కిన రాయలసీమ జిల్లాల చరిత్రనే అనుసర్రించి సాగినది.

చిత్తూరుజిల్లా :

క్రీ॥శ॥ 3 వ శతాబ్దమునుండి కొంతకాలము పల్లవుల రాజ్యములో చేరి తర్వాత చోళరాజ్యములో ఒక భాగముగా నుండెను. 13 వ శతాబ్దమున చోళరాజ్యము క్షీణించినతర్వాత కార్వేటినగర రాజులకును, పిమ్మట కొంతకాలము యాదవరాజులకును, లోబడియుండెను. పిమ్మట ఢిల్లీసుల్తానులకు లోబడినను విజయనగర సామ్రాజ్యములో ఒక భాగముగానుండి ఆ తర్వాత గోల్కొండ నవాబుల అధికారులలో కడప నవాబు పుంగనూరు, మదనపల్లి, వాయిల్పాడు తాలూకాలును, ఆర్కాటు నవాబు తక్కిన భాగములున్న పాలించుచుండిరి. మహారాష్ట్రులు దండెత్తివచ్చిరి కాని శిస్తు వసూలుచేసికొనిరేకాని ఇక్కడ ప్రభుత్వము నెలకొల్ప లేదు. 1760నుండి కొంతకాలము హైదరు, టిప్పుసుల్తానుల అధికారము ఇక్కడ వెలసినది. ఆ తర్వాత తక్కిన రాయలసీమజిల్లాల చరిత్ర ననుసరించియే ఈ జిల్లా చరిత్రకూడా సాగినది.

[శ్రీ మాగంటి బాపినీడుగారి 'ఆంధ్ర సర్వస్వము' దీని కాధారము.]

———

# ఆంధ్రదేశచరిత్ర—ప్రముఖఘట్టాలు

ఆంధ్రదేశము 67,500 చదరపుమైళ్లు, 64 వేల చదరపుమైళ్ళ వైశాల్యముగల అస్సాముకంటెను 46 వేల చదరపుమైళ్ళ వైశాల్యముగల ఒరిస్సాకంటెను 32 వేల చదరపుమైళ్ళ వైశాల్యముగల సింధూరాష్ట్రము కంటెను ఇది పెద్దది.

ఇందులో విశాఖపట్టణము, తూర్పుగోదావరి, పశ్చిమ గోదావరి, కృష్ణ, గుంటూరు, చిత్తూరు అను పదకొండు జిల్లాలును కలవు.

ఈ ఆంధ్రదేశమునకు ఎల్లలు:—ఉత్తరమున ఉత్కళ దేశము, తూర్పున ఆంధ్రసముద్రమనదగిన బంగాళా ఖాతము, దక్షిణమున తమిళనాడు, నైరృతిన మైసూరు, పడమట బొంబాయి రాజధాని, వాయవ్యమున హైదరాబాదు, బస్తరు, ఉత్కళరాష్ట్రములలోని మధ్యప్రదేశములు మధ్య రాష్ట్రములును కలవు. ఈ ఆంధ్రసముద్ర తీరము గోపాలపురము మొదలు చెన్నపట్టణమువరకు దాదాపు 60 మైళ్ళు వ్యాపించి యున్నది.

ఆంధ్రరాష్ట్రము ఏర్పడినప్పుడు ఆంధ్రరాష్ట్రము లోనికి రాదగిన ఆంధ్రప్రదేశములు అస్కా, ఛత్రపురము లకు నడుమను దక్షిణముగాను ఉన్న బరంపురం తాలూకా, పర్లాకిమిడి తాలూకా, భాగము మైసూరు రాజ్యములోని కోలారుజిల్లా, బెంగుళూరు జిల్లాలోని కొంతభాగము, చిత్తూరు సరిహద్దుదాటి కాంచీపురము వరకును, నెల్లూరు సరిహద్దుదాటి చెన్నపట్టణమువరకును వ్యాపించిన ప్రదేశము, నైజాము రాష్ట్రములో గల తెలింగాణా ప్రదేశము, మధ్యమాగాణములలో ఆంధ్రజనసంఖ్య ఎక్కువగా గల చాందా, బస్తర్, జిల్లాలును, భాషా ప్రయుక్తరాష్ట్ర విభజ ననుసరించి రాబోవు ఆంధ్రరాష్ట్రములో చేరవలసియున్నవి.

## రాష్ట్రేతరాంధ్రులు

దక్షిణదేశమందలి అన్ని జిల్లాలలోను మొత్తంమీద ముప్ఫైలక్షల ఆంధ్రులు కలరు. బొంబాయి రాష్ట్రములో లక్ష అరవైమూడువేలమంది ఆంధ్రులు కలరు. చెన్నపురము చెన్నప్ప అనే ఆంధ్రునిపేరునుండి వచ్చినది. ఇతను విజయనగరరాజ్యపు ఆర్వీటి వంశమువాడు. 1639 లో ఇతని కుమారుడు ఈస్టుయిండియా కంపెనీ వారికి ఈ పట్టణమందు ఆశ్రయము ఇచ్చిననాటినుండియిన్ని ఇది ఆంధ్రుల పట్టణముగానే వృద్ధిలోనికి వచ్చినది.

1931 సెన్సస్ లెఖ్ఖలప్రకారము చెన్నపుర జనాభా ఆరులక్షల నలభైఏడువేల రెండువందల ముప్ఫైఎనిమిది (647238) అందులో మూడులక్షలచిల్లర ఆంధ్రులు.

ఇప్పటి లెఖ్ఖలు :

### భావి ఆంధ్రరాష్ట్ర సంపత్తి

విస్తీర్ణము 67,500 చదుర మైళ్లు

జనసంఖ్య 1,77,00,000 పై బడి

ఆదాయము 7·5 కోట్ల రూపాయలు

| ఇతర రాష్ట్రములు | చ. మై. |
|---|---|
| అస్సాము | 64,000 |
| ఉత్కళము | 46,000 |
| సింధు | 32,000 |
| నార్తువెస్టు ఫ్రాంటియర్ | 18,000 |

జనసంఖ్య

| | |
|---|---|
| మధ్యరాష్ట్రములు | 1,55,00,000 |
| అస్సాము | 86,00,000 |
| ఉత్కళము | 83,00,000 |
| సింధు | 39,00,000 |
| నార్తువెస్టు ఫ్రాంటియర్ | 24,09,000 |

ఆదాయము

| | |
|---|---|
| బీహారు | రు. 5·00 కోట్లు |
| మధ్యరాష్ట్రములు | రు. 4·75 ,, |
| అస్సాము | రు. 2·84 ,, |
| ఉత్కళము | రు. 1·88 ,, |
| సింధు | రు. 1·00 ,, |
| నార్తువెస్టు ఫ్రాంటియర్ | రు. 1·70 ,, |

## చారిత్రక ఘట్టాలు

క్రీ. పూ.

280 - 220 ఆంధ్రరాజులు స్వతంత్రులై విజృంభించుట. మొదటిరాజు శాతవాహనాసిముఖుడు.

క్రీ. త.

78 ఆంధ్ర శాలివాహనశక ప్రారంభము.

107 - 128 గౌతమీపుత్ర శాతకర్ణి.

128 - 156 వాసిష్ఠీ పుత్ర పులమాయి.

166 - 195 యజ్ఞశ్రీ శాతకర్ణి.

195 - 225 శివశ్రీ

225 ఆంధ్ర శాతవాహన రాజ్య మంతరించుట.

225 - 250 శ్రీ పర్వతవంశపు ఆంధ్రరాజుల పరిపాలనము.

340 సముద్రగుప్తుని దక్షిణదేశ దండయాత్ర.

340 - 360 మొదట విష్ణుకుండిన రాజు శ్రీశైలమందు రాజ్యమేలుట. కళింగరాజ్యాధిపతి శక్తివర్మ మహారాజా విష్ణుపురమున రాజ్యమేలుట.

399 - 414 ఫాహియాన్ యిండియాలో సంచరించుట.

460 వేంగిలో విష్ణుకుండినులు రాజ్యమేలుటకు ప్రారంభము.

500 కళింగదేశమందు మొదటి గాంగవంశ రాజుల పరిపాలనము ప్రారంభించుట.

615 ఆంధ్ర చాళుక్యరాజ్యము కుబ్జ విష్ణువర్ధనునితో ప్రారంభమగుట.

630 - 644 హ్యూన్ త్సాంగ్ ఇండియాలో సంచరించుట.

720 మొదటి కామార్ణవునితో రెండవ గంగవంశము కళింగదేశమును పరిపాలించుటకు ప్రారంభించుట.

945 ఆంధ్ర చాళుక్యరాజులు వేంగిపురమును విడిచి రాజమహేంద్రవరమును తమ రాజధాని నగరముగా చేసికొనుట.

1023 - 1060 రాజరాజ నరేంద్రుని ఆస్థానమందు నన్నయభట్టు ఆంధ్ర మహాభారతమును రచించుట.

1050 శ్రీశైలమందు పండిత మల్లికార్జునుని జననము.

1078 - 1140 రెండవ గంగవంశపు రాజులలో ఎక్కువ ఘనతచెందిన అనంతవర్మచోళ గంగదేవుని పరిపాలనము.

1130 అనంతవర్మ చోళ గంగదేవుడు ఒరిస్సాలోని కటకపురిని జయించుట.

1199 తెలింగాణాలో కాకతీయ గణపతి రాజగుట.

1250 గణపతి చక్రవర్తి కాంచీపురము జయించుట.

1260 తిక్కనసోమయాజి గోపరాజురామప్రధాని వెలయుట.

1292 కాకతీయ రుద్రమదేవి; ఇటలీ యాత్రికులు మార్కోపోలో మనదేశమునకు వచ్చుట.

1828 రెండవ ప్రతాపరుద్రుని ఔన్నత్య ప్రారంభము.

1328 ఢిల్లీ తుగ్లక్ వరంగల్ నగరమును ముట్టడించుట.

1328 - 1424 కొండవీటి రెడ్లకాలము.

1336 విజయనగర రాజ్యస్థాపనము.

1396 - 1430 శ్రీనాథుని ప్రాభవకాలము.

1509 - 1530 విజయనగర సామ్రాజ్యపు శ్రీకృష్ణదేవరాయల పరిపాలనము.

1512 కుతుబ్ ఉల్ ముల్క్ గోల్కొండ నవాబగుట.

1549 తంజావూరులో ఆంధ్రరాజుల పరిపాలన మేర్పడుట.

1559 మధురలో ఆంధ్రరాజ్యము స్వాతంత్ర్యమును పొందుట.

1565 తల్లికోట యుద్ధము. విజయనగర సామ్రాజ్య పతనము.

1569 ఆరవీటిలో తిరుమలరాయలు సదాశివరాయలును చంపి రాజగుట.

1570 మధుర ఆంధ్రరాజు సింహాళమును జయించుట.

1579 కృష్ణజిల్లా మహమ్మదీయుల పరిపాలనలోనికి వచ్చుట.

1639 చంద్రగిరిరాజు గంగరాయలు ఇంగ్లీషు కంపెనీ వారికి చెన్నపురములో కోట కట్టుకొనుటకు అనుజ్ఞనిచ్చుట.

1674 ఆంధ్రరాజ్యమైయుండిన తంజావూరు మహారాష్ట్రులకు వశమగుట.

1739 మధురలో ఆంధ్రరాజ్య మంతరించుట.

1757 బొబ్బిలి యుద్ధము, కర్నల్ ఫోర్డ్ మచిలీపట్టణము పట్టుకొనుట.

1764 సంగీత సామ్రాట్ త్యాగరాజస్వామి జననము.

1766 గంజాం, విశాఖపట్టణము, గోదావరిజిల్లాలను, నైజాము ఆంగ్లేయుల కిచ్చుట.

1768 ఇంగ్లీషువారు కృష్ణజిల్లాను ఆక్రమించుకొనుట.

1778 గుంటూరుజిల్లాలో ఇంగ్లీషువారు ప్రవేశించుట.

1800 కడప, కర్నూలు, అనంతపురం, బళ్ళారి, జిల్లాలను, నైజాము ఇంగ్లీషువారికి ఇచ్చివేయుట.

1802 పర్మినెంటు రెవిన్యూ సెటిల్మెంటు పద్ధతిని జమీందారీలు ఏర్పడుట.

1806 తెలుగు అచ్చు అక్షరములు తయారు అగుట.

1827 తెలుగులిపిలో అచ్చయిన ప్రథమ గ్రంథము; **శబ్దమంజరి.**

1829 బందరు ఉప్పెన.

1834 ఆంధ్ర గ్రంథములు విరివిగా అచ్చుపడుట.

1835 ఆంధ్ర నిఘంటువు ముద్రణము.

1839 ఏనుగుల వీరాస్వామిగారి కాశీయాత్ర చరిత్ర ముద్రితము.

1846 త్యాగరాజస్వామి నిర్యాణము.

1848 కందుకూరి వీరేశలింగంగారి జననము.

1852 గోదావరి ఆనకట్ట.

1855 కృష్ణా ఆనకట్ట.

1857 విజయనగరములో మహారాజావారి సంస్కృత కళాశాల, సంగీత పాఠశాల ఏర్పడుట.

1859 ఇంజనీరింగు కళాశాల గిండీలో.

1860 చిన్నయసూరి రచించిన నీతిచంద్రిక, బాల వ్యాకరణము ముద్రితములగుట. పెన్ననీటి పారుదల విధానము.

1862 సర్. ఆర్. వెంకటరత్నం నాయుడుగారు దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావుగార్ల జననము.

1864 బందరు గాలివాన.

1865 ల్యాండు రికవరీ ఆక్టు.

1870 కడప, కర్నూలు జిల్లాలలో కాలువలు త్రవ్వుట.

1873 రాజమహేంద్రవరములో కళాశాల సంస్థాపన.

1875 నెల్లూరులో వెంకటగిరిరాజాగారి కళాశాల సంస్థాపన.

1877 విజయనగరములో మహారాజవారి కళాశాల సంస్థాపన, బకింగ్‌హాము కాలువ ఏర్పడుట.

1878 విశాఖపట్టణములో ఎ. వి. యన్. కళాశాల సంస్థాపన.

1884 కాకినాడలో పిఠాపురం రాజాగారి కళాశాల సంస్థాపన. తిరుపతిలో వేంకటేశ్వరవిద్యాలయ సంస్థాపన.

1885 గుంటూరులో ఆంధ్రక్రైస్తవ కళాశాల సంస్థాపన.

1886 విశాఖపట్టణము సరస్వతీనిలయం మొదటి గ్రంథాలయ స్థాపన; ప్రథమ కాంగ్రెసు సమావేశము. అనంతపురము నుండి పి. కేశవపిళ్లెగారు సభ్యులుగా కాంగ్రెసు సమావేశమునకు వెడలుట.

1887 వీరేశలింగం పంతులుగారి ఆంధ్రకవులచరిత్ర.

1893 మహాకాళి సుబ్బారావుగారి శబ్దార్థచంద్రిక. ఆంధ్రదేశమున రైలుమార్గము ప్రారంభమగుట.

1894 రాజమహేంద్రవరంలో ట్రెయినింగుకాలేజి సంస్థాపన. మద్రాసులో లాకాలేజి సంస్థాపన.

1895 పర్లాకిమిడిలో రాజవారి కాలేజి సంస్థాపన.

1896-1897 ఆంధ్రదేశంలో పలు భాగములందు ఘోరమైన కరువు.

1898 హిందూదేశ సాంఘిక మహాసభ కందుకూరి వీరేశలింగం గారి అధ్యక్షత క్రింద జరుగుట.

1900 గుంటూరులో సాహితీ సంఘస్థాపనము.

1900 కేసరికుటీర సంస్థాపన. రాయలసీమ ప్రాంతములలో కరువు.

1901 మద్రాసులో డి. గోపాలాచార్యులవారు ఆయుర్వేద కళాశాల స్థాపించుట.

1902 కాకినాడలో చెన్నరాజధాని దేశీయసాంఘిక మహాసభ. గుంటూరు జిల్లాలో ప్రథమ బ్రాహ్మణ వితంతువు వివాహము. విశాఖపట్టణంలో వైద్య పాఠశాల. కోయంబత్తూరులో అగ్రికల్చరల్ కాలేజి.

1903 కృష్ణానదీ వరదలు.

1904 రాజమహేంద్రవరములో వీరేశలింగ పుస్తక భాండాగార స్థాపనము.

1907 ఆంధ్రదేశమునకు బిపిన్ చంద్రపాల్ రాక.

1908 ఆంధ్ర వారపత్రికను కాశీనాథుని నాగేశ్వరరావుగారు బొంబాయిలో స్థాపించుట. వీరేశలింగంగారి షష్టిపూర్తి మహోత్సవము.

1908 బందరు జాతీయ కళాశాల సంస్థాపన. ఎస్టేటు లాండు ఆక్టు అమలులోనికి వచ్చుట.

1910 ఆంధ్ర ఇంష్యూరెన్సుకంపెనీ సంస్థాపన.

1911 బెజవాడలో రామమోహన గ్రంథాలయ స్థాపనము. ఆంధ్రదేశ గ్రంథాలయోద్యమ ప్రారంభము.

1912 నిడదవోలులో సమావేశమైన జిల్లా సభలో ఆంధ్రరాష్ట్ర సమస్య ఉదయించుట. కొవ్వూరులో ఆంధ్రగీర్వాణ విద్యాలయ సంస్థాపన.

1913 మొదటి ఆంధ్ర మహాసభబాపట్లలో జరుగుట.

1914 ఆంధ్రపత్రిక దినపత్రికగా మద్రాసునుండి వెడలుట

1916 అనంతపురంలో సెకండరీగ్రేడు కాలేజి.

1917 అనిబిసెంట్ అధ్యక్షతను కలకత్తాలో సమావేశమైన కాంగ్రెసు సభలో ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘ నిర్మాణము ఏర్పడుట. భాషా ప్రయుక్తరాష్ట్ర విభజన సిద్ధాంతమును కాంగ్రెసు అంగీకరించుట.

1918 బి. యన్. శర్మగారు కేంద్రశాసనసభలో భాషా ప్రయుక్తరాష్ట్ర విభజనము ప్రభుత్వము అంగీకరించునట్లు చేయుట. ఆంధ్రరాష్ట్ర ఆయుర్వేదసమ్మేళనము.

1919 వీరేశలింగంగారి నిర్యాణము. ఏలూరులో శ్రీకృష్ణా ఆయుర్వేదఫార్మశీ సంస్థాపన. కమ్యూగ ఔషధాలయ స్థాపన.

1922 స్వరాజ్యపత్రిక స్థాపన

1923 ఆంధ్రదేశములో కాంగ్రెసు సమావేశము తొలిసారి కాకినాడలో జరుగుట. ఆంధ్రబ్యాంకు సంస్థాపన.

1925 ఆంధ్రాఇన్స్యూరెన్సుకంపెని.

1926 ఆంధ్రవిశ్వవిద్యాలయ స్థాపనము. వాల్తేరులో సైన్సుకాలేజి, మెడికల్ కాలేజి.

1927 ఆంధ్ర నాట్యకళాపరిషత్తు స్థాపనము. ఆంధ్ర సైంటిఫిక్ కంపెనీ బందరులో స్థాపనము,

1929 పోలవరం ప్రాజెక్టు.

1931 ఆంధ్రదేశములో మొదటి సినిమాటాకీ తయారగుట.

1933 జనవాణి రెండవ తెలుగు దినపత్రిక ప్రారంభము. రావుసాహెబ్ గిడుగు వెంకటరామమూర్తి సప్తతిమ జన్మదినోత్సవము నవ్యసాహిత్య పరిషత్తువారు రాజమహేంద్రవరములో జరుపుట.

1934-1935 బళ్లారి, అనంతపురంజిల్లాలలో కరువు. పులిగడ్డ ఆనకట్ట. తూర్పుకాలువ.

1936 గుంటూరు, నెల్లూరుజిల్లాలలో తీవ్రమైన గాలివాన.

1937 మద్రాసు రాష్ట్రములో కాంగ్రెసుప్రభుత్వము అధికారము వహించుట. బెజవాడలో రాజా రంగయ్యప్పరావుగారి కళాశాల.

1937 - 1933 అనంతపురం, కర్నూలుజిల్లాలలో కరువు. కాంగ్రెసు మంత్రివర్గం ఋణవిమోచన చట్టము పెట్టుట. సేలంలో త్రాగుడు నిషేధం ప్రవేశపెట్టి తెలుగుజిల్లాలలో సైతము నిషేధము అమలులోనికి తెచ్చుట. ప్రకాశం కమిటీ రిపోర్టు. జమీందారీ రైతు సమస్యాపరిష్కారము. బందరులో ఆంధ్రఫార్మస్యూటికల్ వర్క్సు సంస్థాపన.

1938 కాశీనాధుని నాగేశ్వరరావుగారి నిర్యాణము.

1939 రెండవ ప్రపంచమహాయుద్ధము. కాంగ్రెసు మంత్రివర్గముల రాజీనామా!

1940 గిడుగు వెంకటరామమూర్తిగారి నిర్యాణము.

1941 విశాఖపట్టణము నౌకా నిర్మాణ శంకుస్థాపనము బాబు రాజేంద్రప్రసాదుగారు జరుపుట. విశాఖపట్టణంలో ఆంధ్రమహాసభ వార్షికోత్సవము. అఖిల భారత మహిళా సమావేశము కాకినాడలో జరుగుట. నాట్యకళాపరిషత్ సమావేశము. చెన్నపురి కాకినాడ విశాఖపట్టణముల సముద్రతీరమున జపానువారు బాంబులు వేయుట. పెద్దపాళెంలో ఆంధ్రగ్రంధాలయ 23 వ వార్షిక మహాసభ.

1942 క్విట్ యిండియా అలజడి. కాంగ్రెసు వర్కింగు కమిటి ఆగస్టు తీర్మానము. కాంగ్రెసు నాయకులను జైలులో పెట్టుట. ఆంధ్రమహాసభ వార్షికోత్సవము బళ్ళారిలో జరుగుట.

1943 క్రిప్సురాయబారం.

1945 రెండవప్రపంచ మహాసంగ్రామము పూర్తియగుట.

1946 కాంగ్రెసు విజయం; పార్లమెంటువారు దేశస్వాతంత్ర సిద్ధికి అనుకూలమైన విధానము సమకూర్చుట. ముస్లింలీగ్ జిన్నా అలజడి. కలకత్తా నౌఖాళీ, బీహారు హిందూముస్లిం మత వైషమ్య కలహములు. ఆంధ్రదేశములో స్వల్పముగా నెల్లూరులో కొట్లాటలు. చెన్నపురి కాంగ్రెసు ప్రభుత్వం. ఆంధ్రకేసరి శ్రీ టంగుటూరి ప్రకాశం ప్రధాని పదవిని అలంకరించుట. కాంగ్రెసు పక్షమువారిలో వైషమ్య మంకురించుట.

1947 చెన్నపురి మంత్రి వర్గమందు మార్పులు. శ్రీ టంగుటూరి ప్రకాశం, గిరి, ప్రభృతులు రాజీనామా ఇయ్యవలసివచ్చుట.

## చెన్నపురి ఆంధ్రులు

క్రీ. శ. 1565 లో తల్లికోట యుద్ధమున భామినీ సుల్తానుల విజయమువలన విజయనగర సామ్రాజ్యము అంతమొందినది. అయినను పెనుగొండలోను చంద్రగిరిలోను, కృష్ణదేవరాయల తుదు వంశపువారు చిన్నచిన్న రాజ్యములను పాలించుచుండేవారు. వారికే ఆర్వీటి రాజులని పేరు. ఈ రాజులలో పెద వెంకటపతినాయుడు షుమారు క్రీ. శ. 1600 సంవత్సరమున జీర్ణకర్ణాటక రాజ్యమును ఏలుచుండెను. ఆ కాలమున అతనికి దామెర్ల

చెన్నప్పనాయుడు సహాయుడుగా వుంటేవాడు. ఈ చెన్నప్పనాయని కుమారుడు వెంకటప్పనాయుడు పెద వెంకటపతి నాయనికి సామంతుడై తూర్పుతీరమున పులికాట్ మొదలుకొని కడలూరు వరకున్న వ్యాపించియున్న ప్రదేశమును ఏలుచుండెను. ఆ కాలంలో మైలాపూరునందు పోర్చుగీసులు, డచ్చివారు, ఆర్వీటి రాజులను ఆశ్రయించి అక్కడ తమ గిడ్డంగుల నేర్పరచుకొనిరి.

పైనచెప్పిన వెంకటప్పనాయుడు తూర్పుతీరమున బలముకలిగి యుండెను. అప్పుడు ఆ తీరమందు ఆంగ్లేయులకు ఒక మంచి అనుకూలమయిన వాణిజ్యస్థానము ఏర్పరచుకొనుటకు స్థలము కావలసి వచ్చినది. క్రీ. శ. 1639 లో వెంకటప్పనాయని అనుమతివల్ల కంపెనీవారికి ప్రస్తుతపు చెన్నపురియందు ఆశ్రయము దొరికినది. 1640 మార్చి 1 వ తేదిన ఇంగ్లీషువారు ఇచ్చట కోటకు పునాదులు ప్రారంభించిరి. కోటనిర్మాణము 23 ఏప్రిలుసరికి పూర్తి అయినది. ఆ దినము సెంట్‌జార్జిదినము గనుక కోటకు సెంట్‌జార్జి అనుపేరు వచ్చినది. 1658 సరికి కోట ప్రాకారములు ఆంగ్లేయుల నివాసగృహములు కట్టుట పూర్తిఅయినది. కోట ప్రాకారముల వెలుపలను నాలుగువందల నేతగాండ్ర కుటుంబములు కాపురము పెట్టుకొనిరి. కోట అవరణలోనివారు ఆంగ్లేయులు (తెల్లదొరలు) గనుక దానికి వైట్‌టౌన్ అనిన్ని మన హిందువులుగల భాగమునకు బ్లాక్‌టౌన్ అనిన్ని పేర్లు వచ్చినవి. ఈ బ్లాక్‌టౌన్ అన్నపేరు మొన్నమొన్నటి వరకును నిలచియుండెను. అది నిందాసూచకము గనుక మార్చవలసినదని మనవారు కోరుటచేత ఇప్పుడా బ్లాక్‌టౌన్ అన్న పేరుకు జార్జిటవున్ అన్న పేరువచ్చెను. వెంకటప్పనాయుడు కంపెనీవారికి దానము చేయుటచేత అతని తండ్రి చెన్నప్పనాయని పేరుబట్టి చెన్నపురియను పేరుకూడా మన హిందువుల వాడుకనుబట్టి ఆనాటినుండి నేటివరకును వ్యాప్తిలో యున్నది.

మద్రాసు అన్నపేరు మద్రాసి అనే క్రైస్తవుని పేరునుండి వచ్చినదని కొందరి అభిప్రాయము. ఈ ప్రాంతములో ఎం. ఎ. డి. ఆర్. ఇ. డి. ఇ. ఇ. యస్. యస్ అనే పేరను ఒక క్రైస్తవ చర్చివుండెను. దానిని బట్టి దాని చుట్టుపట్ల ప్రదేశమునకు మద్రాసు అనే పేరు వచ్చినది అని కొందరి అభిప్రాయము. మద్రాసు అనే పేరను ఒక చిన్న గ్రామము మైలాపూరు సముద్రతీరమున ఉంటే దనిన్ని ఆ పేరే దానిచుట్టు వ్యాపించిన పట్టణమునకు వచ్చినదనిన్ని కొందరి అభిప్రాయము. మాదిరాజుచే పరిపాలితమైన ప్రదేశము గనుక మాదిరాజు అనే పట్టణముపేరు క్రమముగా మద్రాసు అయినదని మరికొందరి అభిప్రాయము.

చెన్నపురి, మద్రాసు అను రెండుపేర్లు చాలాకాలము తూర్పుతీరమున మొదట వ్యాపించిన పట్టణమునకే చెల్లుచుండేది. తర్వాత క్రమక్రమముగా ఉత్తరమున తండియారుపేట మొదలుకొని, దక్షిణమున మాంబళము వరకును తూర్పున సముద్రతీరమునుండి పడమట అమంజకరై వరకును వ్యాపించిన నగరమునకు ఈ రెండు పేర్లును సమానముగాను వ్యాప్తికలిగినవి. ఈ నగరములో గల భాగములపేర్లు అనగా తిరువళిక్కేణి, చింతాద్రిపేట, మైలాపూరు, కీల్పాకు, ఎడంబూరు, పెరంబూరు, నుంగంబాకము, మాంబళము. మొదలైనవన్నియు మొదట వేరువేరు గ్రామములుగా వుండేవి. నేడు ఎక్కడెక్కడ హరిజనుల చేరీలు కలవో అక్కడ కూడ ఆయా గ్రామముల సరిహద్దులు వుండెనని ఊహించవచ్చును.

1830, 31 లో కంపెనీవారి దుబాషుగా వుండిన ఏనుగుల వీరాస్వామయ్యగారు తాము రచించిన కాశీయాత్ర చరిత్రలో చెన్నపట్టణమును గూర్చి వ్రాసినది చదువదగినది. 'ఈ చెన్నపట్టణము కోడి (జండా) క్రింద ఇప్పుడు సాలుకు సుమారు ఒకటింకాలు కోటివరహాలు వసూలు అగుతున్నవి. స్థావరజంగమ రూపమైన స్థితి మూడుకోట్ల వరహాలు వుండునని తోచుచున్నది. దండు యాభై వేలమంది ఫౌజు వున్నది. ఈ బస్తీకి మూడు ప్రక్కల పహారా (ఫారా) గోడపెట్టి వున్నది. బస్తీకి కోశడుదూరములో దక్షిణప్రక్క సముద్రము వారగా ఉత్తరప్రక్క సముద్రము గట్టున ఎగుమతి దిగుమతి అయ్యే రేవున్నూ సరకువేసే కొట్లున్ను కట్టివున్నవి. ఈ పట్టణానికి అంతా పాపము వీధి, కాలవీధి, విశాలమైనవి. దక్షిణమున తిరువళిక్కేణి, మైలాపూరు, తిరువతేశ్వరునిపేట, మొదలైన గ్రామములు వున్నవి. పడమటి ప్రక్క చూళై, పారిశపాక, కోమలేశ్వరుని గుడి మొదలైన కొన్ని గ్రామాలున్నవి. ఉత్తర భాగమునందు చాకలిపేట, రాయపురము, తండియారుపేడు మొదలైన కొన్ని గ్రామాలున్నవి. (చూడు కాశీయాత్ర చరిత్ర పుట 871) 17 వ శతాబ్దములో చెన్నపట్టణము పుట్టినవాటనుండి వాణిజ్య

వ్యాపారము కంపెనీవారితో సాగించుటకు అనేకమంది ఆంధ్రులు ఈ చెన్నపట్టణమునకు వచ్చుచుండిరి. ఇట్లు వచ్చిన కుటుంబములలో బేరీవారి కుటుంబము మొదటిది. బేరి తిమ్మప్పశెట్టి ఆంగ్లేయులకు కార్వేటి రాజులచేత అనేక స్థలములను ఇప్పించి ప్రసిద్ధిపొందెను. కంపెనీవారి గౌరవము పొందినవారిలో మరియొకడు బండ్ల రామస్వామి. వీరేకాక బైసానివారు సత్రసాలు వారు మొదలైన ఉన్నత కుటుంబములవారు చెన్నపట్టణములో స్థిరముగా నివాసము లేర్పరచుకొనిరి.

1780 - 1836 ఈ కాలంలో చెన్నపట్టణములో నివసించి ప్రజాసేవ చేసిన ఆంధ్రమహాపురుషులలో ప్రముఖులు సామయ్య మంత్రిపుత్రుడు. ఆంధ్ర వియోగి బ్రాహ్మణుడైన ఏనుగుల వీరాస్వామయ్యగారు 1815 మొదలు 1819వరకు చెన్నపట్టణంలో సదర్ అదాలత్ కోర్టులో ద్విభాషిగానుండిన వెన్నెలకంటి సుబ్బారావు గారి బంధువులు. వీరాస్వామయ్యగారు 1819 లో నేటి హైకోర్టుకు పూర్వముండిన సుప్రీమ్ కోర్టులో తెనుగు, అరవము, ఇంగ్లీషు తర్జుమాచేసే ద్విభాషిగా ఉద్యోగము చేసినారు. ఈ వీరాసామయ్యగారు తెలుగు నిఘంటువు రచించిన సి. పి. బ్రౌన్ దొరగారికి స్నేహితులు. బ్రౌన్‌గారు ఇంద్రాణిసీదా, పాలకట్ట అనే పదముల అర్థములకు ఈ వీరాస్వామయ్యగారినే ప్రమాణంగా పేర్కొనిరి..

వీరితర్వాత పేర్కొనతగిన తెనుగు ప్రముఖులు కోమలేశ్వరం శ్రీనివాసపిళ్లేగారు, ఐంబాకం రాఘవాచార్యులవారు మొదలైనవారు. ఈ ముగ్గురు ప్రముఖులు జనులకు ఉపయోగములైన పను లనేకములను చేసినారు. ఈ ముగ్గురికి ముఖ్యస్నేహితులు సూప్రీమ్‌కోర్టు అడ్వకేట్ గా పనిచేస్తుండిన జార్జి నార్టన్ దొరగారు. ఆ కాలంలో పచ్చయ్యప్ప చేసిన ధర్మములను వారి బంధువులు తినివేయు చుండుట చేత వాటిని బయటికితీసి సూప్రీమ్ కోర్టులో ఒకస్కీము తయారుచేసి సద్వినియోగపరచిరి. నార్టన్ ప్రోత్సాహముచేత పచ్చయప్ప కళాశాల ఉదయించింది. ఆ పిమ్మట మద్రాసు యూనివర్సిటి ఉన్నత పాఠశాల స్థాపించినపుడు దాని పరిపాలక వర్గంలో వీరు సభ్యులుగా వుండేవారు. ఈ మిత్రత్రయ కృషి వలన హిందూ లిటరరీ సొసైటి ఉదయించి ప్రజల మనో వికాసమునకు తోడ్పడుచుండినది. మరికొద్ది కాలమునకు ఆంధ్రవాణిజ్య ప్రముఖులు గాజుల లక్ష్మీనరసింహం శెట్టి గారొక సంఘమును నిలబెట్టి ప్రజాభ్యుదయానికి పాటు పడుతూ క్రిసెంటు అనే ఒక జాతీయపత్రికను 1844 లో స్థాపించి గొప్ప రాజకీయ సంచలనమునకు మార్గదర్శకులైనారు.

ఇటీవల ప్రఖ్యాతి పొందిన చెన్నపురి ఆంధ్ర ప్రముఖులలో పేర్కొనదగినవారు బాలవ్యాకరణ కర్త పరవస్తు చిన్నయ్య సూరిగారు శబ్దరత్నాకర కర్త, బహుజనపల్లి, సీతారామాచార్యులవారు; ఆంధ్రపండితుడు కొక్కొండ వెంకటరత్నం పంతులుగారు, ఆంధ్రగీర్వాణం పండితులు వేదం వేంకటరాయ శాస్త్రిగారు, వావిళ్ల రామస్వామి శాస్త్రులుగారు, ఆంధ్ర ప్రకాశిక స్థాపకులు పి. సి. పార్థసారథి నాయుడుగారు. విద్యాధికులు గెంటాల వెంకట సుబ్బారావుగారు, న్యాయవాదులలో పెద్దపేరు సంపాదించినవారు. పురాణం నాగభూషణంగారు, అనేక రకములగు దేశోద్ధారకు లనదగువారు. కాశీనాథుని నాగేశ్వరరావుగారు. వర్తకులలో పెద్ద పలుకుబడి పొందినవారు వహో అండ్ కో, ప్రొప్రయిటరు తిరువెంకటశెట్టిగారు. మంచిపలుకు బడిగలవారు గడ్డిపాటి వీరయ్యనాయుడుగారు. మన కాలపువారిలో పేర్కొనదగినవారు చాలా మందికలరు. అడ్వకేటుగాను, పిమ్మట రాజకీయ వేత్తలుగాను పేరుపొందిన గవర్నరుగాకూడా పనిచేసిన సర్ కూర్మ వెంకటరెడ్డి నాయుడుగారు, అడ్వకేట్ జనరల్ గా ప్రఖ్యాతి పొందిన సర్. అల్లాడి కృష్ణసామి అయ్యర్, హైకోర్టు జడ్జిపనిచేశిన సర్ వేపా రామేశంగారు, సర్ పి. వెంకట రమణారావుగారు, సర్ ముత్తా వెంకట సుబ్బారావు గారు, బి సోమయ్య పంతులుగారు, ఇప్పుడు హైకోర్టు జడ్జిగా పని చేస్తున్న పి. వి. రాజమన్నారుగారు. వింజమూరి గోవింద రాజాచారిగారు. అనేక రంగములందు పనిచేశి ప్రఖ్యాతి పొందినవారు దివాన్ బహదూర్ గోపతి నారాయణస్వామి శెట్టిగారు. దివాన్ బహదూర్ జి. వెంకటనారాయణగారు, కత్తే వెంకటస్వామిగారు.

మద్రాసు కార్పొరేషన్ మేయరు పదవిని అలంకరించిన ఆంధ్ర నాయకులు గోపతి నారాయణస్వామి శెట్టిగారు, కె. శ్రీరాములు నాయుడుగారు, సామి వెంకటాచలం శెట్టిగారు, బి. వాసుదేవ నాయుడు గారు సుందరరావు నాయుడుగారు.

చెన్నపురి ప్రభుత్వంలో మంత్రులుగా పనిచేశి పేరు పొందినవారుపానుగల్లు రాజరామారాయణంగారు. సర్. కె.వి. రెడ్డిగారు,సర్. ఎ.పి. పాత్రోగారు, బొబ్బిలి మహా

స్వామి నాయుడుగారు,బొబ్బిలిరాజాగారు, టంగుటూరి ప్రకాశం పంతులుగారు, వి. వి. గిరిగారు, బెజవాడ గోపాల రెడ్డిగారు. చెన్నపురి శాసనసభాధ్యక్షులై ప్రసిద్ధిపొందిన ఆంధ్రనాయకులు చింతలపాటి వెంకట నరశింహ రాజుగారు, బెజవాడ రామచంద్రా రెడ్డిగారు, బులుసు సాంబమూర్తిగారు ఉపాధ్యక్షులుగా ప్రఖ్యాతి పొందినవారు. శ్రీమతి డాక్టర్ ముత్తులక్ష్మిరెడ్డిగారు, శ్రీ. పి. కేశవ పిళ్లగారు, గొట్టిముక్కల జగన్నాథ రాజుగారు, శ్రీమతి ఆచంట రుక్మిణీ లక్ష్మీపతిగారు.

కార్పొరేషన్ కమీషనర్లుగా పనిచేసిన ఆంధ్రులు జె. వి. నారాయణస్వామి నాయుడుగార్లు, జనాబ్ జవత్ హుసేనుగారు, ఆర్. సుబ్బయ్య నాయుడుగారు, బి. పుల్లారెడ్డిగారు, శ్రీనరసింహంగారు. ఇతర ఉన్నతోద్యోగులుగా చెన్నపురిలో పనిచేసినవారు శ్రీ వెలగపూడి రామకృష్ణగారు, సత్యనాథంగారు, భాగవతుల విశ్వనాథ్ గారు, పి. హెచ్. రామిరెడ్డిగారు, సి. రామస్వామినాయుడుగారు, ఆనందరావుగారు, బండి శ్రీహరిరావునాయుడుగారు, రావుసాహెబ్ హెచ్. కృష్ణమూర్తిగారు, శ్రీ వెంకట్రావునాయుడుగారు, జి. వి. రావుగారు, సర్. కొండి వెంకట రామమూర్తిగారు, మద్రాసు పచ్చయ్యప్పకాలేజి ప్రిన్సిపాలుగా పనిచేస్తున్న డాక్టర్ బి. వి. నారాయణస్వామి నాయుడుగారు. వీరే కాక ఇంకను అనేకులు అడ్వకేట్లుగాను, డాక్టర్లుగాను, పెద్దపెద్ద వుద్యోగస్తులుగాను, ప్రసిద్ధిపొందిన ఆంధ్రనాయకులు అనేకులు గలరు. సినిమావ్యాపారము, ఎక్కువగా వ్యాపించుటచేత అందులో ప్రసిద్ధిపొందిన కళాదర్శకులు నటీనటులు చాలామంది ఆంధ్రులలో గూడా ప్రఖ్యాతి పొందుతున్నారు.

మొదటినుండి చెన్నపట్టణము ఆంధ్రుల నగరమే. బ్రిటిషుప్రభుత్వం పూర్తిగా నెలకొన్నతర్వాత రైలు మార్గములు మొదట ఎక్కువగా దక్షిణదేశమున వ్యాపించుటచేత దాక్షిణాత్యులు ఎక్కువగా చెన్నపురికి వచ్చి స్థిరనివాసము లేర్పరచుకొని ఉద్యోగములు సంపాదించి ఎక్కువ పలుకుబడి కలిగినవారైనారు. అందుచేత చెన్నపట్టణములో అరవభాష ఎక్కువగా వ్యాపించుటయున్ను అధికారరీత్యా అరవల పలుకుబడి ఎక్కువ కావడమున్ను సంభవించినది. అరవల ప్రాబల్యమువలన చెన్నపురి ఆంధ్రులు అరవభాష నేర్చుకొనుటయు తమ మాతృభాష ఎడల ఉండవలసిన శ్రద్ధ లేకుండుటయు జరిగినది. అందుచేత చెన్నపురి ఆంధ్రులభాష అరవ, తెలుగని చెప్పవీలు కలుగుట సంభవించినది. కాని ఇటీవల ఉదయించి విజృంభిస్తున్న ఆంధ్రోద్యమ ఫలితంగా చెన్నపురిలో ఆంధ్రుల జనసంఖ్య ఎక్కువైనది. ఆంధ్రుల పలుకుబడి ఎక్కువైనది. ఆంధ్రసంస్థలు అభివృద్ధిలోనికి వచ్చినవి. చెన్నపురి ఆంధ్రమహాసభ దినదినాభివృద్ధి పొందుతున్నది. ఇవేకాక ఆంధ్రవిజ్ఞానసమితి, ఆంధ్రకళామండలి, ఆంధ్రగానమండలి, మొదలైన ఆంధ్రవైజ్ఞానిక సారస్వతసభలు చెన్నపురిలో పెక్కుగలవు.



# ఇది ఇంతే

శ్రీ పంద్రంగి గోపాలరావు

మేము ఆంధ్రులం, మాది ఆంధ్రరాష్ట్రం, మాకు అదిలేదు ఇదిలేదు, అదికావాలి, ఇది కావాలి, అని హంగామా చెయ్యటం మొదలుపెట్టి మూడు పుష్కరాలు దాటింది. గొడవచేసే వాళ్ళ గొంతుకలు బొంగురు పోయాయి, అనేకదారులు త్రొక్కాము. ఎన్నో పల్టీలు కొట్టాము. ఇంత ఇదయినా ఉత్తవాగాడంబరం తప్ప కార్య రంగంలో సాధించగల్గినది గడ్డి పరకంతలేదు. మాడగా ఎందుకీ హంగామా అంతా ?—ఇహమా ?— పరమా? కావేషీలు కత్తులు పెంచుకుని కొట్లాటుకోవటానికీ కాలక్షేపానికీ అనిపిస్తోంది.

నిజమే కార్యశూరులకి కబుర్ల ధోరణి ఉండదు. మనదురదృష్టంవల్ల మన వ్యవహారాలు ఉత్తకబుర్ల పోగులచేతుల్లో పడ్డాయి. ఎవరినంటె ఏముంది మనకి నాయకులుగా చలామణి అయిన వాళ్ళందరిని భావ దాస్యం దేశాభ్యుదయానికి పాటుపడనివ్వకుండాచేసింది. మొదటిది మన నాయకులు ఆంగ్లమానసపుత్రులు, తర్వాత తరం బంగాళీల భావపుత్రులు. ఇప్పటివారు ఉత్తరాది వారి ఔరసపుత్రులు. అందుచేత పెద్దవాళ్ళనుకునే వాళ్లు మనకీ మనదేశానికీ ఏదో చేస్తారనుకోవటం బుద్ధితక్కువ. వాళ్లు చెయ్యగలిగిందల్లా కుర్రకారు పోకడలకి అడ్డు తగలకుండా హామీ ఇస్తేచాలు.

కనుక దేశం మరమ్మతు నిజంగా జరగాలంటే ఉత్సాహపూరితులైన యువకులు నడుంకట్టాలి. కబుర్లు చెప్పటం మరిగి ఉత్సాహమున్న కాసేపు ఊకదంపులో వ్యర్థంచేసేవ్యక్తులనీ, సంస్థలనీ నిర్మొగమాటంగా వెలి వెయ్యాలి. ఎంతవాడినైనా ఏమి చేశావు అని అడిగి తెలుసుకునే ధైర్యం అలవరచుకోవాలి.

మనదేశంలో పరిశ్రమలు వృద్ధిలోకి రావాలంటే మన వస్తువులని వాడటం తెలుసుకోవాలి. మిగతా రాష్ట్రాలవాళ్లు మనకన్న ముందు నడక మొదలెట్టారు. వాళ్ళలో కలుసుకోవాలన్నా అతిక్రమించాలన్నా అదే దారిని పోతే అయ్యేపనా ? అడ్డదారులు వెతకాలి. అల్లాగని అగునుకోపద్ధతిలో నడిపితే పరిశ్రమలు నెగ్గవు. ముందే చక్కగా ప్లానువేసుకుని దిగాలి. దిగాక తటపటాయించి వెనక్కి చూచుకోకుండా సాగిపోతే ఎవడికోసం నెగ్గుతుంది. "అనగ ననగ రాగ మతిశయిల్లుచునుండును" కదా.

మనదేశంలో దొరికే ఖనిజాలు పరరాష్ట్రాలకి పరదేశానికీ ముడిరూపంలో ఎగుమతి చెయ్యటానికే అన్నభావం మరిచిపోవాలి. వాటిల్లోంచి మిగతా రాష్ట్రాలవాళ్లు తయారుచేసే! వస్తువులని మనం కూడా చెయ్యొచ్చునన్నే ధీమా సంపాదించుకోవాలి. అయితే ఒక్కసారి తాహతుకుమించిన పెద్దెత్తులెత్తి చదికిలబడకూడదు. ముఖ్యంగా కొత్తదారులు తొక్కి కొత్త పరిశ్రమలను ఎత్తుకోవాలి కాని ఉన్నవాటిని అనుకరించటంలో నిమగ్నులవవకూడదు.

కొత్తగా క్రోమ్ప్లేటుగనిని మొదలెట్టినవాడు పక్కవాడికన్న పావులా చవకగా ఇస్తానని పోటీలుపడేకన్న ఆ క్రోమ్ప్లేటునుంచి క్రోమురంగులు, రసాయనికాలు తయారు చెయ్యటాన్నిగురించి ప్రయత్నిస్తే మంచిది. ఇదే బెరైటిస్, చైనాక్లే, నామసుద్ద, గోపి, కాఫీ, సున్నపురాయి మొదలైన ఖనిజాలు ఉత్పత్తి చేసేవాళ్ళకి వర్తిస్తుంది.

పోటీలు పడి వారు పెట్టారని వీరు, వీరు పెట్టరాని వారు లక్షలాది డబ్బువెచ్చించి నూనెలని శుద్ధిచెయ్యటానికి, దుంపనెయ్యి చెయ్యటానికి మిషనులు తెప్పించుకొనటంమాని వేరుశనగపిండిలోంచి రకరకాల పుష్టికరమైన ఆహారములను తయారు చెయ్యటానికి ఏమైనా మార్గం ఆలోచించాలి. ఒకదానికి పోటీగా ఒక పంచదార ఫాక్టరీని లేవదీసే బదులు, రసంతీసిన చెరుకు తుక్కులో (Sound proof) అట్టలని చేయటానికి పూనుకోవాలి.

ఎవరో చెప్పారు మన దేశంలో సీసం ఖనిజంలో కావలసినంత వెండిలేదని. సీసం తయారుచేసే ఫాక్టరీకి సరిపడ్డంత విరివిగా ఆఖనిజం దొరకదేమోనని కుశ్యం కలు చెయ్యకుండా, సీసం ఖనిజంలోంచి సీసం రసాయనికాలు చెయ్యకూడదా అని తర్కించుకుని సాధించాలి.

ఇల్లాంటి ఉదాహరణలు కావలసినన్ని. అందుకనే ధీక్షాపరులైన యువకులు విద్యాలయాలని విడిచి నౌఖరీలకి మూగి కకటలాడేకన్న ఏదో ఒక పరిశ్రమని

తీసుకుని దాంట్లో నాటుకుని పైకిరావాలి. ప్రేమగీతాలు వ్రాసుకుంటూ అర్థంకాని వ్యర్థ జీవనం గడపటం విరమించుకోవాలి. విశ్వవిద్యాలయాలలో పట్టభద్రులకి పరిశ్రమలపట్ల భావపరివర్తన రావాలి.

ఇన్ని చెయ్యగల్గిన నాడే మనం మన దేశాభిమానాన్ని సార్థకం చేసుకోగలం. లేకపోతే శుష్కదండగే. కానైతే కొందరు ఆంధ్రులు వ్యక్తిగతంగా పరిశ్రమలలో పైకివచ్చారు. అది వాళ్ళ సత్తామీద జరిగినపని కాని మన దోహదంవల్లకాదు. మనం భావదాస్యంలో మునకలు వేస్తున్నాం. అది పోతేనేకాని ముక్తిలేదు.

శారీరకంగా అవుసరంకొద్దీ ఏ కడుపుకక్కుర్తికో పరాయివాళ్ళకి దాస్యం చెయ్యొచ్చు. కాని ఆ చేసేటప్పుడు మనలో యుక్తాయుక్తవిచక్షణ, స్వార్థపరార్థమీమాంస నశించదు. అటువంటి వారికి అవకాశం దొరికితే విముక్తి ఉంటుంది కాని భావదాస్యంలో పడ్డవాళ్ళకి దాస్యమే పరమావధి అయిపోతుంది. చేసేది దాస్యం అన్న భావమే నశిస్తుంది. అట్లాంటి దాట్లోంచి బ్రహ్మప్రళయమైతేనేకాని బైటపడటమనేది ఉండదు. మన పాలిటికి ఆ ప్రళయమింకా రాలేదు. ఎంత త్వరగా వస్తే అంత మంచిది. అప్పుడే మనకేది కావాలో మనం నిర్ణయించుకోగలం. ఎదటివాడి ముఖాలు కనిపెట్టుకుని ఎన్నాళ్లీ మథన.

ఇది యంత్రయుగం. డబ్బుకున్న విలువ నీతి జాతులకి లేదు. ధర్మపన్నాలు చెప్పాలికాని ఆచరించకూడదు. వెధవపనులుచేసి వేలుగడించి ఏ కొన్ని వందలో దేవుడి డిబ్బీలలో వేసో, ధర్మ కార్యాలకనో ఖర్చుపెడితే పాపం పోతుందన్న భావం. ప్రతి వెధవపనికీ మనకర్మకాండలో ప్రాయశ్చిత్తానికి తావుండటం మిగతా జాతులన్నీ గుర్తించి ఆదర్శాలకీ, ఆచరణలకీ, అవుసరమైనంత దూరం ఉంచారు. మనం (ఆంధ్రులం) ఆదర్శాలని ఆచరించటం మొదలెట్టాము. మంచిదే. ఇదేముక్తిమార్గం అంటే వప్పుకోవలసిందే. కాని ముక్తిఎప్పుడు? చచ్చాక. అంటే ఆ కైవల్యసుఖం మనజాతి భౌతిక ప్రపంచంలో నామరూపాలు లేకుండా నశించాక.

అంచేత మనం నిర్ణయించుకోవలసినది, చావటమా బ్రతకటమా అని. బ్రతకాలంటే అయిహికంలో అవసరమైనట్లు నడవాలి, కైవల్యంకావలెనంటే చిక్కులేదు. అంతే కాని రెంటికీ లంకెపెట్టి చీటికీ మాటికీ సణుక్కుంటో అప్రయోజకత్వాన్ని అహంకారంతోటి, అహంభావంతోటి కప్పిపుచ్చటం ఎంత త్వరగా మానుకుంటే అంత మంచిది.



# మన రైతు ఉద్యమం

ఆచార్య రంగా

అఖిలభారత కిసాన్ ఉద్యమానికి జన్మస్థానం నిడుబ్రోలు గ్రామం. పది శతాబ్దాలక్రితం ఇది చాలా ప్రసిద్ధిచెందిన గ్రామమై వుండాలి. ప్రముఖ చోళచక్రవర్తి కులోత్తుంగుడు ఇక్కడ పెద్ద శివాలయాన్ని ప్రతిష్ఠ చేశాడు. ఇంతేకాదు. ఈ దేవాలయ ప్రతిష్ఠకు ఒక శతాబ్దంక్రితం నిడుబ్రోలు కర్షకకుటుంబానికి చెందిన ఒక ప్రముఖుడు చోళరాజుకు ప్రధానామాత్యుడుగా సైతం పనిచేశాడు. అఖిలభారత చేనేత కార్మికుల కాంగ్రెస్ ప్రధాన కార్యాలయంకూడా నిడుబ్రోలులోనే వున్నది. భారతీయ కర్షక పరిషత్‌ను స్థాపించింది కూడా ఇక్కడే. 1933 లో మహాత్ముడు ఈ పరిషత్‌కు ప్రారంభోత్సవం జరిపాడు.

భారతదేశంలో ఆధునిక కర్షకోద్యమం ప్రారంభమైంది. 1923 లో యూరప్‌ఖండంనుంచి తిరిగివచ్చిన తర్వాత మనదేశంలో అనేక కర్షక సమావేశాలను ఏర్పాటుచేశాను. రష్యన్‌ప్రజలు సాధించిన విప్లవ ఫలితాలే నాలో మనదేశంలోకూడా ఇట్టి సామాజిక విప్లవాన్ని స్థాపించడం అవసరమనే గాఢ అభిలాషను రేకెత్తించినవి. గాంధిజీ ప్రారంభించిన చరిత్రాత్మకమైన అసహాయోద్యమము, గుంటూరుజిల్లా పెదనందిపాడు, దుద్దుకూరు గ్రామాలలో సాగిన పన్నుల నిరాకరణోద్యమము లేకపోయినట్లయితే నేను గలపెట్టిన కర్షకోద్యమం మన రైతులను అంతగా ఆకర్షించివుండేది కాదనే చెప్పవలసి వుంటుంది. ఐతే మన రైతులలో ఉత్సాహానికి ఏమాత్రం లోటులేదు.

1923-28 సంవత్సరాలలో గూడూరు రామచంద్రరావుగారు, మాగంటి బాపినీడుగారు నేను మరి కొంతమంది మిత్రులు స్థానిక రైతుసంఘాలను ఏర్పాటు చేయడానికి కృషి సాగించాము. 1928 లో గుంటూరు పట్టణంలో రైతుల సమావేశం జరిగింది. అప్పుడే ఆంధ్రరాష్ట్ర రైతుసంఘాన్ని స్థాపించాము. యావద్భారత దేశంలోనూ ప్రథమ రైతుసంఘాన్ని స్థాపించామనే ఖ్యాతి మన ఆంధ్రదేశానికి లభ్యమైంది. ఆ సంఘానికి బాపినీడుగారిని, నరసింహదేవర సత్యనారాయణగారిని (అలమూరు), నన్ను కార్యదర్శులుగా ఎన్నుకున్నారు.

మన రైతు ఉద్యమానికి సవ్యమైన, శాస్త్రీయమైన ప్రాతిపదిక ఒకటి ఏర్పాటు చేయడానికి 'భారతదేశ గ్రామ ఆర్థిక నిర్మాణం' అనే గ్రంథాన్ని రెండు సంపుటాలుగా ఆ రోజులలో రచించాను. 'రైతులు' అనే వ్యాస పరంపరను 'ఆంధ్రపత్రిక'లో వ్రాశాను. అప్పటి వరకూ గ్రామ పునర్నిర్మాణ కార్యక్రమంక్రింద వ్యవసాయం శాస్త్రీయయుక్తంగా జరగాలనీ, చిన్నచిన్న కమతాలను ఏకంచేయడం అవసరమనీ, ఉత్పత్తిని ఎక్కువ చేయాలనీ, సహకార పద్ధతిన సాగుబడి సాగించాలనీ మాత్రమే ప్రచారం జరుగుతుండేది.

భారతదేశ కర్షకోద్యమంలో 1929 చాల ప్రధానమైన సంవత్సరం. 'కిసాన్‌రాజ్' అనే నినాదాన్ని యావద్భారతదేశంలోనూ ప్రప్రథమంగా లేవదీసింది ఆ సంవత్సరమే. ఆ సంవత్సరమే బెజవాడలో రెండవ ఆంధ్రరాష్ట్ర రైతు మహాసభ నా అధ్యక్షతకింద జరిగింది. సంయుక్త, బెంగాలు రాష్ట్రాలలో కొంతమంది సోషలిస్టులు కార్మిక, కర్షక పక్షాలను స్థాపించి పని చేయడం ప్రారంభించిందీ ఆ సంవత్సరమే.

'రైతురాజ్యం' అనే నినాదం ఆంధ్ర రైతులను బాగా ఆకర్షించింది. అప్పటివరకూ సాగుతూవచ్చిన 'అబ్రాహ్మణోద్యమం' జాతీయ విప్లవోద్యమానికి ప్రతికూలంగావున్న కారణంచేత,దానిపై ప్రజలలో తీవ్రమైన అసంతృప్తి, అసహ్యము ప్రబలిపోయినవి. రైతులలో స్వాతంత్ర్యవాంఛ గాఢంగా నాటుకుపోయింది.

తగినంత రాజకీయ చైతన్యంలేని కారణంగా 'రైతు రాజ్యం' అనే నినాదం అప్పటిలో ఆంధ్రదేశ రైతు

జనాన్ని ఆకర్షించినంతగా మిగత రాష్ట్రాలవారిని ఆకర్షించలేదని ఒప్పుకోవాలి. సర్దార్ వల్లభాయిపటేల్ బార్డోలిలో జయప్రదంగా సాగించిన శిస్తునిరాకరణోద్యమం రైతు ఉద్యమంపట్ల మిగతా రాష్ట్రాలవారిని కూడా దారిలోకి తెచ్చింది. రాజకీయంగా తమ శక్తి సామర్థ్యాలు ఎంత అమోఘమైనవో రైతులోకం గమనించింది. కర్షకులకు స్వస్వరూప జ్ఞానం కలిగింది. తరతరాలగా తమను ఆవహించిన గాఢనిద్రావస్థనుంచి రైతులోకం మేల్కొన్నది. 'బార్డోలీ సత్యాగ్రహం' ఫలితంగా మన తెలుగు రైతులుకూడా నేర్చుకోవలసిన కొత్త గుణపాఠాలను నేర్చుకున్నారు. 'రైతురాజ్యం' అనే నినాదానికి ఒక విధంగా కొత్తశక్తి చేకూరింది.

1930-34 సంవత్సరాలలో దేశమంతటా ఆర్థిక మాంద్యం ఏర్పడి, తత్ఫలితంగా రైతు ఆదాయం తగ్గిపోవడం సంభవించింది. భూములధరలు పడిపోయినవి. రైతు ఋణభారం విపరీతమైంది. ఋణాలు తీర్చలేకపోయినందువల్ల రైతుభూవసతి పెట్టుబడిదారుల హస్తగతమైపోవడం ప్రారంభించింది. ఆ పరిస్థితులలో ధనికవాద ప్రాబల్యంవల్ల తమకు ఎంత ఉపద్రవం ఏర్పడేదీ ప్రపంచ రైతాంగం అవగాహన చేసుకొన్నది.

ఋణ భారంనుంచి బయటపడడానికి భారతదేశ రైతులు తమకు తోచినపద్ధతులను తాము అన్వేషించసాగారు. పంజాబు రాష్ట్రంలోని సిక్కు రైతులు 'ఋణ నివారణం సంఘాలను'ఏర్పాటుచేసుకున్నారు. బెంగాలు ముస్లిం రైతులు అప్పులను, శిస్తులను, శిస్తు బకాయిలను చెల్లించ నిరాకరించారు. ఆపరిస్థితులలో ఆంధ్ర రైతాంగం 'మారటోరియం' ద్వారా తమవ్యవసాయపు అప్పులను, శిస్తుబకాయలను తుడిచివేయవలసిందనే నినాదం ప్రారంభించింది. దీనితోపాటు ఆంధ్రరైతాంగం శిస్తుల రిమిషన్ కావాలనే కోర్కెను జతచేసింది. 1931 లో తెనాలిలో రైతు ప్రతినిధులు సమావేశమై రైతు రక్షణ సంఘాన్ని స్థాపించి తను రాజకీయ, ఆర్థిక వాంఛలను స్థాపించ పూనుకున్నారు.

ఆంధ్రరైతు ఉద్యమం 1931 నుంచీ జమీందార్ విధానాన్ని ప్రతిఘటించడం ప్రారంభించింది. రాష్ట్ర రైతుసంఘం నియమించిన ఆర్థికవిచారణ కమిటీ జమీందారీ విధానంవల్ల ఎన్నెన్ని దుష్ఫలితాలు ఏర్పడనున్నవో స్పష్టపరిచింది. ఆంధ్ర రైతాంగం లేవదీసిన ఈ జమీందార్ ప్రతికూలోద్యమం యావద్భారత దృష్టిని ఆకర్షించింది. అలహాబాదునుంచి వెలువడే 'లీడర్' పత్రిక సంయుక్త రాష్ట్ర కర్షకులు జమీందారి విధానాన్ని ప్రతిఘటించడానికి ఆంధ్ర రైతాంగం అనుసరిస్తున్న విధానాన్ని అనుసరించడం అవసరమని బాహాటంగా హితబోధచేసి, మనకృషిని అభినందించింది.

“జమీందారీ విధానం రద్దుకావాలి” అనే సాహసోపేతమైననిదానాన్ని ప్రప్రథమంగా వెంకటగిరిజమీందారీ రైతుల మహాసభలో ఆమోదించాము. ఆసభకు శ్రీ విస్వనాథదాస్ గారు, కీర్తిశేషులు దేశోద్ధారక నాగేశ్వరరావు పంతులుగారు, శ్రీమాన్ సత్యమూర్తి గారు, తదితర ప్రముఖులు హాజరై పై నినాదంతో తమ సంపూర్ణ ఏకీభావాన్ని తెలిపారు. ఆసభకు అధ్యక్షత వహించే అదృష్టం అబ్బినందుకు నేను గర్విస్తున్నాను. జమీందారీవిధానం రద్దుకావాలిఅని మనం ఆనాడుచేసిన నినాదం యావద్భారత నినాదన మైంది. ఈనాడు అఖిలభారత కాంగ్రెస్ కార్యక్రమంలో దానికి ప్రముఖ స్థానం లభ్యమైంది.

'జమీందారీ విధానం నాశనం కావాలి' అనే నినాదాన్ని మొట్టమొదట ప్రారంభించిన నెల్లూరు వెంకటరామానాయుడుగారి సేవను, ధైర్యాన్ని ప్రశంసించకుండా వుండలేము. నాయుడుగారు పేద కర్షకకుటుంబానికి చెందినవారు. స్వయం కృషివల్ల ఆత్మసంస్కారం సాధించినవారు. వాస్తవంగా వీరిని మనకర్షకోద్యమ పితామహులని చెప్పవలసి వుంటుంది. జమీందారీ విధానంపై మన రామానాయుడుగారు 1925 లోనే కత్తి కట్టారు. అతిసాధారణమైన రైతుకుటుంబంలో పుట్టిన నాయుడుగారికి ఇంతటి భావోద్దీపన కలగడానికి కారణమేమిటి ? రెండువేల సంవత్సరాల క్రితంనుంచి తరతరాలగా మనజాతి అనుభవించిన స్వాతంత్ర్యం, అనుసరించిన ఉత్తమ సంప్రదాయాలు, స్థాపించిన పంచాయతీరాజ్యం, పాలించిన ఆత్మగౌరవం, సాగించిన వీరపూజ, ప్రదర్శించిన యుద్ధనైపుణ్యం ఇవేకారణమని

చెప్పవలసి వుంటుంది. బౌద్ధమత ప్రచారానికీ, నాగార్జునకొండ, అజంతా మొదలైన శిల్పకళా క్షేత్రాలకు, వీరశైవ వీరవైష్ణవ మతాలకు ఆలవాలమూ, చోళ, పల్లవ, చాళుక్యరాజుల వలనను, కాకతీయ, విజయనగర సామ్రాట్టుల ఏలుబడి కింద మహావైభవాన్ని అనుభవించిన పవిత్ర భూభాగము అయిన తెలుగు గడ్డమీద ఇట్టి వీరులు జన్మించడం సహజమే.

మనం ప్రారంభించిన 'రైతురాజ్య' నినాదం ఆంధ్ర, తమిళ, కేరళ, కర్ణాటక ప్రజా బాహుళ్యాలలో నూత్న ఉత్తేజాన్నీ, నవ్య ఆశాభావాన్నీ, ఒక విధమైన ఆత్మవికాశాన్నీ రేకెత్తించింది. ఈ విధంగా ప్రచారం సాగిస్తూ కిసాన్-మజ్‌దూర్ రాజ్యస్థాపనకు భరత ఖండంలోవున్న సమస్త కర్షక జనబాహుళ్యమూ కంకణం కట్టుకోవలసి వున్నదని ఉద్బోధించాము. ఈ ఉద్బోధ ఫలితంగా 1935 అక్టోబరులో అఖిలభారత కిసాన్ ఉద్యమ ప్రచారకుల మహాసభను ఒకదాన్ని జరిపాము. దానికి నేనే అధ్యక్షత వహించే అవకాశం దొరికింది. అఖిలభారత రైతు కాంగ్రెస్ మహాసభను స్థాపించడం అవసరమని ఆ సభలోనే తీర్మానించాము. కిసాన్-మజ్ రాజ్యస్థాపనకు మేము సాగిస్తున్న ఉద్యమ విజృంభణను చూసేసరికి కమ్యూనిస్టులకు, సోషలిస్టులకు కన్నుకుట్టింది. అనేక ప్రతిబంధకాలను కలిగించడం మొదలుపెట్టారు. నేను తలపెట్టిన ఉద్యమంలో వి. వి. గిరి, శ్రీమతి కమలాదేవిగారల సానుభూతి, సహకారం లభ్యమైనవి.

ప్రప్రథమంగా వివిధ ప్రాంతాలనుంచీ ఎన్నుకున్న ప్రతినిధులతో అఖిలభారత కిసాన్ మహాసభ 1936 సంవత్సరం డిసెంబరుమాసంలో ఫైయిజ్‌పూర్‌లో జరిగింది. కమ్యూనిస్టులు, కాంగ్రెస్ సోషలిస్టులు చెరిఒకవైపునుంచీ అనేక కుట్రలుపన్ని మా కార్యక్రమాన్ని చెడగొట్టడానికి ప్రయత్నిస్తున్నప్పటికీ కిసాన్ మహాసభ ఈ విధంగా ఉద్భవించి ఉన్నతస్థాయికి వచ్చింది. యావద్భారతదేశ స్వాతంత్ర్య సాధనకై విశాల ఉద్యమాన్ని సాగిస్తున్న కాంగ్రెస్ మహాసభలో ఈ కిసాన్ మహాసభకూడా ఒక అంతర్భాగమై పనిచేయడం ప్రారంభించింది. కొన్నికొన్ని రాష్ట్రాలలో కమ్యూనిస్టులుకూడా కిసాన్ మహాసభ కీలక పదవులలో చేరి పనిచేయడం ప్రారంభించారు. రష్యా ప్రపంచ యుద్ధంలో చేరగానే, ఆ యుద్ధాన్ని కమ్యూనిస్టులు ప్రజా యుద్ధమని కిసాన్‌సభద్వారా ప్రచారం చేయడం మొదలుపెట్టారు. 1942 ఆగస్టులో కాంగ్రెస్ ప్రారంభించిన జాతీయ విప్లవోద్యమానికి సైతం కమ్యూనిస్టులు ఈ కిసాన్‌సభలద్వారా విద్రోహం తలపెట్టి పనిచేయసాగారు. అంతట కమ్యూనిస్టుల పీడను వదిలించుకోడానికి ఆంధ్ర కిసాన్ కమిటీలు, దక్షిణ భారతదేశంలో వున్న మరికొన్ని కిసాన్‌కమిటీలు, కమ్యూనిస్టుఆధిపత్యం కింద పనిచేస్తున్న అఖలభారత కిసాన్ మహాసభనుంచి తప్పుకొని, కమ్యూనిస్టులతో ఏ విధమైన ప్రమేయము లేనట్టి అఖిలభారత కిసాన్ కాంగ్రెస్‌ను ఏర్పాటు చేసుకోవలసి వచ్చింది. అప్పటినుంచీ ఈ కిసాన్ కాంగ్రెస్ మహాసభ 'కిసాన్-మజ్‌దూర్-ప్రజారాజ్' అనే ఉన్నత లక్ష్యంతో పనిచేయడం మొదలుపెట్టింది. జాతీయ విప్లవ సాధనే ఈ మహాసంస్థ పవిత్ర లక్ష్యమైంది.

ఆంధ్రాకిసాన్ కాంగ్రెస్ ప్రచారకులు 1942 ఏప్రిల్, మే నెలల్లో నిడుబ్రోలు కర్షక పరిషత్తులో సమావేశమై ఇకమీద తమ లక్ష్యం 'కిసాన్-మజ్‌దూర్-ప్రజారాజ్య స్థాపన్' అని ప్రకటించారు. స్వతంత్ర భారతదేశంలో రాజ్యాధికారం కార్మిక, కర్షక ప్రజాబాహుళ్యానిదేనన్న హామిని, గాంధిజీ, నెహ్రూలతో సంప్రదించి సాధించగలిగాను. కాంగ్రెస్ మహానాయకులుకూడ ఈ మహత్తర లక్ష్యంతో ఏకీభవించినందుకు ఆంధ్రరైతాంగానికి అపరిమిత సంతోషం, సంతృప్తి, కలిగినవి. ప్రజాస్వామ్యబద్ధమైన కిసాన్ మజ్‌దూర్ ప్రజారాజ్యస్థాపనకే కాంగ్రెస్ కృషిచేస్తుందని గాంధిజీ స్పష్టంగా ప్రకటించాడు.

1933లో జరిగిన కిసాన్ యాత్రలో ఆంధ్రదేశ కిసాన్ ఉద్యమం ప్రారంభమైంది. 1937 వచ్చేసరికి దేశంలో ఈ కిసాన్ ఉద్యమం బ్రహ్మాండమైన శక్తిగా పరిణమించింది.

మనరాష్ట్రంలోవున్న జిల్లాలలోను ప్రతి సంవత్సరం ఒక్కొకసారి ఈ కిసాన్ యాత్రలను అప్పటినుంచి సాగించడం పరిపాటి అయింది. కిసాన్ ప్రచారకుల, సంఘాల కోర్కెలను రివెన్యూ ఉద్యోగులు సైతం జాగ్రతగా తెలుసుకుంటూ, నెరవేరుస్తూ వచ్చారు!

ఇచ్ఛాపురం మొదలు మద్రాసు వరకు జరిగిన బ్రహ్మాండమైన కిసాన్ యాత్ర చాలా ప్రధానమైనది. ఇది రాజాజీ కాంగ్రెస్ ప్రధానిగావున్న రోజులలో జరిగిన యాత్ర. ఈ యాత్రలు జరపడంతో తృప్తిపడి వూరుకోనక మన ప్రాచీన గ్రామ స్వయంపరిపాలనా సంప్రదాయాలను పునరుద్ధరించడానికి సైతం కిసాన్ కాంగ్రెస్ సంఘాలు పూనుకొన్నవి. గుంటూరు జిల్లాకి కిసాన్ కాంగ్రెస్ లోనే గ్రామపంచాయితుల సంఘాన్ని ఒకదాన్ని స్థాపించి పనిచేయడం ప్రారంభించింది. నేను, నా కార్యదర్శి పి. వి. నరసింహారావు కలసి గుంటూరు జిల్లాలో వున్న మొత్తం 960 గ్రామాలలో 700 పంజాయతులను స్థాపించ గలిగాము. దాదాపు ప్రతిగ్రామానికీ ఒక్కొక పంచాయితీని ఇవ్వగలిగామన్నమాట. రైతుల వద్ద ప్రభుత్వం వసూలుచేసే భూమిశిస్తులో రూపాయికి అర్థణావంతున ప్రభుత్వం గ్రామ పంచాయితీలకు ఇచ్చే ఏర్పాటుకూడా చేశాము. ఇప్పటివరకూ గ్రామంనుంచి ప్రభుత్వ ఖజానాకు డబ్బు అనేక మార్గాల ప్రవహించడమేగాని, ఆ గ్రామ ప్రజల అవసరాల నిమిత్తం దాన్ని ఉపయోగించడమంటూ లేనిపద్ధతిని ఈ విధంగా కొంత వరకు మార్పు చేయగలిగాము. అనేక గ్రామాలలో రస్తాలు, చిన్నచిన్న వంతెనలు, చెరువులు, బావులు, పంచాయితీల ద్వారా వేయించడానికి వీలైంది. ఈ నిర్మాణము లన్నిటికీ దాదాపు 7 లక్షల రూపాయలు వ్యయమై వుంటుంది. ఇందులో ప్రభుత్వం సగభాగం ఇచ్చి సహాయపడ్డది. మిగత సగభాగాన్ని గ్రామస్థులే భరించారు.

పశ్చిమగోదావరిజిల్లాలోకూడా ఇదే మాదిరి ప్రయత్నాలు జరిగినవి. శ్రీ వడ్లపట్ల గంగరాజుగారు, కీర్తిశేషులు ఎస్. సుబ్బరావుగారు ఈ జిల్లా కార్యక్రమ నిర్వహణలో సహాయపడ్డారు. తూర్పుగోదావరి జిల్లాలో నరసింహదేవర సత్యనారాయణగారు, అనంతపూర్ జిల్లాలో వి. ఆర్. రావుగారు ప్రశంసనీయమైన కృషి చేశారు. ఆనాడుచేసిన కృషి ఫలితంగా గ్రామ పంచాయతీలు నేడు అనేక విధాల స్వతంత్రించి కార్యనిర్వహణం సాగిస్తున్నవి. రాష్ట్రంలోని అనేక జిల్లాలలో ఇవి ఏర్పడి పౌర వ్యవహారాలను సర్దుబాటు చేస్తున్నవి.

యుద్ధ సమయంలో అడ్వయిజర్ల ప్రభుత్వం ఈ పంచాయతీలను గ్రామోద్యోగుల అధ్వర్యంకిందికీ, ప్రభుత్వోద్యోగుల యాజమాన్యంకిందికీ మార్చడానికి ఉద్దేశించింది. అప్పుడు అఖిలభారత కిసాన్ కాంగ్రెస్ అధ్యక్షురాలుగా పనిచేస్తున్న శ్రీమతి భారతీదేవి ప్రత్యేక సమావేశం ఒకటి జరిపి పంచాయితులను ఈ విధంగా మార్చడంకూడదని తీవ్రమైన ఆక్షేపణను తెలియజేసింది. వీటిని ప్రభుత్వోద్యోగుల అధీనానికి మార్చడం పూర్తిగా ప్రజాసామ్య సిద్ధాంతాలకు విరుద్ధమని హెచ్చరిక చేసింది. కర్షక జన ఉపయోగం నిమిత్తం సహకార సంఘాలను స్థాపించడంకూడా కిసాన్ కాంగ్రెస్ ఉద్యమ లక్ష్యాలలో ఒకటి. సహకార బ్యాంకులను, సహకార మార్కెటింగ్ ఫెడరేషన్లను, భూమితనఖా బ్యాంకులను, కోఆపరేటివ్ స్టోర్లను, 'కంసాలిడేషన్ సొసైటీలను' స్థాపించటంలో కిసాన్ ప్రచారకులు చాలా శ్రద్ధవహించారు. ప్రపంచ యుద్ధం వచ్చి సహకారోద్యమానికి మంచి అగత్యం,అవకాశం కలిగించింది. యుద్ధావకాశాన్ని తీసుకొని రైతాంగంతో సహకారోద్యమ ప్రచారానికి పూనుకున్నాము.

సహకార వ్యవసాయ విధానాన్నికూడా మేము మొదటినుంచీ బలపరుస్తూనే వచ్చాము. భూవసతిలేని కర్షకుల సహాయార్థం 'సహకార భూసంఘాలను' సైతం స్థాపించాము. ప్రభుత్వంవారి పోరంబోకలను, ప్రైవేట్ భూములను ఇట్టి కర్షకులకు ఇప్పించి సహాయపడ్డాము.

కర్షకులలో స్వయం సహాయసిద్ధాంత ప్రయోజనాలను ప్రచారంచేశాము. రాష్ట్రంలో ఆహారధాన్యాలను, కాయకూరలను సమృద్ధిగా పండించేటట్లు చూడడానికి ఈ ప్రచారంద్వారా పూనుకున్నాము. మన కర్షకుల ముఖ్యావసరాలలో నీటిపారుదల సౌకర్యం (ఇర్రిగేషన్) ఒకటి. ఒక్క గుంటూరుజిల్లాలోనే ఆరుసంవత్సరాలపాటు తీవ్రమైన కృషిచేసి దాదాపు 65 వేల ఎకరాల భూమిని ఇట్టి సాగుబడి కిందికి వచ్చేటట్లు చేయగలిగాము. ఇర్రిగేషన్ స్కీములన్నిటినీ జాగ్రతగా పరిశీలించడానికీ, వాటిని ప్రభుత్వం వెంటనే మంజూరుచేసేటట్లు చూడడానికీ కిసాన్ ఉద్యమానికి ఇంజనీర్ల సహాయం ఎంతైనా అవ

సరం. ఇంగ్లండు, డెన్మార్కు, స్వీడన్ మొదలైన దేశాలలో కర్షకసంఘాలవారు ఇట్టి ఇంజనీరింగ్ నిపుణుల సహాయాన్ని పొంది తమ కార్యక్రమాన్ని సఫలీకృతం చేసుకుంటున్నారు.

తుంగభద్ర, సంగమేశ్వరం, రామపాదసాగరం ప్రాజెక్టుల పని వెంటనే ప్రారంభంకావడం అవసరమని ఆంధ్రా కిసాన్ కాంగ్రెస్ ఎన్ని రోజులనుంచో ఆందోళనచేస్తూ వచ్చింది. ఎలాగైతేనేమి చివరకు ప్రభుత్వం తుంగభద్ర రామపాదసాగర ప్రాజెక్టుల పనిని ప్రారంభించింది.

మన కిసాన్ ఉద్యమచరిత్రను చెప్పవలసి వచ్చినప్పుడు అమరజీవి శ్రీ పుల్లెల శ్యామ్‌బాబు పేరును, ఆయన ఉత్తరవిశాఖజిల్లాలో చేసిన అమోఘ కృషినీ ప్రస్తావించకుండా ఎవరూ వుండలేరు. నాగావళీ, వంశధార, మహేంద్రతనయ ప్రాజెక్టుల నిర్మాణం నిమిత్తం ఆయన విధీ విరామం లేకుండా ఆందోళన చేశాడు. వీటిని ప్రభుత్వం ఇప్పటికీ ఆలోచించవలసి వున్నది.

రాయల సీమలోవున్న రకరకాల మేజర్ మైనర్ ఇర్రిగేషన్ ప్రాజెక్టుల నిర్మాణం నిమిత్తం, అభివృద్ధి నిమిత్తం కోటిరెడ్డి, ఓబులరెడ్డి, బాలిరెడ్డి గార్లుకూడా నిరంతరం ఆందోళన చేస్తూనే వున్నారు. ఒకానొకప్పుడు రత్నాలసీమగావుండి, ఇప్పుడు రాళ్ళసీమగా పరిణమించిన ఈ దౌర్భాగ్య మండలాల ఇర్రిగేషన్ సౌకర్యాల విషయానికి ప్రభుత్వం ప్రథమస్థానం ఇవ్వడం అవసరం.

మనరాష్ట్రి ఆటవిక సంపదరక్షణ, అభివృద్ధినిమిత్తము పశుసంపదరక్షణ నిమిత్తముకూడా ఆంధ్రరాష్ట్ర కిసాన్ కాంగ్రెస్ సర్వదా కృషిచేస్తూ వున్నది.

శ్రీ చేగిరెడ్డి బాలిరెడ్డిగారు 1938లో కంభంలో ఆంధ్రరాష్ట్రి ఆటవిక రైతుల మహాసభను ఏర్పాటుచేసి ప్రభుత్వానికి ఒక పెద్ద నివేదికను పంపించారు. మోటారు లారీలు నడపడానికి పెట్రోల్ లేనికారణాన బొగ్గు అవసరమయేసరికి ప్రభుత్వమే కంట్రాక్టర్ల ద్వారా అడవులను నాశనం చేయించ బూనుకునేసరికి కిసాన్ కాంగ్రెస్ ఆ అపభ్రంశపు చర్యను సక్రమమైన ఆందోళన ద్వారా అరికట్టగలిగింది. దేశపశుగణ రక్షణ విషయంలో అభినవ సహదేవ డా॥ ఏకెళ్ల శ్రీరాములుగారి సేవా సహాయాన్ని అందరూ హర్షించక, అభినందించక తప్పదు. రాష్ట్రి కిసాన్ కాంగ్రెస్ యాజమాన్యాన ఇప్పటికి ఎన్నో పశు ప్రదర్శనాలనుసైతం ఏర్పాటుచేశాము. మేము మా కార్యక్రమంలో నూలు వడకడానికి, నేతను, చేతి పనులు, గ్రామీణుల కళలు అభివృద్ధి చేయడానికి కూడా విశేష ప్రాధాన్యంఇచ్చి పనిచేస్తున్నాము.

ప్రస్తుతం అమలులో వున్న భూమిశిస్తువిధానం లోపభూయిష్టంగా వున్నదనీ, దీన్ని రద్దుచేయడం అవసరమనీ, వ్యవసాయాన్నికూడా ఒక పరిశ్రమగానే ఎంచి, మామూలు ఆదాయపు పన్నువిధించినట్లే వ్యవసాయాదాయంమీదకూడా పన్నును ఒక పద్ధతిలో విధించాలనీ, రికార్డులు వుంచడానికీ రీసర్వే చేయించడానికీ అయే ఖర్చులనుమాత్రమే రైతులవద్ద వసూలుచేయడం అవసరమనీ ప్రచారాన్ని లేవదీశాము. ఇది ఒక విధంగా కొత్తపోకడే అయినప్పటికీ తిరువాంకూరు, పంజాబు ప్రభుత్వం ఈ పద్ధతినే అనుసరిస్తున్నది. 1937 లో ఏర్పడిన మొదటి కాంగ్రెస్ ప్రభుత్వం ఆంధ్రుల అభిమాన నాయకుడు ప్రకాశంగారి పోద్బలంవల్లా, పోత్సాహంవల్లా భూమిశిస్తులో 75 లక్షల రూపాయల వరకూ రెమిషన్ మంజూరు చేసింది. రైతులు భరిస్తున్న పన్నుల భారాన్ని తగ్గించడానికి యావద్భారతదేశంలోనూ ఏరాష్ట్ర ప్రభుత్వమూ ఇప్పటివరకూ సంతృప్తికరమైన ఒక పద్ధతిని సూచించలేదు. యుద్ధం సాగిన రోజులలో అడ్వయిజర్ల పరిపాలనకింద రైతులు అనేక అదనపు పన్నులను భరించవలసివచ్చింది. పన్నుల రూపంలో ఓపినంత ధనంవస్తూంటే, ఏ ప్రభుత్వమైనప్పటికీ చూస్తూ చూస్తూ దాన్ని పోగొట్టుకోడానికి ఇష్టపడదు.

యుద్ధంవల్ల జీవితావసరాల ధరలు విపరీతంగా పెరిగిపోయి, ధాన్యం ధరమాత్రం తదనుగుణంగా పెరగని కారణంచేత మన రైతాంగం అనేక దుర్భర పరిస్థితులను ఎదుర్కొనవలసివచ్చింది. నేటికీ ఎదుర్కొంటున్నది. ధాన్యానికి సవ్యమైన ధరలుపెంచి రైతు దుర్భరస్థితిని తొలగించవలసిందనీ, అతడి జీవన ప్రమాణాన్ని పెంచడానికి దోహదంచేయవలసిందనీ ఎంత కోరినా కేంద్రం

లో జాతీయ ప్రభుత్వం వున్నప్పటికీ ప్రయోజనం లేక పోతున్నది. ఇంతేగాక సైన్యానికి ఆహారం సప్లయి చేయడానికిగాను పాడిపశువులను, ఎద్దులను వధించి, మన పశుసంపదను క్షీణింపజేశారు. ఈ కారణంచేత ఇప్పుడు ఏపశువు ధరచూడబోయినా విపరీతంగా పెరిగిపోయింది. ఇందువల్ల వ్యవసాయానికి కావలసిన ఖర్చుకూడా పెరిగింది. దీని నివారణకు కేంద్రశాసనసభలో ఎంత కృషి చేసినా రక్తికి రంగానికీ రావడంలేదు.

యుద్ధకారణంగా మనకు ఆహారధాన్యాల లోటు కూడా విపరీతంగా వచ్చిపడింది. ఈ కష్ట పరంపరనుంచి మన రైతాంగాన్ని గట్టెక్కించడానికి రాష్ట్రకిసాన్ కాంగ్రెస అహర్నిశలూ శక్తివంచన లేక కృషిచేస్తున్నది.

మనం సాగిస్తున్న ఆంధ్రోద్యమానికి ఆంధ్ర రైతాంగం ఎంతైనా ఋణపడి వున్నదని చెప్పవలసి వుంటుంది. ఆంధ్ర రైతాంగాన్ని ప్రప్రథమంగా రాజకీయ రంగంలోకి తెచ్చిన ఉద్యమం ఆంధ్రోద్యమమే. మనం ప్రత్యేక రాష్ట్రాన్ని సాధించగలిగినట్లయితే, తమకు విశేష ప్రయోజనం వున్నదనే విషయం ఆంధ్ర రైతాంగానికి తెలుసు. ప్రత్యేకరాష్ట్రం వస్తేనేగాని తాము తమపాత్రను సర్వతోముఖాభివృద్ధికరంగా నిర్వహించడానికి వీలుండదనే సంగతిని మన రైతులు అవగాహన చేసుకున్నారు. మన రాజకీయ, శాసనసభా వ్యవహారాలన్నిటినీ స్వచ్ఛమైన మన తెలుగుభాషలోనే జరుపుకోవడం ప్రారంభించినట్లయితే, రాజకీయ సామాజికవ్యవస్థా నిర్మాణంలో మన రైతులు ఆంగ్లభాషవచ్చిన ఏ కొద్దిమంది పైనో ఆధారపడవలసిన అగత్యం వుండదు. మాతృభాషలోనే వ్యవహారాలన్నిటినీ జరుపుకొంటే రాష్ట్రాభ్యున్నతికి రైతులూ దోహదం చేయడానికి అవకాశం ఏర్పడుతుంది. 'కిసాన్ మజ్దూర్ ప్రజారాజ్య స్థాపనకు రాష్ట్రసిద్ధి అత్యధికంగా సహాయపడేమాట వాస్తవం. తెలుగు భాష మాట్లాడే ప్రజల ప్రాంతమంతా ఏకఖండంగా వున్నది. ఈ ప్రాంతాన్ని ఒక రాష్ట్రంగా ఏర్పాటు చేసినట్లయితే, ఆంధ్రప్రజలలో ప్రజా స్వామ్యభావాలు అభివృద్ధి కావడానికి వీలవుతుంది. అందువల్ల ఆంధ్ర రైతాంగం ఆంధ్రరాష్ట్ర సాధనోద్యమాన్ని సర్వదా హృదయ పూర్వకంగా బలపరుస్తూనే వుంటుంది; దాని సాధనకు శక్తి కొద్దీ సహాయపడుతూనే వుంటుంది.

ఆంధ్రదేశంలో రైతు ఉద్యమచరిత్రను చెప్పవలసి వచ్చినప్పుడు, 1920 సంవత్సరంలోనే రైతులు అవిపుల్లరికట్ట నవసరంలేదని ప్రబోధించి, సత్యాగ్రహం సాగించిన మన సర్దార్ గొల్లపూడి సీతారామశాస్త్రి, ఉన్నవ లక్ష్మీనారాయణగార్లను అభినందించకుండా వుండలేము.

అప్పుడు పల్నాటి సత్యాగ్రహంలో బ్రిటిష్ తుపాకీ గుండ్లకు గురియై ప్రాణార్పణచేసిన వీరకుమారుడు మన హనుమంతుని స్మరించకుండా వుండలేము.



# నిజాం రాజ్యము - ఆంధ్ర నాగరికత

మొహమ్మద్ కాసింఖాన్, ఎం.ఎ.

ఉత్తర సర్కారులు దత్తమండలాలు బ్రిటిషువారి వశం కాకపూర్వం ఆంధ్ర భూభాగమంతా నిజాంప్రభువుల పాలనక్రింద ఉండేది. అంతకుపూర్వం గోల్కొండ రాజులు ఆంధ్రదేశాన్ని పరిపాలించారు. శాతవాహన సామ్రాజ్యం పతనమైనపిదప ఆంధ్రదేశం సంపూర్ణంగా ఏకచ్ఛత్రాధిపత్యంక్రింద ఉన్నది. ఈ రెండుకాలాల్లో నే కాకతీయుల రాజ్యంలో ఇప్పటి దత్తమండలాలు లేకుండెను. అట్లే విజయనగరం సామ్రాజ్యంలో తెలంగాణం ఎన్నడూ ఒక భాగంగాలేదు.

గోల్కొండ ప్రభువులు, నిజాము ప్రభువులు ముసల్మానులైనా ఆంధ్రులను, ఆంధ్రమతమును, ఆంధ్ర సంస్కృతిని గౌరవించి పోషించారు. గోల్కొండ నవాబులకాలంలో అక్కన్న మాదన్నలు రాజ్యానికి భుజాలవలె ఉండేవారు. తానిషాకాలంలో గోపరాజుగారు కట్టిన భద్రాచల దేవాలయానికి నాటినుండి నేటి వరకు అవిచ్ఛిన్నంగా ముస్లింప్రభువులే పోషకులుగా ఉంటూవచ్చారు. సంవత్సరమునకు 25 వేల రూపాయలు ఈ దేవాలయానికి నేటికీ నిజాంప్రభువులు ఇస్తారు. అంతేకాక గోల్కొండ ప్రభువులు, వారి సర్దారులు ఆంధ్రభాషను పోషించినట్లు ఇటీవల బయల్పడిన అనేక గ్రంథములవల్ల తెలుస్తున్నది. ఆంధ్ర కవితాపోషకుడుగ మలిక్ ఇబ్రాహీము (మల్కిభరాము) సుప్రసిద్ధుడు. గోల్కొండ ప్రభువు గురువగు ఒక ముస్లిం యోగీశ్వరుడు రచించిన శృంగార మంజరి అను ఆంధ్రలక్షణ గ్రంథానికి



గాజుల బండవద్ద బయటపడిన శిథిలాలు.

సంస్కృతానువాద మొకదానిని మద్రాసు విశ్వవిద్యాలయ సంస్కృతాచార్యులైన డాక్టర్ రాఘవన్‌గారు కనిపెట్టారు. అదేవిధంగా నిజాం ప్రభువుకూడా ఆంధ్ర దేశంపట్ల అవిరళానురాగం చూపిస్తూవచ్చారు. ఉస్మానియా విశ్వ విద్యాలయంలో ఆంధ్రాచార్య పీఠాన్ని స్థాపించారు. ఆంధ్రవిశ్వ విద్యాలయంలోకూడా ఆంధ్రాచార్య పీఠానికి ఇక్కడున్నంత గౌరవంలేదు. అనేక లక్షలు వెచ్చించి వేలకొలది తాళపత్ర గ్రంథాలు సేకరించి ఆంధ్ర సంస్కృతికి అమూల్యమైన సేవచేశాయి. ఉస్మానియా విశ్వవిద్యాలయంలో ఉన్న తాళపత్ర గ్రంథశాఖ చూడదగినది. కాకతీయులనాటి ప్రాచీన దేవాలయాలను పునరుద్ధరించారు. వాటిలో ఓరుగల్లు సహస్రస్తంభ దేవాలయం, పానుగల్లు, పాలంపేట దేవాలయాలు సుప్రసిద్ధమైనవి. భూగర్భంలో శతాబ్దములనుండి మాటుమణగియున్న ఆంధ్రనగరముల నిప్పుడు శ్రీ నిజాం ప్రభుత్వపు ఆర్కియాలజీ శాఖవారు త్రవ్వితీస్తున్నారు. నిజాం రాష్ట్రంలో ఆంధ్రులకు ఉజ్జ్వలమైన భావి వున్నది.

ఆంధ్ర చారిత్రక పరిశోధకులు నిజాంరాష్ట్రాన్ని ఎక్కువగా సంస్కరించగోరిరి. నిజాం రాష్ట్రంలోని ఔరంగబాదు జిల్లాయందలి పైఠాన్ లేక ప్రతిష్ఠానపురమును రాజధానిగా చేసుకొని ఆంధ్ర శాతవాహనులు పడమట కచ్ఛి మొదలు గోదావరకు, తూర్పున కళింగము మొదలు కావేరీ సంగమంవరకు, మధ్య పరగణాలు మొదలు మైసూరువరకు గల సమస్త దేశాన్ని పరిపాలించారు.

మౌర్య సామ్రాజ్యకాలంనుండీ ఆంధ్రులు దక్షిణాపథంలో ప్రముఖజాతిగా పరిగణింపబడుతూ వచ్చారు. శాతవాహన సామ్రాజ్యస్థాపనానికి పూర్వమే ఆంధ్రులకు 30 పెద్ద నగరము లుండెడివని ప్లినీ వ్రాశాడు. ఈ నగరాలు కృష్ణా గోదావరీ నదులమధ్య ఉన్నట్లుగా గ్రీకు రాయబారి తెలిపాడు. ఇది దాదాపు రెండువేలేండ్లమాట. ఇంత ప్రాచీన నగరం ఇప్పుడెక్కడాలేదు. ఇవన్నీ భూగర్భంలో మాటుమణిగి ఉంటాయి. వీటిని త్రవ్వి బయటకుతీస్తేనేగాని ఆంధ్రసామ్రాజ్య చరిత్ర,



స్టుకోలో తల.

ఆంధ్ర నాగరికత చరిత్ర పూర్తిగా బయటపడేది. ఇది ఎక్కువగా గోదావరీ కృష్ణా నదీముఖాలమధ్య సముద్ర తీరాన్ననుసరించియు, నిజాంరాష్ట్రంలో ముఖ్యంగా తెలంగాణ ప్రాంతములందును ఉండియుండాలి. అప్పటి ఆంధ్రదేశంలో నేటి సమస్త నిజాంరాష్ట్రమూ, మధ్య పరగణాలయందలి ఎక్కువభాగం కలిసివుండేది. అందుచే నేటి నిజాంరాజ్యం నిజంగా ఆంధ్రదేశానికి హృదయ ప్రాయమైనది. ఆంధ్ర నాగరికతా చరిత్ర సమగ్రంగా తెలుసుకోవాలంటే నిజాంరాజ్య హృదయం విప్పి చూడాలి.

ఆంధ్రచరిత్ర ఇంకా నిర్మాణదశలో వున్నది. దానికి కావలసిన పూర్తి పరికరాలు బయటపడవలసి ఉన్నాయి. అవి ఎక్కువగా నిజాంరాజ్య భూగర్భంలో నిక్షిప్తమై వున్నాయని చెప్పడం అతిశయోక్తికాదు.



సున్నపురాతి చెక్కడము

నిజాం రాజ్య ఆర్కియాలజీ శాఖ ఎల్లోరా అజంతా గుహాలయాలను భద్రపరచుటలోను, పైకి కన్పిస్తూ శిథిలావస్థలో వున్న ప్రాచీన దుర్గాలు దేవాలయాలు మాత్రం ఉద్ధరించుటలోను కాలం ఎక్కువగా వినియోగించింది. ఆరేండ్ల క్రిందటివరకు భూపరిశోధన ఎక్కువగా చేయనేలేదు. 1941 లో ఆర్కియాలజీశాఖ సహాయాధ్యక్షులైన ఖాజా మొహమ్మద్ అహమద్ గారు హైదరాబాదు నగరానికి 41 మైళ్ల దూరంలో కొండాపురమను ప్రదేశమున శాతవాహనకాలపు ఒక ప్రాచీన ఆంధ్ర నగరమును కనిపెట్టారు. కొండాపురము తర్వాత గత ఆరు సంవత్సరములలో శ్రీ ఖాజా సాహెబ్ గారి కృషి ఫలితంగా మరిరెండు ప్రాచీనాంధ్ర నగరములు పణిగిరి, గాజులబండ అను ప్రదేశములలో బయల్పడ్డాయి. ఈ కృషి ఇట్లే సాగిస్తే ప్లినీ పేర్కొన్న వాటిలో పది పదిహేను పట్టణాలు తెలంగాణంలో బయల్పడవచ్చును.

ఈమూడు పట్టణములు సుమారొకే యుగానికి చెందినవని చెప్పుటకు అక్కడ లభించిన వస్తువులే

ప్రమాణం. ఈశిథిలములలో లభించిన విగ్రహములు, నాణెములు, ముద్రలు, అందమైన మృత్పాత్రలు, పనిముట్లు నగలు ఓకేయుగమును సూచిస్తున్నవి.

కొండాపూరులో ఆంధ్ర శాతవాహన రాజగు పులుమావి నాణెములు లభించెను. ఇవికాక క్రీ. శ. ఒకటి రెండు శతాబ్దములనాటి పెక్కు నాణెములు లభించెను. రోమక్ నాణెముల ననుసరించివేసిన నాణెములుకూడ దొరకెను. దీనినిబట్టి ప్రాచీనాంధ్రులు రోమనులతో వర్తకవ్యాపారాలు విరివిగా సాగిస్తూ వుండేవారని స్పష్టమౌతుంది. ఈ నాణెములు కొన్ని రాగివి; కొన్ని సీసముతో చేసినవి; మరికొన్ని ఒకవిధమైన లోహ మిశ్రమముతో చేసినవి. వీటన్నిటిపైనను బ్రాహ్మీ అక్షరములు కలవు. బ్రాహ్మీ అక్షరములు కలిగి, స్వస్తికా చిహ్నము గల ఒక ముద్రకూడ లభించింది.

మంచి పనితనముగల ఇనుప పనిముట్లుకూడ ఇక్కడ దొరకెను. బంగారు నగలకు గుంత్రిన చిన్న పూసలు కలవు. ఎనామెల్ పూతగల యమునా రాతిపూసలు కూడ పుష్కలముగ నున్నవి.

తొమ్మిది అడుగుల చుట్టుకొలతయు, మూడడుగుల ఎత్తుగల కడవ యొకటి ఇందు దొరికిన వస్తువులలో ముఖ్యమైనది. దీనిపై మంచి నగిషీపని చేసియున్నది. ఇన్నాళ్ళ తర్వాతకూడ దీని మెరుగు చెడలేదు.

కొండాపూరు, పాణిగిరి, గాజులబండ - ఈ మూడు పట్టణాల్లోను ఒకేవిధమైన ఇటుక ఉపయోగించబడినది. దీనికొలత 24″ × 12″ × 3″. మూలలలో 20″ × 20″ × 3″ కొలతలుకల చదరంగపు ఇటుక లుపయోగింపబడినవి.

ఫణిగిరి నల్లగొండజిల్లాలో ఒక గ్రామములో రెండు న్నరసంవత్సరాల క్రిందట ఈపట్టణ శిథిలములు కనిపెట్టబడెను. ఫణిగిరిలో కొండాపూరులోవలె క్రీ. శ. ఒకటి రెండు శతాబ్దములకు చెందిన ఆంధ్రనాణెములు విరివిగ లభించెను. అంతేకాక పశ్చిమ క్షాత్రపుల నాణెములు కూడ దొరకెను.

ఫణిగిరికి పదిమైళ్ళ చుట్టుకొలతలో నాగవరము, వర్ధమానకోట, సింగారము, గాజులబండ అను ప్రాంతములలోకూడ ఇట్టి శిథిలములే భూస్థాపితమై యున్నవి. ఫణిగిరికి నాల్గుమైళ్ళ దక్షిణమున నాగవరము, దానికి ఐదుమైళ్ళదూరమున ఆలేరు నదితీరమున వర్ధమానకోట, దానికి నాల్గుమైళ్ళదూరమున సింగారము కలవు.

గాజులబండ ఫణిగిరికి మూడుమైళ్లదూరమున కలదు. ఇది జనగామ రైల్వేస్టేషను నుండి సూర్యాపేటకు పోవు రోడ్డుపై 29 వ మైలురాయివద్ద చీలిన నాటుదోవను ఒక మైలుదూరముపోగా నున్నది. ఫణిగిరిలో వలెనే ఇక్కడకూడ ఏనుగు ముద్రయు, స్వస్తికా చిహ్నమును కల నాణెములు లభించెను. ఇక్కడ లభించిన కుండ పెంకులపైగల లిపి క్రీ. శ. ఒకటి రెండు శతాబ్దములకు చెందినదని నగర ప్రభుత్వ ఆర్క్యాలజీశాఖ జాయింటు డైరక్టర్ జనరలుగనున్న ఎన్. పి. చక్రవర్తిగారు నిశ్చయించిరి. రాతితో చేసిన చక్కని విగ్రహములు, మంచి నగిషీపనిచేసిన కుండలు, తెల్లరాతిలో చెక్కిన అద్భుతమైన శిల్పసంపద ఇక్కడ బయల్పడినవి.

కొండాపూరు, ఫణిగిరి, గాజులబండ ప్రాంతములలో పరిశోధనలు జరుగుచున్నవి. వీటితోపాటు నాగవరం, వర్ధమానకోట, సింగారము, తత్పరిసరములు శోధించవలసి యున్నవి. సర్ జాన్ మార్షల్ కుగాను, సర్ ఆరెల్ స్టీనునుగాని, అట్టి అనుభవముగల మరొక నిపుణునిగాని రప్పించి ఈ ప్రాంతమును, శోధింపించవలసి యున్నది. ఇటీవల వరంగల్లుజిల్లాలో నాయల కొండపల్లి, మల్లవరము అను గ్రామములలో ఇట్టి శిథిలములు పొడగట్టెను. పైఠాన్ మొదలు వరంగల్లు సరిహద్దులవరకు ఇట్టి పెక్కు పట్టణములు లభించగలవు. ఈ పరిశోధనలు పూర్తియైనపిదప ఆంధ్రచరిత్ర తిరిగి వ్రాయవలసి వచ్చునని నాయూహ.

# ఆంధ్రదేశ పారిశ్రామిక సంవర్ధనము

డా॥ బి. వి. నారాయణస్వామి నాయుడు, ఎం.ఏ. బి.కామ్., పి.ఎచ్‌డి., బారిష్టర్.



యుద్ధానంతరము దేశసౌభాగ్య పునర్నిర్మాణమునకు కావలసిన ప్రణాళికలు అనేక దృష్టికోణముల నుండిన్ని బహుముఖముల నుండిన్ని ఆలోచించవచ్చును. దేశమందలి పరిస్థితులనుబట్టిన్ని దేశబహిస్థితులను బట్టిన్ని ఆలోచించ వచ్చును; శాస్త్రదృష్టిని బట్టిన్ని అధికార దృష్టిని బట్టిన్ని ఆలోచించవచ్చును; కార్యసిద్ధికి ఎక్కువ కాలముపట్టే విధానమును బట్టిన్ని శీఘ్రకాలములో నెరవేరగల విధానమును బట్టిన్ని ఆలోచించ వచ్చును. ఈ విధముగానే ఇంకా అనేకవిషయములనుబట్టి ఆలోచించవచ్చును. దేశమందలి పరిస్థితులనుబట్టి ఆలోచించ వలసినప్పుడు, ముందుగా సంకల్పించుకొన్న లక్ష్యములు, వస్తునిర్మాణవేగము మార్పుపొందవలసి యున్నది. దేశ బహిస్థితులనుబట్టి ఆలోచించినప్పుడు, ప్రపంచ ఆర్థిక స్థితి సాధారణ పరిస్థితికి తెచ్చుకొనుటలో తోడ్పడుటకుగాను మన ప్రస్తుత పరిస్థితులు అత్యవసరముగా కావలసిన వస్తుసామగ్రి మొదలయిన విషయము లాలోచించి ఇతరదేశములతో మనము ఎట్టి సంబంధము సమకూర్చుకోవలెనో నిర్ణయించుకోవలెను. శీఘ్రకాల ప్రణాళిక విషయంలో యుద్ధమువలన వ్యాప్తిచెందిన పరిశ్రమల భావి పరిస్థితులు ఎట్లుండునో చూచుకోవలెను. దీర్ఘకాల ప్రణాళిక విషయంలో సమీకృత దేశీయార్థికము పరిశీలించవలెను.

దీనితర్వాత ఎక్కువ ముఖ్యమైన విషయము ఏమంటే: పరిశ్రమల అభివృద్ధికి అనుకూలములయిన ప్రదేశములను పరిశీలించి నిర్ణయించవలెను. దేశమందు ఆర్థికసంపద ఎంతవరకు ఉత్పన్నమగుటకు సాధ్యమో అంతవరకును ఉత్పాదించవలెనన్న ఆశయముతో వివిధరాష్ట్రములందును, సంస్థానములందును సాగుతున్న పారిశ్రామికాభివృద్ధి అంతా ఏకముఖంగా పరస్పర సహకారములో సాగించవలసియున్నది. ఈ పరస్పర సహకారమునకు దేశీయ కేంద్రప్రభుత్వ సమీక్షణము కావలెను. కేంద్ర ప్రభుత్వము, రాష్ట్రముల ప్రభుత్వములు సంస్థానముల ప్రభుత్వములు అన్నీ సంప్రతించుకొని ఏకీభావము గల ఆశయములను అనుసరించి పారిశ్రామిక విధానమును నిర్ణయించుకోవలెనుగాని పరస్పర విరుద్ధములయిన విధానముల నేర్పరచుకొనుటవలన ప్రయోజనముండదు.

ఏ పరిశ్రమాభివృద్ధికి ఏ మండలము ఎక్కువ అనుకూలమయినదో పరిస్థితుల యోగ్యతనుబట్టి నిర్ణయించి ఆయా మండలములుకోరే పారిశ్రామిక సంస్థలకు తగిన సౌకర్యములను కలుగజేయవలెను; అంతేకాని ఒక ప్రదేశమందు పారిశ్రామికాభివృద్ధి అమితంగా కలిగించి మరియొక ప్రదేశములో పరిశ్రమలేవీ లేకుండా చేయరాదు. దేశమందలి పారిశ్రామికాభివృద్ధికి ఆర్థిక సంపదకు అన్ని మండలములవారున్ను తోడ్పడవలెను. అంటే, వివిధ మండలములకును పరస్పర సహకారముదయింపజేయుటే కాని పోటీకలిగించటంకాదు ఉద్దేశము. ఈ ఆశయము సర్వసాధారణముగా అనుసరించవలెనుగాని కొన్ని ఎక్కువ అనుకూలమైన స్థలములలో అనుకూలత తక్కువగానున్న స్థలములకంటె ఎక్కువగా పరిశ్రమలు సాగించక తప్పదు. అట్టి స్థలములకు ప్రాధాన్యమిచ్చి తీరవలెను. యుద్ధసమయమందు సంగ్రహించిన మూలధనము ఎట్లు ఏయే ప్రాంతములకు సద్దుబాటు చేయవలెనో నిర్ణయించుటకు నియమితులయిన అధికార వర్గమువారు వివిధమండలముల పరిశ్రమల పంపకమునకును కావలిసిన ప్రణాళిక విధానము నిర్ణయించినారు. దీనినిబట్టి దేశమందన్ని మండలములలోను యథోచితముగా పరిశ్రమలకు వలయు ఆర్థిక సాహాయ్య విభాగము జరిగి ఇదివరకుండిన ఎక్కువ తక్కువలు తగ్గి సమత ఏర్పడవచ్చు.

ఆంధ్రదేశము ఇంతవరకును పారిశ్రామిక సంపద విషయములో వెనుక బడియున్నది. అంతర్గతంగా మూలపడియున్న ఆర్థిక సంపద బహిర్గతమై ప్రయోజనకారియగునట్లు చేసికొనగల సమర్థత విషయమాలోచించిన యెడల ఈమండలము పారిశ్రామికాభివృద్ధి జరిపించుటకు ఎక్కువ అర్హతగలదని చెప్పక తప్పదు. ఆంధ్రదేశములో 11 జిల్లాలు 2 మన్య ప్రదేశములు కలవు. సర్కారు జిల్లాలు అనే పేరుగల సముద్రతీర ప్రదేశము కృష్ణా గోదావరీ నదులవల్ల సస్యప్రదమైన ప్రదేశము. దత్తమండలము అనే పేరుగల రాయలసీమ భూసారము తక్కువయిన మరుప్రదేశము; తరుచుగా క్షామములకు నిలయమయినది. మన్య ప్రదేశము ఆంధ్రమండల మందలి అడవినేలలు గల భాగము.

కార్షిక ఖనిజారణ్యకములయిన ఆర్థిక సంపదలకు తగిన సాధన సంపత్తి ఈ మండలములో ఎక్కువగా ఉన్నదిగాని దీనిని బయటకుతీసి వినియోగించుటకు కావలసిన సక్రమ శాస్త్రీయ పరిశీలనము కావించుటకు ప్రభుత్వము వారుగాని ఇతర సంస్థలు వారుగాని పూను కొనలేదు. ఇదియొక గొప్పలోపము. భూమి పరిశీలనము సక్రమ శాస్త్రీయ పద్ధతిని గావించ వలసినదని ఆర్థిక పారిశ్రామిక శాస్త్రవేత్తలు అనేక పర్యాయములు ఘోషిస్తూవచ్చారు.

ఇండియా ప్రభుత్వమువారు నియమించిన దేశాభివృద్ధి శాఖకూడ ఈ విషయమే ప్రభుత్వమువారికి నచ్చచెప్పినది. ఆ శాఖయైనా ఇప్పుడులేదు. ఈయభివృద్ధికి కావలసిన లెఖ్ఖలు, పట్టికలు లేకుండ ఏపని ప్రారంభించుటకు సాధ్యముగాదు. ఈ పనికోసము ఒక వుద్యోగశాఖ శాస్త్రజ్ఞులతో ఏర్పడినది దేశములో లేకపోవడం ఒక గొప్ప దౌర్భాగ్యం. అందుచేత ఈ ఆంధ్రమండలంలో కార్షిక, ఖనిజారణ్యక, సంపదకు గల సాధనసామగ్రిని పరిశీలించు పని యిప్పుడు మొట్టమొదట కావలసి యున్నది. అందుకు ప్రభుత్వమువారు సమర్థతగల వారిని నియమించి ప్రజల తోడ్పాటుతో పని సాగించవలెను. ప్రభుత్వమువారి తోడ్పాటులేకుండ కేవల ప్రజాసంస్థలవారు, యింత విపులమైన పరిశోధన కార్యము పూనుకోలేరన్న విషయము మర్చిపోగూడదు.

ఇప్పుడు మనకు తెలిసినంతవరకు దేశములో కనబడుతున్న సాధనసామగ్రి దానిని వినియోగపరచినయెడల చేకూరగల ఆర్థిక సంపద లెట్లున్నవో కొంతవరకు స్థూల దృష్టితో నిరూపించవచ్చును. ఆంధ్రదేశములో గల ఖనిజములలో ముఖ్యమైనవి విశాఖపట్టణం జిల్లాలో మాంగనీసు, నెల్లూరుజిల్లాలో జిప్సమ్, మైకా, గుంటూరుజిల్లాలో స్ఫటికశిలలుగలవని మనకు తెలుసును. సర్కారుజిల్లాలలో గల ఖనిజ సంపదకంటే రాయలసీమ జిల్లాలలో గల ఖనిజ సంపద ఎక్కువైనదనిన్ని అది బయటకు తీసే సాధన సామగ్రిబట్టి వుంటుందనిన్ని అంటున్నారు. అందుకు నిదర్శనంగా కర్నూలుజిల్లాలో సున్నపురాయి కడపజిల్లాలో యాస్బెస్టాస్, బళ్లారి జిల్లాలో (Barytes) బెరైటీస్‌ను వుదహరించవచ్చును.

ఈ జిల్లాలలో పైన పేర్కొన్న ఖనిజముల పని కొంతవరకు సాగుచున్నది. గాని బయటకు తీసిన ఆ కొద్దిపాటి ఖనిజములును పైదేశములకు ఎగుమతి అవుతున్నవి. ఈ మండలమునుండి 1939 లో ఎగుమతి అయిపోయిన మాంగనీసు షుమారు 3, 75,000 టన్నులు; ఒకకోటిరూపాయలు విలువగలవి.

ఈ ఆంధ్రదేశంలో అభ్రకము (మైకా) ప్రధానంగా నెల్లూరుజిల్లాలో వుత్పన్నమౌతున్నది. ఈ అభ్రకపు వుత్పత్తికి, ఇండియా ప్రధానస్థానమును ఆక్రమించుకొని యున్నది. అందులో బీహారు ప్రధానస్థానమును, నెల్లూరు దాని తరువాత రెండవస్థానమును ఆక్రమించుచున్నవి. ప్రపంచమందలి అభ్రకపు వుత్పత్తిలో (8/4) ముప్పాలు ఇండియాలోనె గలదు. అభ్రకము విద్యుచ్ఛక్తికి సంబంధించిన యంత్రసామగ్రికిని, అభ్రకముతో తయారు కాగల పరిశ్రమలకును ఎక్కువగా వుపచరించుటవలన అభ్రక పరిశ్రమలకు భావికాలంలో ఎక్కువ ప్రాధాన్యము కలుగును. ఇప్పుడు ఎక్కువగా అభ్రకము భారత దేశమునుండి ఎగుమతి అయిపోతున్నను యిందుకు అనేక రెట్లు ఎక్కువగా దేశములో వుత్పన్నమగుటకు అవకాశము కలదు. 1939 సం॥ లో ఆంధ్రమండలమునుండి ఎగుమతియైన అభ్రకము షుమారు 26 లక్షల రూపాయల విలువగలది. మైకాగనులలోగల భూస్వాములు అందరును కలిసి ఒక సంస్థగా ఏర్పడి పనిసాగించిన ఎడల దేశమునకు ఎక్కువ మేలు కలుగ గలదు.

ఈ విధముగనే రాయలసీమలోను ఖనిజములు గూడ ఎక్కువగా బహిర్గతములై దేశసౌభాగ్యమునకు తోడ్పడ గలవు.

ఇక కార్మిక సంపద విషయంలో ఎంత అభివృద్ధి యిదివరకు జరిగినదో యింకా ఎంత జరుగుటకు సాధ్యమో పరిశీలించవలెను. 1938 సం. లెఖ్ఖలప్రకారం ఆంధ్రదేశమున 8 కోట్ల ఎకరములు వైశాల్యముగల భూమియున్నది. అందు 6 వ పాలు అడవులుగలది. వ్యవసాయమునకు యోగ్యమైన భూమిలో నూటికి 40 పాళ్లు మాత్రమే సాగులోనికి వచ్చినది. అనగా 3 కోట్ల ఎకరాలుగల దేశము మాత్రమే సాగులో నున్నదని చెప్పవలెను. ఈ సాగులో నున్న భూమిలో నూటికి 90 పాళ్ళు మెట్టపంటలకు మాత్రమే వినియోగమగుచున్నది. పంటలలో ముఖ్యముగ పేర్కొనదగినవి వేరు శనగ. వేరు శనగ పంటకు ప్రధానమైన మండలము రాయలసీమ. ఆ తర్వాత పేర్కొనదగిన జిల్లాలు విశాఖపట్టణము, గుంటూరు. నువ్వుల పంటకు తుని ప్రదేశము ప్రధానమైనది. మేలురకం పుగాకు ప్రధానంగా గుంటూరులోను, కొంతవరకు కృష్ణా గోదావరి జిల్లాలలోను వుత్పన్నమవుతున్నది. ఉత్పన్నమవుతున్న పుగాకులో కోట్లకొలది రూపాయలు విలువగల పుగాకు ఎగుమతి అగుచున్నది.అది దేశములో నేయుంచి సిగరెట్ కార్ఖానాలకు ఉపయోగించుకోవచ్చును. రాయలసీమ జిల్లాలలో ప్రత్తి పంట ముఖ్యమైనది. ఆ ప్రత్తి మేలు

రకముగాదు. గాని తుంగభద్ర ప్రాజక్టు నెరవేరిన తర్వాత మేలురకం ప్రత్తిగూడ వుత్పన్నము కాగలదు. బొబ్బిలి, అనకాపల్లి, కృష్ణ, గోదావరి, అనంతపురం జిల్లాలలో చెరకు పంట ఎక్కువగా సాగిస్తున్నారు. సముద్రతీర భూములలోను డెల్టా ప్రదేశములలోను కొబ్బరి పంట ఎక్కువగా నున్నది.

దేశములో వుత్పన్నమగుతున్న ముడివస్తువులను ఉపయోగించుకోగల పరిశ్రమలు ఆంధ్రదేశంలో చెప్పుకో తగినంత ఎక్కువగా సాగడంలేదు. ఏవో కొద్దిగా అక్కడకూడ కొన్ని పరిశ్రమలు ప్రారంభమైనవి. సిమెంటు కార్ఖానాలు బెజవాడలో రెండును, విశాఖపట్టణంలో ఒకటియును గలవు.

ఇంజనీరింగు పరిశ్రమ ఆంధ్రదేశములో యింకను బాల్యావస్థలోనే యున్నదని చెప్పవలెను. గాని, ఎక్కువగా అభివృద్ధిపొందుటకు అవకాశము చాల గలదు. రసాయన పరిశ్రమాభివృద్ధి కొంతవరకు సాగుతున్నది. సోడాపొడి, సల్ఫ్యూరిక్ ద్రావకము తయారు చేయుటకు కావలసిన పరిశ్రమాభివృద్ధి కనబడుతున్నది. నెల్లూరులో కుండలు వగైరా పరిశ్రమలు సాగుతూన్న స్థలములు కొన్నిగలవు. అవి యింకా అభివృద్ధి పొందుటకు అవకాశం కన్పడుతున్నది.

బొబ్బిలి, కిర్లంపూడి, సామర్లకోట, వుయ్యూరు, హాస్పేటలలో చక్కెర ఫ్యాక్టరీలు గలవు. రాజమహేంద్రవరంలోగల కాగితం ఫ్యాక్టరి యింకను ఎక్కువగా అభివృద్ధి హొందుటకు అవకాశములుగలవు. ఆంధ్రదేశంలో చెప్పుకోతగిన నేత మిల్లులు లేకపోవడం చాల దురదృష్టం. దక్షిణ జిల్లాలలో 50 మిల్లులు గలవు. వుత్తర జిల్లాలలో ఒక్కటియు లేదు.

గృహ పరిశ్రమలలో మాత్రము అనేకము ఆంధ్రదేశములో నెలకొల్పియున్నారు. అందులో చేతిమగ్గాలపైన బట్టల నేతకు ఆంధ్రదేశము ప్రసిద్ధి పొందినది. ఈ యుద్ధపరిస్థితులవలన ఈబట్టల నేత గ్రామ పరిశ్రమకు ఎక్కువ చురుకు పుట్టినది. నేతబట్టలు నాణ్యంతలు అధికమైనవి.

ఏలూరు రత్నకంబళ్ళ నేతకు చాల కాలమై ప్రఖ్యాతి పొందియున్నది.

దేశమందలి పారిశ్రామికాభివృద్ధి యంత్రముల కుపకరించే శక్తినిబట్టి యుండును. మచిఖండ ప్రాజక్టు నెరవేరినయెడల సర్కారు జిల్లాలకు అధికము విద్యుచ్ఛక్తి వినియోగమునకు రాగలదు. అట్టిశక్తి తుంగభద్రవలన రాయలసీమ జిల్లాలకు కావలసినంత లభించగలదు.

అంతేగాక రామపాద సాగర ప్రాజెక్టువలన ఆంధ్రదేశము నంతటకు కావలసినంత విద్యుచ్ఛక్తి లభించగలదు. కర్నూలు జిల్లాలోగల సున్నపురాయివలన సిమెంటు పరిశ్రమ ఎక్కువగా వృద్ధిలోనికి రాగలదు. ఆ పరిశ్రమ కర్నూలు జిల్లాలో సాగించుటకు ప్రయత్నములు జరుగుచున్నవి.

తుంగభద్ర ప్రాజక్టునెరవేరినయెడల పారిశ్రామికాభివృద్ధి ఎక్కువగుటకు అవకాశము చాలగలదు.

ఆంధ్రమండలంలో చక్కెర ఫ్యాక్టరీలు కొద్దిగా కలవుగాని, యితర దేశములనుండి చక్కెర దిగుమతి చేసుకోవలసిన అగత్యము ఎక్కువగా నున్నదే. అందుచేత తాటిబెల్లమునుండి చక్కెర, తయారుచేసే పరిశ్రమ ఎక్కువగా సాగించే విషయం ఆలోచింపతగినదే!

మన్యప్రదేశములలోని అడవులనుండి అందులో ఎక్కువగా గోదావరినది ప్రవహించు అడవులనుండి కాగితపు పరిశ్రమకు కావలసినవస్తు సామగ్రి లభించగలదు.

ఆంధ్రదేశమందలి పారిశ్రామికాభివృద్ధికి ఆర్థిక సహాయ్యము ఎక్కువ ప్రధానమైనది. ఆ సహాయ్యము చన్నపురి ప్రభుత్వమువారు చేయుటకు సంకల్పించారు. మండలంలో పెట్టుబడిదారుల సంస్థను నిర్మించుటకు పూనుకున్నారు. ఇది శుభసూచకము - దీనివల్ల పారిశ్రామిక అభివృద్ధికి ఎక్కువ తోడ్పాటు కలుగ గలదు.

దేశమందలి పారిశ్రామికాభిలాషు లందరును కలసి దేశములో అంతర్గతములై యున్న ఆర్థిక సంపత్తిని సాధన సామగ్రిని, బయటకు తెచ్చి వినియోగించుకోవలెను. ప్రస్తుతము ప్రభుత్వమువారు అనుకూలమైన సాహాయ్యము చేయుటకు సుముఖులై యున్నారు. జమీందారులు యితర ధనవంతులు పెట్టుబడి ధనము సమకూర్చగలరు. పనిసాగించగల ధీమంతులు శాస్త్రజ్ఞులు, ఎక్కువగా గలరు. యిట్టి అనుకూల పరిస్థితులు వుండుటచేత పారిశ్రామికాభివృద్ధి ఆర్థికసంపద, విరివిగా కలిగే యుగము ఆంధ్రదేశములో ప్రారంభమైనదని చెప్పుట అతిశయోక్తిగాదు. ఇప్పుడు మనకు కావలసినది ప్రోత్సాహము, పనికి పూనుకునే సాహసము,సమర్థతగల నాయకత్వము. నేడు దృష్టిగోచరములుగ మాత్రమే యున్న సాధనములు రేపు వినియోగములోనికి వచ్చి ఘనకార్యములుగా పరిణమింప చేసికొనుటకు తగిన బుద్ధి, వివేకము భగవంతుడు మనకు ప్రసాదించునుగాక!



# ఒరిస్సాలోని ఆంధ్రులమాట ఏమిటి?

శ్రీ అంగజాల వెంకటేశము



1935 సంవత్సరపు ఇండియా ప్రభుత్వ చట్టము యేర్పడకముందే, ఎంతో కాలముక్రిందట, భారత దేశమును భాషనుబట్టి విజ్ఞానమునుబట్టి న్యాయముగ విభజించి ప్రత్యేక రాష్ట్రాలు యేర్పాటు చేయడం ధర్మము. అనే సూత్రాన్ని రాజకీయ వేత్తలు స్థిరపరచి యుండిరి. ఇట్టిది జరిగితే విశాల భారతదేశములోని వివిధమైన జాతులకు అన్యరాష్ట్రములలో అల్పసంఖ్యాకులుగా ఉంటే భాషలవారికి రాజకీయ విజ్ఞాన అభివృద్ధి హితోధికముగా జరుగగలదు. అంతేకాక వేరువేరు ప్రభుత్వ భాషల వారు సంపూర్ణ సమత్వమున ప్రత్యేకరాష్ట్రములగ స్వతంత్రులగ ఉండుటవల్ల నిజమైన సోదరభావము కూడా వర్ధిలగలదు.

ప్రస్తుతం దేశములోని రాష్ట్రాల యేర్పాటు పరిపాలనా సౌకర్యముకోసమైనదే అన్నమాటతో భేదాభిప్రాయం ఉండదు.

ఆంధ్రమహా జనులు - ఇంచు మించు ఈ శతాబ్దము ప్రారంభమునుండి ప్రత్యేక రాష్ట్రము కొరకు సక్రమమైన ఆందోళనచేస్తూ ఉండగా దానికి యింతవరకు ఫలితములేకపోయినా, దైవకృపవలన కాబోలు, 1936 సం॥ యేప్రిల్ మొదటినుండి ఒరిస్సా ప్రత్యేక రాష్ట్రముగా యేర్పడి వృద్ధిలోనికి వచ్చినది. అయితే యిదివరకేయున్న రాష్ట్రం సంగతివేరు, తమసంగతివేరు, అన్నట్లుయున్నది ఒరిస్సా వారిసంగతి. ఒరిస్సా సరిహద్దుల కమిషన్‌వారు సరిహద్దులు నిర్ణయించినప్పుడు, భాషను బట్టియే ఏర్పాట్లు చేసినట్లు చెప్పుకొన్నారు. కాని నిజముగా, ఈవిధంగా జరగలేదు అని అందరు ఎరుగుదురు. సిరనివాసము యేర్పరుచుకొన్న సుమారు పదిలక్షలుపైగా గల ఆంధ్ర జనసంఖ్యగల కొన్ని ఆంధ్ర ప్రదేశాలను, అన్యాయముగా ఒరిస్సాలో చేర్చివేసారు. ఇప్పటి ఒరిస్సా రాష్ట్రపు యావత్తు జనసంఖ్యలో పది లక్షలమంది ఆంధ్రులు (అల్పసంఖ్య) అనబడవచ్చును. కాని పదిలక్షల జనులు, యేకభాషకు చెందినవారు, ఎన్నడు స్వల్పసంఖ్యాకొజాలరు. యింతటి జనసంఖ్యకు అన్యాయ అక్రమము జరగడం సహింపరానిది, క్షంతవ్యము కాజాలదు. ఇది ప్రముఖ సమస్యగాని అల్ప సమస్యగాదు.

అసలు యేప్రధాన సూత్రమును ఆధారము చేసుకొని ఒరిస్సాను ప్రత్యేక రాష్ట్రము చేసేమన్నారో ఆ సిద్ధాంతానికే ప్రత్యక్ష విరుద్ధమైనది జరిగిపోయినది. దీనిని మార్చించుట అవసరము.

### అసలు సమస్య :

పర్లాకిమిడి బరంపురం (గంజాంజిల్లా లోనిది) విశాఖపట్నం ఏజన్సీలోని జయపురం సంస్థాన ప్రదేశము క్రొత్త ఒరిస్సా ఏర్పాటులో చేర్చివేయ బడిన అధిక సంఖ్యాక ఆంధ్ర ప్రాంతములని అందరుయెరిగియున్నారు. అనాడే ఆంధ్రులు తమ అసమ్మతిని విస్పష్టముగ ప్రకటించి యుండిరి. కాని ఆంధ్రుల మొరను అధికారులు వినుపించుకొనకుండా ఆంధ్రుల కన్యాయము నష్టము కలిగేటట్లు ఒరియావారికి అధికలాభము చేకూరాలని ఈపని చేసినట్లున్నది. అది మొదలు ఒరిస్సా ఆంధ్రుల సమస్య బయలు దేరినది. ఇదిరెండు కారణముల వలన సంభవించినది. ధనబలము పలుకుబడిగల ఒరియా జమీన్‌దారుల ప్రోత్సాహముక్రింద, యింకా యింకా, విశాల ప్రాంతమును కలిపివేసుకొన వలెననే దురాశతో కూడిన ఓఢ్రుల ఆందోళనవలన, అసందర్భమయిన ఆంధ్రుల ఉపేక్ష అశ్రద్ధవలన ఈ అన్యాయము

జరిగిపోయినది. యిప్పటికి ఇంకా ఏవో, ఏవో, స్థలాలు తమకు చేరవలశినవి మిగిలి పోయినట్లు ఓఢ్రులు కృతక ఆందోళన చేస్తూనే యున్నారు. యిది వారి స్వార్థమును స్పర్ధను తెలియ జేయును. అయినా అధికారుల పక్షపాతము వారికున్నది. పరిపాలకులు నిష్పాక్షికముగను న్యాయముగను అల్ప సంఖ్యాకుల శ్రేయమును రక్షింపవలసిన శ్రద్ధయు కలిగి యుండవలసినది.

అట్లుకాక అన్యధా జరిగి నందువల్ల అసలు ఆంధ్ర రాష్ట్ర సమస్యయే కాక, ఒరిస్సా ఆంధ్రుల సమస్య ఒకటికూడ ప్రబలినది. అయితే ఈరెండు పరస్పర సంబంధము గలవి, అవినాభావముగలవి అనేది ఒక అభిప్రాయము.

చెన్నపురి సమీప ప్రాంతవాసుల దృష్టిని, ఈ ఒరిస్సా ఆంధ్రుల సమస్య, ఆకర్షింపక పోవచ్చును. అయినప్పటికి తమ ప్రస్తుత పరిస్థితులను గమనించి అయినా, విశాల ఆంధ్ర రాష్ట్రము యేర్పాటు సంగతి యోచించి అయినా ఒరిస్సాలోని ఆంధ్రుల సహాయమునకు పూనుకొనవలసియే ఉన్నది.

యావదాంధ్ర ప్రదేశమున తీవ్రతర ఉద్యమమొకటి నిరంతరము జరగవలసియే యున్నది. ఆంధ్రు లెల్లరు ముఖ్యముగా నాయకులు మరి విశేషముగ కాన్‌స్టిట్యూయెంట్ యెసెంబ్లీ రాజ్యాంగ నిర్మాణ సభలోని ఆంధ్ర సభ్యులందరు ప్రత్యేక శ్రద్ధతీసుకొని పాటుపడవలసి యున్నది. రాజ్యాంగ పరిషత్తులో భారతదేశ భాషా ప్రయుక్త రాష్ట్ర పునర్విభజన న్యాయముగా జరుగవలసిన విషయము ఆలోచనకు రానున్నది. అప్పుడు సమగ్రముగ ఆంధ్రరాష్ట్ర నిర్మాణము జరిగే సూచనలు సరిగా యివ్వవలసి యున్నది. అన్యాయముగా ఒరిస్సాలో చేర్చి వేయబడిన ఆంధ్ర ప్రదేశములుకూడ ఆంధ్రరాష్ట్రములో తప్పక చేరవలసి యున్నవి. అంటే సరిహద్దుల పునర్విమర్శ ముఖ్య సమస్య కాగలదు. ఇందులో తప్పక న్యాయము జరిగేటట్లు చూడవలసిన భాధ్యత యావ మన్మందిపై యున్నది.

## పూర్వచరిత్ర :

మనకు అనుకూలముగ నిర్ణయము జరగాలంటేకొంత పాత చరిత్ర, ప్రస్తుతస్థానిక స్థితిగతులు తెలుసుకొనుట అవసరము. ఒరియావారు రెండు స్థూలమైన సంగతులు చెపుతారు. యిప్పుడు ఒరిస్సాతో అతికి వేయబడిన ఆంధ్రప్రదేశాలు పూర్వమెప్పుడో ఒరియా దేశముగా యుండిన దానిలోని భాగములట? మన సంఖ్యకంటె వారి సంఖ్యయే ఎక్కువట? ఈ రెండుకూడ నిజము కావు. అవి నిర్ధారణ చేయుటకు ప్రత్యేకశ్రమ అక్కర లేదు. గత నాల్గు వందల ఏండ్లలోపున యేనాడైనా ఆంగ్లేయుల క్రిందగాని, ఫ్రెంచివారి క్రిందగాని, మహ్మదీయుల క్రిందగాని, గంజాం జిల్లాప్రాంతము, ఉత్తర సర్కారు లనబడేవి ఆంధ్ర ప్రదేశముగానే ఉండెననుట చరిత్రాంశము. ఒరిస్సా ప్రత్యేకత గాని, అందులో దానిక్రింద ఈ ఆంధ్రులు చేరియుండుటగాని యంతమాత్రము రుజువుకాదు.

హంటరు వ్రాసిన చరిత్ర గ్రంథము చూచినచాలును. చిలుక సరస్సుకు దక్షిణమునయున్న కొండల వరుసయే ఒరియా ప్రాంతపు దక్షిణపు ఎల్ల అని చరిత్రకారుడు వ్రాసెను. ఈ విధముగా ఓఢ్రప్రాంత దక్షిణ సరిహద్దుకు సమీపముగాయున్న గంజాంజిల్లాయే ఓఢ్ర ప్రాంతము లోనిది కానప్పుడు, యింకా దూరముగాను మరీ దక్షిణముగానుయున్న జయపుర ప్రదేశము ఓఢ్ర ప్రాంతములోనిది అనుకొనడము ఎట్లు సాధ్యము? జయపురం మహారాజులు రాజపుత్ర సంతతి వారమని ఔడ్ - జమ్ము కాశ్మీరు సంస్థానాలనుండి దిగివచ్చిన సంతతుల వారమని చెప్పుకొంటారుగాని ఓఢ్ర వంశజులమని చెప్పుకోలేరు. వీరికి సంబంధించిన తామర శాసనములు మొదలయినవి తెలుగులోనే యున్నవి. జయపుర సంస్థానము బస్తరు ప్రాంతము సహా సుమారు 8, 9, శతాబ్దములనుండి ఆంధ్ర ప్రాంతము లోనిదే అనే చరిత్రాంశము లున్నవి. క్రిష్ణదేవు అనేరాజు కాలమున ఒరియా బ్రాహ్మణులకు గొప్ప భూదానములు జరిగినట్లు యున్నవి. అంటే సుమారు మూడువందల సంవత్సరముల లోపున ఈ విధముగ కొందరు ఓఢ్రులు జయపురము చేరుకున్నారన్నమాట. ఓఢ్రులకంటె తెలుగు వారే యింకా పూర్వమే ఈ ప్రాంతానికి వచ్చి వలస యేర్పరుచుకున్నట్లు ఆంధ్రచరిత్ర గ్రంథములలో కలదు. విశాఖపట్నంజిల్లా గజిటీలలో ఆదికునివాసులదే ఈ

ప్రదేశమని ఓఢ్రులు అన్య ప్రాంతములవారని ఉదహరింపబడి యున్నది. నిజమైన యేచరిత్ర ఆధారము చూచినా, గంజాము, కోరాపుట్టి ప్రాంతాలు ఆంధ్ర ప్రదేశాలనియు ఈ ప్రాంతాలకు ఓఢ్రులు పరదేశులే అని రుజువు కాగలదు.

రాజకీయ సంబంధాలలోను, వ్యవహార వ్యాపారాల లోను కూడ విజయపుర ప్రాంతమునకు ఆంధ్ర మద్రాసు ప్రాంతములకు విడరాని సంబంధమున్నది. జయపురం యేజన్సీ అభివృద్ధి అవకాశములు చెన్నరాష్ట్రిలేక, ఆంధ్రరాష్ట్రి, భాగముక్రిందనే సుసాధ్యమగును. అడవుల కొండల వీలు చూచినా ఏజన్సి ప్రాంత ఆర్థికాభివృద్ధి చూచినా సంవత్సరానికి ముప్పది లక్షల రూపాయిలు ఈ విషయములో కర్చుచేస్తూ యుండిన చెన్నరాష్ట్రి ప్రభుత్వముక్రింద జరగగల అభివృద్ధి పేదదైన ఒరిస్సాలో ఏనాడు జరుగజాలదు. కేంద్రప్రభుత్వము వారి ధనసహాయము పోషణలేని మనజాలని ఓఢ్రరాష్ట్రిము జయపుర ఏజన్సీ పురోభివృద్ధికి ఏమిచేయగలదు? చరిత్రకముగాను, భూస్థితినిబట్టి వాణిజ్య సంబంధముగాను ఆంధ్రదేశముతోనే సంబంధ సంపర్కములు గల జయపురాధి ప్రాంతములు, రానున్న ఆంధ్ర రాష్ట్రిములో చేయుట సబబు, సహజము, శ్రేయోదాయకమున్నూ.

జనసంఖ్య విషయం :

గంజాం విశాఖపట్నం, ప్రాంతాలలోని జనసంఖ్య వివరణ సంబంధములో జనాభా అంకెలను తయారు చేసే సమయాలలో తమాషాలు జరిగినట్లు సెన్సు రిపోర్టులలోనే అర్థయుక్తమైన రిమార్కులు గలవు. కృత్రిమమైన ఓఢ్రజన సంఖ్యాధిక్యత చూపించిన ప్రయత్నము రుజువైనది.

బరంపురంవంటి పట్టణాలు అధికతర ఆంధ్ర జనసంఖ్య కలిగినవైనా ఒరిస్సాలో కలిపివేయుటకు కారణము, ఓఢ్రులకు కటకంతప్ప మరియొక పెద్దపట్టణము లేక పోవడమేనట. ప్రభుత్వ ప్రకటనములోనే యట్లు యున్నది. ఇది యేమి న్యాయము ?

పర్లాకిమిడిని ఒరిస్సాలో చేర్చుటకూడదు అని సరిహద్దుల కమీషన్ అధ్యక్షుడే తన అభిప్రాయమును వ్రాసియుండెను.

భాష జాతి జనసంఖ్య ప్రాబల్యముబట్టి పర్లాఖిమిడి ఆంధ్రులదే అని, జమీన్‌దారు ఒక్కని పట్టుదల పలుకుబడివలన ఒరిస్సాచేర్చి వేస్తే ఆంధ్రఉత్కళ సమస్య తీవ్రతరమై ఆందోళన ప్రబలిపోవునని ఓడనెల్ దొర వ్రాసియుండెను. గుణుపురం మొత్తముమీద తెలుగు వారి సంఖ్యయే హెచ్చు అని కూడ ఆ రిపోర్టులోనే కలదు. కాని ఆనాటి ఆ ప్రాంతపు ఆంధ్రుల ఉపేక్ష వలన జయపురం ప్రాంతము ఒరిస్సాలో చేర్చి వేయబడినట్లుకూడ ఆ రిపోర్టువలననే తెలియగలదు.

ఒక జమీన్‌దారు పట్టుదలవలన అసంఖ్యాకులైన ఆంధ్రుల నిర్లక్ష్యమువలన, ఆంధ్ర ఒరియాలమధ్య యిట్టి న్యాయాన్యాయములు, నిర్ధారణమైనవి. యిప్పటికైనా ఆంధ్రులెల్లరు ఒక్కటిగా పూనుకొని ఆంధ్రులకు సరియైన న్యాయము జరుగునట్లు, అన్యాక్రాంతమైన ఆంధ్ర ప్రదేశమును, మళ్ళీ మన స్వాధీనము అగునట్లు చుచుకోవలసిన బాధ్యతయున్నది.

మదరాసు ప్రభుత్వ ప్రధానోద్యోగులు ఈ ఆంధ్ర ఒరియా జనాభా వివరాల అన్యాయము గురించి సరియైన వాఖ్యానములు విమర్శలు ప్రకటించియే ఉన్నారు. బ్రిటిషు ప్రభుత్వమువారు 1933 సం॥ ప్రకటనలో కోరాపుట్టిజిల్లాను మదరాసు రాజధాని భాగముగా ఉంచడానికే నిర్ణయించి యుండిరి.

మన ఇక్కట్లు :

ఓఢ్రరాష్ట్రిము ఏర్పడిననాటినుండి ఆ ప్రాంతములోని ఆంధ్రులు అనుభవిస్తూన్న బాధలు ఇన్ని అన్ని కావు. ఏవిషయములోను వారికి న్యాయము జరుగుటలేదు. అల్పసంఖ్యాక హక్కులుకూడ ఆంధ్రులకు లేకున్నవి. ఓఢ్రులు కృతకమైన నిరంతర ఉద్యమ మొకటి ప్రబలజేసి తమ క్రింద బలవంతముగా చేర్చుకోబడిన ఆంధ్రులను అణచివేయుటో పారదోలుటోచేయ సంకల్పించినటులున్నారు. ఒరిస్సా ప్రభుత్వము ఎంత నిర్దాక్షిణ్యముగా

ప్రవర్తించినను, ఆంధ్రులు ఎన్ని ఇక్కట్ల పాలైనను తెలుగువారు తమ తెలుగు తనమును, వ్యక్తిత్వమును నిలబెట్టుకొనుటకు గట్టిగా పోరు సలుపుచునే యున్నారు. పదిలక్షల ఆంధ్రులు, ఒక సంస్కృతి విశిష్ట విజ్ఞానము, భాషా సంప్రదాయముగల తెలుగువారు ఆర్థికముగ రాజకీయముగ బాధింపబడకూడదు అనే న్యాయముకోసము పోరాడుచున్నారు. ఈ కృషియందు తప్పక జయము కల్గుటకు చెన్నరాష్ట్రములోని ఆంధ్రులు యావన్మంది, ముఖ్యముగా నాయకులైనవారు యికనైనా వెంటనే పూనుకొని జాగ్రత్తగా ప్రయత్నము చేయవలెను. డామిసైలు సర్టిఫికేటు బాధలు తొలగిపోయేటట్లు చూడవలెను. విద్యాలయములలో అన్యాయములు జరుగరా నివ్వరాదు, తెలుగు విద్యకు భంగము కలుగరాదు. బీద ఆంధ్ర విద్యార్థులకు పేదరికము సర్టిఫికేటులు, దొరకుటకుకూడ అసాధ్యమైన దుస్థితి తొలగింపబడవలెను.

క్రమేణ నశించి పోగల ఓటు హక్కు స్థిరీకరణను పొందునట్లు చూడవలెను. కాంగ్రెసు మంత్రివర్గాలు ఓఢ్రరాష్ట్రములో ఆంధ్రులకు, అక్రమ విచక్షణ జరగకుండా చూడవలసియున్నది. ఓఢ్రరాష్ట్రము యేర్పడకముందే ఆ ప్రాంతముల స్థిరనివాసములు గల ఆంధ్రులకు ఓఢ్రులతో సర్వత్రా సరిసమానహక్కులు సౌకర్యములు ఉండి తీరునట్లు యేర్పాట్లు జరగేటట్లు చూడవలసియున్నది. స్కూలులలోను, కోర్టులలోను, కచేరీలలోను, విద్యాఉద్యోగము లన్నిటను, భూముల విషయమున, శాసనసభలలోను రాజకీయముగానైన ఓఢ్రరాష్ట్రము క్రింద ఆంధ్రులు ఒక్కరికైనా ఎట్టి అన్యాయము జరుగకుండా చూచుకోవలసిన అవసరము ఆంధ్రులకై యున్నది.

కర్తవ్యము :

యావత్తు భారతదేశములోను, యేరాష్ట్ర సంబంధము అయినా, గణనీయమైన అల్పసంఖ్యాక భాషా సంఘమునకు ఏనాడు అన్యాయములు జరుగకుండునట్లు, రాజ్యాంగ నిర్మాణవేత్తలు, పూచీగా తీర్మానములు చేసి పరిష్కారము చేయవలసియున్నది.

స్పష్టమైన విధానము ఒకటి యేర్పడవలసియున్నది. చరిత్ర ప్రసిద్ధ భాషా సంప్రాదాయముగల జాతికి ఎట్టి నష్టము కలుగకుండునట్లు చూచుటయేగాక, అట్టివారి అభివృద్ధికి అభ్యుదయమునకు నిజమైన సహకారము చేయవలసియున్నది కూడాను. యిది దేశనాయకుల కర్తవ్యము. వివిధ రాష్ట్రాల మధ్య, పలుభాషల మధ్య, సుహృద్భావము కలుగుటకు, ప్రత్యేక భాషారాష్ట్రములు, వాటికి సంబంధించిన సమరస విధానము తోడ్పడగలదు.

కనీసము, అతి అన్యాయముగా ఓఢ్రరాష్ట్రములో కలిపివేయబడిన ప్రముఖ ఆంధ్రప్రదేశాలన్నీ మళ్ళీ ఆంధ్రరాష్ట్రములోనికి వచ్చేటట్లు, ఏకఖండము, అఖండమూ అయిన విశాల ఆంధ్రరాష్ట్రము ఏర్పడునట్లు చూచుట మన విధి.



# ఆంధ్రోద్యమము

శ్రీ రామచంద్రుని వెంకటప్ప

18, 19 శతాబ్దములలో క్రొత్తగా విజృంభింపనారంభించిన పాశ్చాత్య దేశాలకు తలయొగ్గిన ప్రాగ్దేశాలు ఇరువదవ శతాబ్దపు ఆరంభములో తిరిగి తలఎత్తనారంభించినవి. అట్లా తలఎత్తుతున్న ప్రాగ్దేశాలకు రష్యాను, జపాను ఓడించడం ఎంతో ఉత్సాహాన్ని, పురికొల్పింది. అప్పటికే చీనాలో జాతీయోద్యమము ప్రారంభమై దశదిశల వ్యాపిస్తూ ఉండెను. భారత దేశములోను, 19-వ శతాబ్దము మధ్యమందు రణరంగములో ఓడిపోయిన భారత జాతీయ తత్వము, స్వరాజ్య స్వధర్మములను స్థాపించి సంరక్షించుకోవలెననే ఆకాంక్ష, కత్తులతో బాటు ఒరలలో దూరక స్వాతంత్ర్యాభిలాషులైన, దాదాభాయి నౌరోజీ, మెహతా, ఆనందాచార్లు, విజయ రాఘవాచార్య, సుబ్రహ్మణ్యయ్యర్ మొదలైన వారి హృదయాలలో మొలకలై లతలై తీగలై సాగుచుండెను. అదియే నాటి నవయువకుల హృదయాలలో తేజోమయమైన జ్యోతులై దేశానికంతా జ్వాలా తోరణాలుకట్టి భరతమాతకు స్వాతంత్ర్య వుత్సవాలు చేదామనే ఉజ్వల భావోద్రేకముగ, త్యాగ సాహసోపేతమైన కార్యకలాపాలుగా పరిణమింప ప్రోత్సహిస్తున్నవి. ఈ శతాబ్దారంభమునాటికి దేశము, దేశ స్వాతంత్ర్యము, అనే యోచనగల ప్రతి భారతీయుని హృదయములోను భావశబలత ఏర్పడ్డది.

అలాంటి సమయంలో కోతి చూడ నేరక నిప్పు ద్రొక్కినట్లు బంగాళారాష్ట్రాన్ని బ్రిటిషు పరిపాలకులు రెండుగా విభజించిరి. మహారాష్ట్రములో నూతన జాతీయ జ్యోతులు వెల్గిస్తున్న తిలక్ మహారాజును నిమిత్తం చూపి, ఆరు సంవత్సరములు కారాగారములో తోసిరి. బంగాళీ యువకులను, పలువురను వురికంబాలెక్కించి మరి చాలా మందిని జైళ్లలో మూసిరి. ఆరిపోతుందని ఆశబడ్డ అగ్ని దేశమంతా అంటుకున్నది. ఆఖరుకు 1911 వ సంవత్సరములో హార్డింజిప్రభువు బంగాళా విభజనను తొలగించి ఏక బంగాళ మొనరించి చేసినతప్పు దిద్దుకొనక తప్పినది కాదు. దేశంలో మొత్తంమీద ఆసియాఖండంలో ఈ విప్లవం సాగుతూండగా భారతదేశములో మధ్యప్రాంతాన తూర్పుపెడగానున్న ఆంధ్రజాతిగూడ దాని ప్రోద్బలానికి గురియై, నూతన పరిణామంచెంద నారంభించినది. అదే ఆంధ్రోద్యమము.

దీనినే ఆంధ్రోద్యమ పితామహు లనదగిన శ్రీ దేశభక్త కొండ వెంకటప్పయ్య పంతులుగారు, ఆంధ్రమహాసభాధ్యక్ష పీఠమునుండి నెల్లూరిపురమున 1917 వ సంవత్సరమున 5 వ మహాసభలో తమ అమృతవాక్యముల నీ రీతి పొంగుపరచినారు :—

"ఈ క్రీస్తుశకము 19 వ శతాబ్దము మధ్యమునుండి, నేటివరకును ఐరోపాఖండమున నెల్లయెడల, వ్యక్తిస్వాతంత్ర్యాభిలాష యభివృద్ధి చెంగుచున్నది. బలిష్ట రాజ్యములకు లోబడియుండిన కొన్ని చిన్నచిన్న జాతులు సైతము, స్వాతంత్ర్యము బడయుటకు ప్రయత్నించినవి. ఆసియాఖండమునందు, అల్ప సంఖ్యాకులైన జపానీయులు అమేయ బలాఢ్యులని పేరుపొందిన విశాల రాజ్యాధిపులగు రష్యావారిని, ఘోరయుద్ధమున నోడించి విజయాన్వితులై, లోకమందలి ప్రధాన సామ్రాజ్యములలో, గౌరవస్థానము నధిష్టించుటవలన ఆసియాఖండపు తూర్పు దేశములలో జాతీయ, గౌరవమునం దభిమాన ముద్భవించి జాత్యుద్ధరణమం దభిలాష జనియించెను. పాశ్చాత్య విద్యావ్యాసంగము లేని, ప్రజలు సైతము, నూతన రాజ్యాంగ పద్ధతుల నవలంబించి ప్రజా స్వాతంత్ర్యమును పడయ ప్రయత్నింప సాగిరి. పారశీకము ఆఫ్ఘనిస్థానము, చీనా మొదలగు దేశములలోని ప్రజ లుద్బోధితులై, రాజ్యాంగ నిర్వహణమునందు స్వాతంత్ర్యమును పొందుట కుద్యమించిరి. భరతఖండవాసులకీ నూతనోజ్జీవము నుపకరించి తమ పూర్వ నాగరికతా సభ్యతలను గమనించి ఆంగ్లేయ విద్యాభ్యాసమున పాశ్చాత్యదేశములందలి యుదార రాజ్యతంత్ర విధానములు సైత మెరింగినవారగుటచేత అట్టి స్వాతంత్ర్యములు గల రాజ్యాంగ ప్రతిష్ఠాపనలవల్ల గాని, తమ భారతజాతి యభ్యున్నతి చెందుటకవకాశములేదను దృఢవిశ్వాసము గలవారైరి. ఈ నూతనజాతీయ ప్రబోధాంకురములు మొలకలెత్తుతరి ఈ విశాల భారతదేశమున కోట్ల సంఖ్యాకులగు మహాజనుల హృదయాంతరాళమాలయం దీ జాతీయాంశ ముద్భవమొందు సమయమున సహజముగా పొడసూపు కొన్ని విచేష్టితంబుల నిజ స్వభావంబు లెరుంగలేక ప్రభువులు

వాని నణచిపెట్టుటకు కొన్ని నిర్బంధ శాసనముల నేర్పరచిరి—

దేశమునందు సంక్షోభము ప్రారంభమయ్యెను. మఱియు రాజప్రతినిధిగా నుండిన కర్జను ప్రభువు బంగాళా రాజధానిని ద్వివిధముగ విభాగముచేసి తమ స్వభావను వృద్ధిగావించుకొని యేకజాతిగా నైకమత్యముతో నభివృద్ధిఁ జెందుచు భరతవర్షమున కంతకు బహు విషయములందు మార్గదర్శకులుగా నున్న బంగాళా దేశీయులను విడఁగొట్టి జాత్యభివృద్ధికి భంగము గావించుటవలన దేశమునందు నాందోళనము కలవరములును ఆరంభమయ్యెను. బంగాళీయులు విభాగమును పోగొట్టుటకు బహు భంగుల ప్రయత్నించిరి. భారతీయులందరు వారి ప్రయత్నముల పట్ల తమ సానుభూతిని వెల్లడించిరి.

దూరదృష్టిగల రాజ్య తంత్ర ధురీణుఁడగు హార్డింజ ప్రభువు రాజ ప్రతినిధిత్వము వహించిన పిదప బంగాళా రాజ్య విభాగమును సంస్కరించి బంగాళా రాజ్యములో హింధీభాష మాటలాడువారిని బంగాళీయులనుండి విడదీసి బంగాళీయులను సాధ్యమైనంత వరకొక రాష్ట్రములోనే యుండునట్లు చేసెను. ఆ సమయమున నావిభాగములనుగూర్చి హార్డింజి ప్రభువు ఇంగ్లాండులోని హైందవ రాజ్య కార్యదర్శికి వ్రాసిన రాజకీయ లేఖలో నుదాహరించిన రాజకీయ విషయములు భారతీయుల హృదయముల నాకర్షించెను.

ఆంధ్రులము అతి ప్రాచీనజాతికిఁ జెందినవారము. ఐతరేయబ్రాహ్మణములోనే మన ప్రస్తావనయున్నది. గహనమగు చరిత్రాంశంబులఁ త్రవ్వి తీసి విమర్శించుట, నిగ్గుదేల్చుట ఈ వ్యాసముయొక్క యుద్దేశ్యములుగావు. దానికి ప్రత్యేక ప్రతిభావంతులగు పెద్దలు ఇందులోనే విడిగా వ్యాసములు వ్రాసియున్నారు. స్థూలముగ చెప్పవలెనంటె ఏనాఁడో ఆంధ్రులనే యొక వీరజాతి తెనుగునాటికివచ్చి, స్థావరాలు నేర్పాటు గావించుకొన్నారు. అంతకు పూర్వమున్న జనాన్ని జయించి దాసులను జేసుకున్నారో, సౌమ్యంగా వశం జేసుకున్నారో క్రమంగా ఏకరాజ్యము, ఏకజాతి, ఏకభాష ఏర్పడినది. ఆంధ్ర రాజ్యపు సామ్రాజ్యము శ్రీ కాకుళం, ధాన్యకటకం, అమరావతి, ప్రతిష్ఠానపురం రాజధానులుగ ఉపరాజధానులుగ ఏలుబడి సాగించినవి. క్రమముగ, ఉత్తరానికి ఎగబాకి మగధచేపట్టి భారత సామ్రాజ్యాధిపతులై మెరసినారు. ఆంధ్రభృత్యులనే ఒక శాఖవారు పశ్చిమమునకు వెడలి అటునుండి దక్షిణమునకు దిగి కాంచీపురము రాజధానిగ పల్లవ సామ్రాజ్యమును స్థాపించి నడిపించినారు. తొలుత ఉత్తరమున కెగప్రాకిన ఆంధ్ర సంతతులలో ఒక తెగ పశ్చిమమునకు దిగి చాళుక్యులై క్రమముగ తూర్పునకు పాకి చళుక్య సామ్రాజ్యాధిపతులై వేంగీ రాజ్యమేలినారు. దక్షిణమున చోళులతో వరుసగ మూఁడు తరములు సంబంధమొనర్చి చోళ, చాళుక్య రాజ్యముల నేక సామ్రాజ్యముగ నేలినవారు. వారు చరిత్రనుండి అంతర్హితమయ్యేనాటికి పశ్చిమ తూర్పు చాళుక్యుల వద్ద పరిచయముగ దండనాధులుగ నుండిన కాకతీయులు త్రిలింగ సామ్రాజ్యమును స్థాపించి కంచివరకు వ్యాపించి పరిపాలనమొనర్చినారు. ఆ త్రిలింగ సామ్రాజ్యము మహమ్మదీయుల దండయాత్రకు హతముగాగ వారికడనే తన భాండాగారాధ్యక్షులుగా నుంటూవచ్చిన హక్కరాయలు, బుక్కరాయలు తుంగభద్రా తీరమునకు చేరి విద్యారణ్యస్వామి అజ్ఞానుసారము విజయనగర సామ్రాజ్యము నెలకొల్పి మూడువందల సంవత్సరములు ముసల్మానులను దక్షిణాపథమునకు విజృంభింపకుండ నరికట్టి నిల్చినారు. తమ బావుటాను సేతువువరకు నెదురులేకుండా తీసుకొనివెళ్ళి రామేశ్వరమున నాటినారు. తల్లికోటయందు తురకలచే పరాజితులైకూడ, తూర్పున తమ సామ్రాజ్యము సరిదిద్దుకొని మరి వంద సంవత్సరములు రాజ్యముచేసినారు. ఆంగ్లేయులు వీరికడనుండే చెన్నపురిలో తావర మేర్పరుచుకొను అనుమతి పొందినారు. కాకతీయ సామ్రాజ్యం నశించినా తెలంగాణంలో ఆంధ్రప్రతిభ నశించలేదు. సాధులైన తానిషా రాజ్యంలో అక్కనమాదన్నలు ప్రధాని, దండనాధులై ప్రకాశించారు. 100-కి 90 మంది ఆంధ్ర ప్రజలున్న గోల్కొండ సామ్రాజ్యం - నిలవత్రొక్కి మొగలాయి బావుటా దక్షిణానికి రాకుండా చేయను చల్లగా తలఎత్తున ఆంగ్లేయులను మొగ్గలోనే నులిమివేయుటకు అక్కన్నమాదన్నలు శ్రీ ఛత్రిపతి శివాజీ మహారాజులతో చేరి పథకం వేశారు. అఫ్జూల్ ఖాన్ తలచుకొని హడలి పోతున్న తానిషాతో శివాజీ మహారాజుకు చోటూ కుదిర్చారు. వారిద్దరూ ఏకైక ఆశయం సాధించను సవ్యభావముతో కౌగలించుకొని వ్యూహాలుపన్నినారు. పరస్పర సహాయ సంపత్తులు నిర్ణయించుకున్నారు. అక్కన్నమాదన్నలు ఏకాంతముగా శివాజీతో ముచ్చటించడానికి వారు తమ స్వగృహంలో ఆయనకు విందుచేశారు. వారేమి ముచ్చటించారో స్వయంగావండి వడ్డించిన అక్కన్న మాదన్నల తల్లికే యెరుక! ఈ సన్నివేశమంతా - ఆంధ్రరాజనీతిలో ప్రావీణ్యులైన అక్కన్న మాదన్నల

ప్రతిభావిశేషము. అయితే కారణాంతరాలచేత అనుకున్న పని అప్పటికి నెరవేరలేదు. ఆ పిదప శివాజీ స్వర్గస్థుడైనాడు. ఆ వెంటనే ఔరంగజేబు గోల్కొండ జయించాడు – ఆ తదనంతరమే అంతవరకూ చెన్నపట్నంలో వర్తకపు జండానే – సెంట్ జార్జికోటమీద ఎగురవేసుకొంటూ వచ్చిన ఆంగ్లేయ వర్తకులు, ఇక భయవాలేదని ధైర్యంతో – దానిని తీసివేసి యూనియన్ జాక్‌ను ఎగురవేసుకొన్నారు. ఈ విధంగా – సుమారు 2000 సంll లుగా – సామ్రాజ్యాల నేలిన ఆంధ్రజాతి రాజ్యభ్రష్టమై ఛిన్న భిన్నమైపోయినది. అక్కడక్కడ నిలిచిపోయిన చిన్న రాజ్యాలవారు క్రమంగా బ్రిటిష్ పాలకులకు జమీందారులైనారు. పురాతనమైన మొగల్తూరు, పెద్దాపురం మొదలైన కొన్ని రాజ్యాలు నామరూపాలు లేకుండా పోయినవి. ఆ సంతతుల వారింకా ఉండి పింఛనులు పొందుచుండవచ్చునేమో. తెలుగునేలలో పెద్దముక్కకు ప్రభువైన – నైజాము ప్రభువు మొదటినుండీ – విజయనగరాధీశ్వరుడైన ' ఆనందగజపతిని మోసంచేసిన దాదిగా – బ్రిటిషు వారితో చాలా వరకు సఖ్యంగానే ఉంటూవచ్చి – వారికి సామంతుడైనాడు.

అయితే, ఆంధ్రులకు రాజ్యాలు పోయినా రాజ్యాంగాలు పోలేదు. ఆంధ్రుల నాటినుండి దక్షిణానికి తమ రాజ్యాన్ని గదుముకొనవలెననే ఆంధ్రసామ్రాజ్య నీతి క్రమానుగతంగా అన్ని సామ్రాజ్యాలున్నూ సాగించినవి. విజయనగర సామ్రాజ్యం నాడు ఆ నీతి సంపూర్ణ ఫలితాన్ని సాధించినది. మధుర, తంజావూర్లు తెలుగు నాయకులచే పరిపాలితమై, తెలుగు భాషనే రాజకీయభాషగా శిరసావహించి, తెలుగు సరస్వతి కొటపట్టులైనవి. తెలుగు నాయకులు అంతరించి మహారాష్ట్ర ప్రభువులు ఏర్పడ్డా – తెలుగు భాష తంజావూరును వదలలేదు. తంజావూరు సరస్వతీ మహాలులో ఉన్న తెలుగు గ్రంథాలు ఆంధ్రదేశంలో మరెక్కడా ఒక్కచోటగా లేవు. ఆఖరుకు పాఠశాలల్లోంచి తెలుగును ఉద్వాసన చెప్పినా అది త్యాగరాజ కృతుల రూపాన – తమిళ గాయకుల కంఠగతమై కూచోనున్నది. తెలుగు కుటుంబాలు తమిళ దేశంలో స్థిర వసతులేర్పరచుకొని వసిస్తూ ఉన్నారు. అనేక తెలుగు పాళెగాళ్ళ జమీందార్లు అక్కడ ఉన్నారు. తమిళదేశంలో ఈ నాయకుల్ని అతిశయించియున్న తెలుగువారి ప్రాబల్యాన్ని గూర్చి శ్రీ మాగంటి బాపినీడుగారు వెనక ఆంధ్ర ప్రభలో 1939 మార్చి 10 తేదిన వ్రాసిన వ్యాసంలో సగర్వంగా ఇట్లా వివరించియున్నారు :—

'సామ్రాజ్యాధికార యువకులై ప్రబలులై తెలుగువారుండగా, స్వదేశంలోనే ఒదిగి ఉండవలసివచ్చిన తమిళదేశములలో ప్రతిభగలవారికి ఆంగ్లరాజ్య స్థాపనము మహోపకారమైనది. ఆ రాజ్యంతోపాటు వెలసిన కిరస్తానీ బడులలో ఇంగ్లీషు చదివి ఆంధ్రులకన్నా ముందుగా వారు ప్రభుత్వోద్యోగాలకు, ప్లీడరీలకు-ఉపాధ్యాయ పదవులకు – తయారయినారు. రాజ్యాలు పోయినా రాజ్యాంగాలుపోని ఆంధ్రులు – కొత్తచదువుల కెక్కను కొంతకాలం పట్టినది; కాబట్టి వెనకపడ్డారు. సముద్రానికేర్పడ్డ కృష్ణాగోదావరీ డెల్టాలున్నూ-సర్కారాంధ్రుల ఉద్యోగాలంతగా అవసరంలేని వారిని గావించినవి. రాయలసీమ వాసులుగూడా, – రాయల నాటి చెరువుల కింద, క్రొత్తగా ఏర్పడ్డ, ప్రత్తి, వేరుశనగ మొదలైన నగదుపంటల ఆసరాన, మూడు సంll ల కొక్కసారి వర్షం కురిసినా బంగారంపండే నల్లరేగడి సౌభాగ్యంవల్ల, ఆలస్యంగానన్నా ఏర్పడ్డ ఆంగ్లవిద్యాసౌకర్యాలు నోచి, ధనము గల – సర్కారులవారికే ఎక్కువ దఖలుకావడంవల్ల – ఉద్యోగాలకు ప్రాకులాడ లేకపోయారు. దక్షిణ ఇండియా రైల్వే మిగతా వానికన్న ముందేర్పడ్డందున తమిళులకు రాజధాని నగరానికి రాకపోకల కెక్కువ అవకాశం కలుగడమును కొంత దీనికి కారణం. అంతమాత్రాన ఆంధ్రులు ఆంగ్ల ప్రభుత్వారంభంనుండి – నామరూపాలు లేకుండాపోయినారన రాదు. చెన్నపట్నానికి చుట్టూ ఉన్న ఆంధ్ర తమిళ ప్రాంతాలలోని ఆంధ్రులు విస్తారంగా ఆ పట్నాన్ని వృద్ధిలోకి తెచ్చినారు. వీరిలో పలువురు ఆంధ్రదేశానికివచ్చి ఆంధ్రులైన, మోసల ద్రావిడులు, తుమ్మగుంట ద్రావిడులు, ప్రథమారు ద్రావిడులు మున్నగువారు కుంపినీ ప్రభుత్వం తొలి రోజులలో వారు చాలా అధికారాలు పొందినారు. శ్రీపల్లె చెంచలరావుగారు, అమరావతి శేషయ్యశాస్త్రిగారు, సి. వి. రంగనాథశాస్త్రిగారు, ఏనుగుల వీరాస్వామయ్యగారు, వెంబాకం రాఘవాచార్యులుగారు, వెలగపూడి సుందరరామయ్యగారు, వెన్నెలకంటి సుబ్బారావు, నాగరాజు, శేషగిరయ్య, ముట్నూరి వెంకటనారాయణయ్యగార్లు, బొప్పూడి నాగమయ్యగారు, నెమలి పట్టాభి రామారావుగారు ఇత్యాదులెందరో ప్రతిభా విశేషమున మెరసియుండిరి. అయితే కాలక్రమానుగతంగా – తమిళ విద్యాధికులకు తెలుగువారు వెనకబడిరి. 20 వ శతాబ్దం ప్రారంభమైన

తర్వాత - ఒకదశ గతిస్తేనేగాని - జాతికి మొత్తం మీద - చురుకు పుట్టిందికాదు.

ఆంగ్లరాజ్యాధికారము భారతదేశమున స్థిరపడిన తర్వాత పరిపాలకులతో సంప్రదించి సంబంధమేర్పచు కొనుటకు దేశీయులు కొద్దిమంది ఆంగ్లభాష నేర్చుకొనిరి. అట్లాంటి వారిలో కొంతమంది ప్రభుత్వమునకు తాబేదారులై క్రొత్తపద్ధతిని ప్రజాహితకరమైన ప్రభుత్వ విధానము నేర్పరచను తోడ్పడగా, మరికొందరు ఆంగ్ల పద్ధతులపై ప్రజాభిప్రాయము వ్యక్తపరచి ప్రభుత్వ పద్ధతిని దిద్దుటకు సక్రమాందోళన సాగించినారు. ఈ పని కుంపిణీ రోజుల్లోనే మద్రాసు రాజధానిలో ప్రారంభించినవారు గాజుల లక్ష్మీనరసుచెట్టిగారు. తర్వాత ఇండియన్ అసోషియేషన్ అని యొకసంస్థ నేర్పరిచి చాలా కృషి గావించినారు. ఆ పిదప, యం. రంగయ్యనాయుడు ప్రభృతులు మద్రాసు మహాజనసభ నేర్పాటు జేసి తద్వారా రాజకీయాందోళనమును నడిపించినారు. ఆ మరుసటి వత్సరముననే మద్రాసులో నేటి కాంగ్రెసు సంస్థకు పునాదులు వేయబడినవి. క్రమంగా కాంగ్రెసు సంస్థ పరిపాలనా హంశాలలో మార్పులను, చేర్పులను సూచించుటతో ప్రారంభించి పరిపాలనాధికారములో భాగమడుగ నారంభించినది. సాముదాయకముగ కాంగ్రెసు సౌమ్యపద్ధతుల నడచుచుండగా, తిలకుమున్నగు జాతీయావాదులు 1896 నుండి న్నీ కాంగ్రెసు మరి కొంత ఉద్ధృతముగ నడువవలెనని కోరుచుండిరి. 1899 లో లార్డు సాంద్రస్ట్ ప్రభువు పరిపాలనా విధానమును తిలక్ కాంగ్రెసు వేదికమీద నిలిచి విమర్శింపబోగా, అధ్యక్షులు రమేశ చంద్రదత్తు గారు వారిని సాగనివ్వక, వారు పట్టుబట్టుచు తాము రాజీనామానిత్తుమని బెదరించిరి. కాని పరిపాలకులు నానాటికి చేయు అవ్యక్తపుపనులు, అపచారములు మూలాన దేశములో తీవ్రజాతీయవాదము ప్రబల నారంభించినది. ఈ వాదమును నాశనంచేదామని 1905 అక్టోబరు 16 తారీఖున కర్జన్ ప్రభువుగావించిన బంగాళా రాష్ట్ర విభజనమూలంగా రగులుచున్న తీవ్రజాతీయాగ్ని ఒక్కసారిగా ముప్పెత్తుగా 'భుప్పు'మని మండనారంభించినది. ఆ అగ్నిలోనుంచి కార్యాచరణాను కూలమైన, బహిష్కారోద్యమము, స్వదేశీయోద్యమము జాతీయ విద్యావ్యాపకోద్యమము ప్రారంభములైనవి. సౌమ్య రాజకీయాలకు ప్రపితామహుడైన దాదాభాయి నౌరోజీయధ్యక్షతక్రిందనే బంగాళమునకు కేంద్రమయిన కాశీఘట్టంలో 1906 సంవత్సరమున జరిగిన కాంగ్రెసు మహాసభలో ఈ మూడు ఉద్యమాలు ప్రతిపాదించే తీర్మానాలేగాక భారతదేశపు రాజకీయాశయమునుగూర్చి ఈ క్రింది తీర్మానముగూడ చేయబడినది.

స్వయం పరిపాలనము :

(1) బ్రిటిష్, వలస రాష్ట్రము లనుభవిస్తున్న స్వయం పరిపాలనమువంటి పరిపాలనా పద్ధతి భారతదేశమునకుకూడా వర్తింపజేయవలెనని ఈ మహాసభవారి యభిప్రాయము. తదను గుణమైన ఈ క్రింది సంస్కరణములు వెంటనే చేయబడవలెనని ఈ సభవారు తీర్మానిస్తున్నారు.

(ఎ) ఇంతవరకును ఇంగ్లండులోమాత్రమే జరుపబడుతూన్న అన్ని పరీక్షలను ఇండియా ఇంగ్లాండు దేశములలో నేకకాలమున జరుపవలెను. ఇండియాలోని అన్ని యున్నతోద్యోగములను పోటీ పరీక్షలలో వుత్తీర్ణులైన వారికిమాత్రమే ఈయవలెను.

(బి) హిందూదేశ రాజ్యాంగ కార్యదర్శిగారి కౌన్సిలులోను మద్రాసు బొంబాయి గవర్నరుల యొక్కయు వైస్రాయి యొక్కయు కార్యనిర్వాహక వర్గముల లోను తగినంత భారతీయ ప్రాతినిధ్య ముండవలెను.

(సి) అఖిల భారత శాసనసభ రాష్ట్రీయ శాసనసభలు నిజమైన ప్రయోజనముగల ఎక్కువ ప్రజాప్రాతినిధ్యమును వహించె టంత పెద్దవిగా చేయబడవలెను. దేశముయొక్క యార్థిక కార్యనిర్వాహక పరిపాలనములందు ప్రజలకిప్పటికంటె ఎక్కువ అధికారముండవలయును.

(డి) లోకల్ బోర్డులు మున్సిపాలిటీల అధికారములు ఎక్కువ చేయబడవలెను. ఇటువంటి సంస్థలపైన సీమలో లోకల్ గవర్నమెంటు బోర్డుకున్న అధికారముకంటె ఎక్కువ అధికారమిక్కడి ప్రభుత్వోద్యోగుల కుండరాదు. వీనిలో బహిష్కార తీర్మానము ప్రతిపాదించిన బాబు బిపిన చంద్రపాల్ "బహిష్కరణము" అను పదమునకు విశాలార్థముచెప్పి ప్రభుత్వముతో సంబంధమును పూర్తిగా వదలుకొనవలెనని చెప్పెను. అంతటితో చాలక యారువేల మైళ్ల దూరమునుంచి ప్రత్యేకముగా పనికట్టుకుని ఈ కాంగ్రెసు సభాధ్యక్షత వహించడానికి వచ్చిన 80 వత్సరముల ముసలిపండు దాదాభాయిపై మూడు నినాదములకుతోడు, "స్వరాజ్య"మను పదమును జేర్చి, కాలమహిమచే భారత ప్రజలలో ప్రబలుచున్న స్వరాజ్య కాంక్షయొక్క స్వరూపమే ఈ మూడు

ఉద్యమాలు అని నిర్వచించి తన ఆంగ్ల మిత్రులందరికి ఆగ్రహమును కలుగజేసెను.

1907లో జాతీయవాదులను కాంగ్రెసునుండి తొలగింప ప్రయత్నము జరిగి సూరతు కాంగ్రెసు విచ్ఛిన్నమైనా, ఆమరునాడే అక్కడ జేరిన పెద్దమనుష్యులు నిర్ణయించిన ప్రకారం పిదప కాంగ్రెసు నిర్మాణ విధానమునకు ప్రథమసూత్రము తయారైంది. అది ఈ క్రింది విధంగా రూపింపబడినది; ఇంతకన్నవారు 1906 సంవత్సరపు కాంగ్రెసు తీర్మానం పలచన జేయజాలరైరి:—

"బ్రిటిషు సామ్రాజ్యములోని స్వపరిపాలిత దేశముల ప్రభుత్వమువంటి ప్రభుత్వమును భారత ప్రజలు పొందుటయు సామ్రాజ్యముయొక్క హక్కులతోను బాధ్యతలతోను వారాదేశములలోని సమాన భాగస్వాములుగ నుండుటయు భారత జాతీయ మహాసభోద్దేశ్యములు."

1909 లో మింటోమార్లే సంస్కరణలు ప్రసాదింపబడినవి. వానిని ఆ సంవత్సరం కాంగ్రెసులో తీవ్రంగా విమర్శించినారు. ఆపిదప అన్ని కాంగ్రెసుసభలలోను విమర్శిస్తువచ్చారు. 1910 లో క్రొత్తవైస్‌రాయిగా హార్డింజి ప్రభువు వచ్చినాడు.

ఆ వైస్‌రాయి హార్డింజ్ ప్రభువు భారతదేశంలోగల పరిస్థితులను సింహావలోకనంచేసి – రాజకీయాందోళనమునకు నూతనోత్సాహమును కల్పించి, నూతనోద్యమములకు మూలమైన – బంగాళా విభజనను – రద్దుపరచినాడు. "వలసరాజ్య ప్రభుత్వవిధానము" కావలెననే ఘట్టానికి భారత రాజకీయాశయము రావడమును గ్రహించి— "రాష్ట్ర స్వాతంత్ర్యము"— భవిష్యద్రాజ్యాంగ ధర్మమున యేర్పాటు కావలెనని నిర్వచించినాడు. ఇందుకుగాను రాష్ట్రములు పునర్విభజన గావలయునని అన్నాడు. దీనినే సుప్రసిద్ధమైన 1911 సం॥ ఆగస్టు 25వ తేదిన హార్డింజ్ ప్రభువుగారు వ్రాయించిన యాదాస్తు అంటారు. ఇంకా ఆయన అందులో ఇట్లా అన్నారు:—

"భారతదేశపు పటమును, జాతులనుబట్టి, భాషలనుబట్టి పునర్విభజించి వ్రాయవలెను. దాని మూలాన స్థానిక జాతీయాభిమానం పెంపొందిస్తాము; భిన్నజాతులవారు, తమలో తాము – నాగరిక పద్ధతిని అభివృద్ధి చెందడానికిన్ని, ఆఖరున సంపూర్ణమైన రాష్ట్రస్వాతంత్ర్యము పొందడానికిన్ని, సుహృద్భావములాంటి పోటీ పడడానికి అవకాశము కల్పించిన వారమవుతాము; ఇంతకంటేగొప్ప అవకాశాలు భారతీయులకు మరేమీ మనము కల్పించ జాలము."

అటు దేశీయుల రాజకీయాశయమును వ్యక్తపరచే కాంగ్రెసు – "అధినివేశపరిపాలనము" కోరడమున్నూ, ఇటు వైస్‌రాయి "రాష్ట్రస్వాతంత్రమును" ఉద్ఘటించడమున్నూ – ఆంధ్రోద్యమానికి – ప్రోత్సాహకరములైనవి.

అప్పటప్పటికే – కొంతకాలంనుంచీ బంగాళముతో చేరి ఉన్న బీహారమును ప్రత్యేకించవలయుననే ఉద్యమాన్ని శ్రీ మహేశ్ నారాయణ్ గారున్ను వారి మిత్రులున్నూ బీహారులో సాగిస్తున్నారు. కాని బంగాళమును తిరిగి ఒకటి చేయమన్న బంగాళీలుగాని, భారతీయులుగాని, బీహారమునకు ప్రత్యేకరాష్ట్రము కావలయునని ఎత్తుకున్నారు కారు. బీహారీలు తమకు ప్రత్యేకరాష్ట్రము కావాలన్నారేగాని – తమతోపాటు – బంగాళమునంటియున్న ఓఢ్రరాష్ట్రాన్ని వేరుచేయమని కోరలేదు. అందుచేత బంగాళా విభజనాందోళన కేవలము రాజకీయము; బీహార్ ప్రత్యేక రాష్ట్రాందోళన కేవలము – తాము ప్రాచీనజాతి అయ్యి బంగాళీలక్రింద రాణించక నలిగిపోతున్నామనే గోల. ఆ పిదప బయలుదేరిన ఓఢ్రరాష్ట్రాందోళనమున్ను – బీహారముక్రింద నలిగి పోకుండా తమ్ము వేరుచేయమనే కోరిక. అలాంటి కోరిక పుట్టడానికముందు వారు బీహారీలతో వద్దు; మమ్ములను బంగాళీలతో నేచేర్చి ఉంచండి అనికూడా కోరేవారట.

1909 సంస్కరణలతో భారతజాతి తృప్తిపొందలేదు. 1905 లో బంగాళా విభజనానంతరం నిర్బంధ విధానము రేగినది. దానివెంట విప్లవోద్యమము ప్రబలినది. ఆ విప్లవకారులు భారతదేశమునకు సంపూర్ణ స్వాతంత్ర్యమునే కోరిరి. "ఇండిపెండెంట్ ఇండియన్ రిపబ్లిక్"నే వారు కాంక్షించినారు. దానినే నేడు కాన్‌స్టిట్యూయెంట్ అస్సెంబ్లీ అవలంబించినది. ఎప్పుడైతే ప్రజారాజ్యం కోరుతున్నారో—ప్రజానాయకులు కావడానికి ప్రజాభీష్టానుసారం – రాజ్యంనడిపే శక్తికలగవలె. ప్రజాభీష్టానుసారం రాజ్యంనడిపే శక్తి కలగవలెనంటే – ప్రజలు ఏ భాష మాట్లాడుతున్నారో ఆ భాషలో పరిపాలన నడుపవలెను. ఆ భాషలో ప్రజలు ప్రజానాయకులు సంప్రతించుకొనే శక్తిసామర్థ్యాలు దేశంలో ఏర్పడవలయును.

మితవాదులు, అతివాదులను కాంగ్రెసులోనుండి తరిమివేసినమీదట 1909 లో లభ్యమైన మింటోమార్లే సంస్కరణలను విమర్శించుపట్ల—1912 లో కాంగ్రెసునందు ఒక తీర్మానంలో "ఇంగ్లీషు రానివాడు శాసనసభా సభ్యత్వమున కనర్హుడుగా నుండవలెను" అని ఉదహరించారు. అయితే అతివాద నాయకుడైన తిలకు మహా

శయుడు అప్పటికే ప్రజలకు ప్రజల భాషలో ఉపన్యాసాలు లివ్వ సాగించినాడు. తన ప్రజల భాషయైన మహారాష్ట్రమున పత్రిక సాగించ నారంభించినాడు. డిసెంట్రలైజేషన్ కమిటీ (వికేంద్రీకరణము) ఎదుట భాషాపరముగ రాష్ట్ర పునర్విభజన ప్రోత్సహించినాడు. ప్రజాపరిపాలన ప్రజాప్రతినిధి ప్రభుత్వ విధానమున జరుగవలెనంటే ప్రజలుమాట్లాడే భాషకు ప్రాధాన్యం కలుగవలెననే భావం దేశంలో అలుముకొంటున్నది. దేశానికి ఏకైక భాషయొకటి ఇంకా లేకపోవడం, దేశంలో నిరక్షరాస్యత ఎక్కువగా వుంది. ప్రజలు - ఆయా రాష్ట్రాలలో రాష్ట్రీయ భాషలలోనే కేవలము వినికిడివల్ల మాత్రమే - విషయాలు తెలుసుకోవలసినవారు కావడం- 150 సం॥ లైనా ఆంగ్లభాష - 1000 కి ఏ పదిమందికో లోపునైనా మాత్రమే సుమారుగానైనా తెలియక పోవడం - పరిపాలనకు ప్రజల భాషకు - విడదీయరాని సంబంధం ఏర్పడవలసిన అగత్యమును కల్పించినవి. 1916 లో గాంధీ మద్రాసులో ఇచ్చిన ఉపన్యాసం, తిలక్ 1918 లో ఆంధ్రమహారాష్ట్రుల వినతిపత్రానికిచ్చిన జవాబు గమనార్హములు. ఈ భావాలు వారికప్పటికిప్పుడు పుట్టినవి కావు, చిరకాలంగా వారికకల్గి పెంపొందినవి. భిన్నత్వములో ఏకత్వము సాధించడానికి - దేశము భాషా ప్రయుక్త రాష్ట్రవిభజన అయి - అలాంటి రాష్ట్రాలు - ఫెడరల్ విధానంక్రింద ఏక భారత పరిపాలనలో చేరయుండడం - భారతదేశానికి రాజకీయాదర్శమైనది. ఈ రాజకీయాదర్శమే - ఆంధ్రోద్యమానికి జీవకర్ర.

ఇలాంటి సన్నివేశములలో 1913 లో ఆంధ్రమహాసభ మొట్టమొదట బాపట్లలో గూడి, ఆంధ్రోద్యమము నుద్ఘాటించినది. ఆంధ్రోద్యమానికి, ప్రత్యేకాంధ్రరాష్ట్ర నిర్మాణము, ప్రత్యేకాంధ్ర విశ్వ విద్యాలయము, ప్రత్యేకముగా ఆంధ్రుల కుపయుక్తం కాగల ఆంగ్ల దైనిక పత్రిక—ముఖ్యమైన ఆశయాలైనవి. ఇలాంటి ఆశయాలు రూపించను, వీనిని సాధించడానికి కృషిచేయను ఆంధ్ర దేశంలో తగిన పరిపక్వావస్థ ఏర్పడియున్నది.

1925-26 లలో కాబోలు, ఆయన రాజమండ్రిలో - ఇంత మొఖం చేసుకొని - ఆ ప్రకాశంగారు, ఆడా. సుబ్రహ్మణ్యంగారు ఆ చెరుకువాడవారు ప్రజల ఎదుట మాట్లాడుతున్నారే అదీ—అదీ తెలుగుభాష - అని చెప్పడం నాకింకా కళ్లకు కట్టినట్లుంది.

అప్పటివరకు ఆంధ్రదేశంలో జరిగిన కృషి: భారత దేశంలో నూతనభావ సంచలనం ప్రథమంలో సంఘ సంస్కరణ రూపమున అవతరించినది. దానితోపాటు దేశీయభాషలలో పాశ్చాత్యాభిప్రాయములు, ప్రచారము కాజొచ్చినవి. అందుకుగాను, ప్రాచీనమైన అలంకార భూయిష్ఠమగు, చిత్రబంధ కవిత్వములతో గూడుకొని కావ్యనిర్మాణము గాక,—సులభమగు రచనశైలిలో గ్రంథములు వ్రాయుట, నవలలు, ప్రహసనము వెలువడుట, నిర్ణీతకాల పరిమితిలో పత్రికల ప్రచురించుట - మున్నగు కార్యక్రమము లేర్పడినవి. వీని నన్నిటిని శ్రీ కందుకూరి వీరేశలింగం పంతులు, రఘుపతి వెంకటరత్నం నాయుడు, చిలకమర్తి లక్ష్మీనరసింహం పంతులు, కోలాచలం సోదరులు, పనసపాకం అనంతాచార్యులు మున్నగు వారు తెలుగున సాగించిరి. వీరందర నేక శిష్యగణమును తయారుచేశారు. అయితే ఈ పండితులంతా తాము నేర్చిన చిన్నయసూరి తెలుగు విడువజాలరైరి. అప్పుడు శ్రీ గురుజాడ అప్పారావు, గిడుగు వెంకట్రామమూర్తి పంతులుగా ర్లిరువురు ఆంధ్రభాషాంగాన వెలిశారు. ప్రజలుమాట్లాడే భాషలో వ్రాయండి అని ఘోషించారు. అప్పారావుగారు త్వరలో గతించారు. రామమూర్తిపంతులు వినదలుచుకోని పండితులకు చెప్పగా చెప్పగా ఆయనకే చెవుడు వచ్చింది. ప్రజారాజ్యానికి, దేశభక్తికి, భాషా సంస్కారానికి ఆయన ముడిపెట్టడం, పండిత కవులకు బోధపడలేదు గాని మా హయాము వచ్చేసరికి - వేలాది జనంయెదుట నిలచి ఉపన్యసించడానికి చిన్నయసూరి భాష పనికిరాక మేము తడువుకొనే టప్పుడు అర్థమైంది. గంజాం వెంకటరత్నము పంతులు, వినగపల్లి రామస్వామి గుప్త, శ్రీ దేశభక్త కొండా వెంకటప్పయ్య పంతులు, వేమవరపు రామదాసు పంతులు ఇత్యాదులు రాజకీయములందును హెచ్చు జోక్యముల కల్పించుకొనిరి. 1894 లోనే ప్రథమ కృష్ణాజిల్లా మహాసభ జరిగెను. ఇప్పటి గుంటూరుజిల్లా ఆ జిల్లాయందు చేరియుండెను. ఆ ప్రాంతముననే గోదావరి మండల మహాసభయు జరుగ నారంభించినది. 1901 లో కృష్ణామండల సభ వెల్లటూరులో జరిగినది. అందులో తెనుగున "కృష్ణాపత్రిక"యనే యొక వారపత్రిక స్థాపింపవలయునని శ్రీ దేశభక్త కొండ వెంకటప్పయ్య పంతులుగారు ప్రతిపాదింపగా ఈ "యువకుని" (అప్పటి కాయనకు 30 సం॥ లు దాటినవేమొ) సాహసమునకు పలువురాక్షేపించినాగట. అప్పటికిప్పటి కాయన దొక్కటే ప్రకృతి. ఆక్షేపించేవాడు కనబడితే చాలు. ఆయనలో వున్న తీవ్ర శక్తి విజృంభిస్తుంది. ఉద్రేకపూరితమైన ఉపన్యాసమిచ్చి - ప్రజాభిప్రాయాన్ని ఆయన తన వైపునకు త్రిప్పు

జాతీయ యోగవ్యాయామక్రీడా సమితులుగా బనాయించి శిక్షణమిచ్చారు.

ఈ విధముగా ప్రాచీన జాతికి చెందిన ఆంధ్రులము-వరుసగా, ఆంధ్ర మగధ, పల్లవ, చాళుక్య, చోళ, కాకతీయ, విజయనగర, గోల్కొండ సామ్రాజ్యముల నేలిన జాతియైన ఆంధ్రులము - కాలకర్మవశమున - కొండొక కాలము పసచెడియుండి మహా సంస్కృతంలో చెప్పబడిన రీతిగా - అంగవంగకళింగాంధ్రాది భిన్న దేశములతో — కూడిన ఏక భారత వర్షమును రూపించవలెనని దేశభక్తులొనర్చే బహుళ ప్రయత్నానికి వెలిగాకుండా తిరిగీ స్వస్వరూపస్య భావస్య ధర్మములను, దేశకాలపాత్రానుసారముగా - సాక్షాత్కరించుకోవలెనని చేసిన మహత్తర సంకల్పమే ఆంధ్రోద్యమము. ఆ ఉద్యమ సాఫల్యానికి ప్రధాన సాధనములు - ప్రత్యేకాంధ్ర రాష్ట్రము, ప్రత్యేకాంధ్ర విశ్వవిద్యాలయము, ప్రత్యేకాంగ్ల దినపత్రిక. ఇందు పిదప రెండు ఏర్పడినవి; వానిలో రెండవది అంతరించినది. తిరిగీ దాని కళ్లంలో మరొకటి మొలవనున్నది, మొదటిది అనూరునివలె పూర్వకాయమత్తమై నిలిచియున్నది. ఆంధ్రోద్యమ జనకులు, శ్రీ దేశభక్త వెంకటప్పయ్య పంతులుగారే 1925లో కాబోలు తూర్పు గోదావరి జిల్లా కొత్తపేటలో ఉపన్యసిస్తూ - "ఇప్పుడెందుకొచ్చింది - ఈ తలకొరివి" అని దీనినాశీర్వదించారు. ఇదే దానికి మొదటి అపశకునము-ప్రథమంలో (1911 ప్రాంతంలో ఆంధ్ర విశ్వవిద్యాలయం కావాలని వ్యాసాలు వ్రాసిన డా॥ పట్టాభిగారు-1938లో కాళ్ళదగ్గరకు వచ్చిన విశ్వవిద్యాలయోపాధ్యక్ష పదవిని కారణాంతరాలచే కాలదన్నేశారు. ఇది రెండవ అపశకునం — ఇంకా వీటి చరిత్ర చెప్పవలెనంటె అదొక ప్రత్యేక గ్రంథము అవుతుంది.

ఆంధ్రరాష్ట్రవాంఛ మొట్టమొదట గుంటూరులో కొందరు యువకుల హృదయక్షేత్రములలో మొలకెత్తినది. అప్పట్లో శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులుగారు పెద్దలలో యువకులు, యువకులలో పెద్ద-ఇప్పటికీ అంతేనేమో ! - వీరిచుట్టూ చేరిన యువజనులు - శ్రీచట్టి నరిసింహారావుగారు, మద్ది రాధాకృష్ణయ్యగారు, జొన్నవిత్తుల గురునాథంగారు, చల్లా శేషగిరిరావుగారు, వగైరాలు. 1910లో వీరు గుంటూరులో "యంగ్ మెన్సు లిటరరీ అసోసియేషన్" అని ఒకటి ఏర్పరచినారు. వారి ఇష్టాగోష్టులలో శ్రీ జొన్నవిత్తుల గురునాథంగారు ప్రాచీనాంధ్ర జాతి నివసించే దేశభాగమంతా ఒక ప్రత్యేక రాష్ట్రంగా ఉండడం వాంఛనీయమని వెల్లడించారు. ఆ వాంఛ మిగతవారినందరి నావేశించినది. దానికి తగిన సంజాయషీని ఈ "కుర్రవాండ్రం" తా సేకరించారు. శ్రీ గురునాథంగారు ఆ సంజాయిషీనంతా చిన్న గ్రంథ రూపంగా తయారుచేసి - ఆంధ్రదేశ పటమొకటి వ్రాసి - అందులో పొందుపరచి ప్రచురించారు. వారు ఆంధ్రుల పూర్వచరిత్ర-ప్రస్తుతస్థితిగతులను గూర్చి పలువ్యాసాలు వ్రాసి హిందూలో ప్రకటించారు. వీరప్పటికి బి. ఏ. ప్యాసై - గుంటూరు కిరస్తానీ కాలేజీ హైస్కూలులో ఉపాధ్యాయులుగా ఉండేవారు. ఆ పిదప కురుపాం రాజాగారికి — అంతరంగిక కార్యదర్శిగా ఉండేవారు. ఆ రాజా వారప్పట్లో కేంద్రశాసన సభలో సభ్యులుగా ఉండేవారట. ఈ గురునాథంగారు చాలా ప్రతిభాశాలురని — జీవితంయొక్క అన్ని హంశాలను గూర్చి - పరిశోధనలు చేస్తుండేవారనీ చెప్తారు. వీరు 1915లో కాబోలు కీర్తిశేషులైనారు. శ్రీ చల్లా శేషగిరిరావుగారు కూడా దేశాభిమానిలో కొన్ని వ్యాసాలను వ్రాసారు. గురునాథంగారు ప్రత్యేకంగా "ఆంధ్ర" అనే ఆంగ్ల పత్రిక స్థాపించి తద్వారా — ఆంధ్రోద్యమాధర్మముల ఔన్నత్యమును చాట నారంభించారు. ఈవిధంగా 1913 నాటికే ఆంధ్రోద్యమము ఆంధ్రరాష్ట్రవాంఛ — ఆదర్శావేశపూరితమైన ఆంధ్రయువకుల హృదయాకాశాన నిండి నిబిడీకృతమైయున్నది. (1907 సం॥ విశాఖపట్నంలో జరిగిన మద్రాసు రాష్ట్రీయ మహాసభలో ఆంధ్రరాష్ట్ర ప్రస్తావనవచ్చినదని శ్రీ గిడుగు వెంకట సీతాపతిగారన్నారు.)

1908 ప్రాంతంలో గుంటూరుజిల్లా సంఘానికి కార్యదర్శిగా శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణగారు గుంటూరు వచ్చారు. 1912లో నిడదవోలులో మండల మహాసభ జరుగడానికి నిర్ణయంజరిగింది. బందరునుండి మద్రాసుకు మారి ప్రాక్టీసుచేస్తున్న శ్రీ వేమవరపు రామదాసు పంతులుగారధ్యక్షులు. ఆరోజులలో ఆహ్వాన సంఘము వారికి చిత్తు తీర్మానాలు - జిల్లాసంఘాలు తయారుచేసి పంపేవి. కార్యదర్శి జిల్లా సమావేశము జరిపినారు. దానికి కొండ వెంకటప్పయ పంతులు, వింజమూరి భావనాచార్యులు, మద్ది రాధాకృష్ణయ్య, గోవిందరాజు శ్రీనివాసరావుపంతులు, గొల్లపూడి సీతారామశాస్త్రిగార్లు హాజరైనారు. లక్ష్మీనారాయణగారందులో ఆంధ్రరాష్ట్ర తీర్మానము ప్రవేశపెట్టినారు. సీతారామశాస్త్రిగారామోదించినారు. కొండ వెంకటప్పయ్యగారు వారికి ఈయువకుల తీర్మానంనచ్చక చర్చన

కున్నారు. దాసు నారాయణరావుగారు వెంకటప్పయ్య పంతులుగారు ఆ పత్రికకు ప్రథమ సంపాదకులు. ప్రభుత్వమువారున్నూ ఈ పత్రికను మెచ్చుకున్నారు; తెలుగు నేర్చుకోదలచిన యూరపియను ఉద్యోగుల కీ పత్రిక చాల ఉపయోగకారి అని వారు నుడివినారట. ఆ పిదప వేమవరపు రామదాసు పంతులుగారు, డా॥ పట్టాభిగారు, చతుర్వేదుల రాఘవయ్యగారు, గాడిచర్ల హరిసర్వోత్తమ రావుగారు మున్నగువారంతా దీనిని నడిపినవారే—

అప్పటికే గంజాం వెంకటరత్నంపంతులు, పనప్పాకం ఆనందాచార్లు, కోలాచలం వెంకట్రావుపంతులు, బయ్యా నరసింహేశ్వరశర్మ, న్యాయపతి సుబ్బారావుపంతులు, కొచ్చర్లకోట వెంకటకృష్ణారావుపంతులు, మోచర్ల రామచంద్రరావు పంతులు, భూపతిరాజు వెంకటపతి రాజుగారు మొదలైనవారు హెచ్చుగా కాంగ్రెసు రాజకీయాలలో పాల్గొంటున్నవారు. అయితే వీరు చాలా మటుకు మితవాదులలో చేరినవారు. తిలక్ గారి నాయకత్వమున ప్రబలిన అతివాదముగూడా ఆంధ్రదేశంలో ప్రవేశించినది. బంగాళా విభజనాందోళన ప్రభావము సమీపంలో ఉన్న ఆంధ్రదేశంలోను సంచలనం కలిగించింది. బంగాళా విభజనాందోళనా నాయకులైన బిపిన్ చంద్రపాలుగారు ఆంధ్రదేశంలో సంచారంచేసి పోయినారు. వారి వెంట ముట్నూరి కృష్ణారావుగారు శిష్యప్రాయులై తిరిగినా రంటారు. ఆ పిదపవారు సబ్బుల ఫ్యాక్టరీపెట్టి వేళ్లు కాల్చుకున్నారటకూడా. "1906-07 లలో ఆంధ్రదేశ మారుమూలనుండి ఈ మూలకు జ్వలితమై యుండెను. వార్తా పత్రికలు రాజద్రోహంతో ఉడికిపోవుచుండెను." 1908 లో సరిగా తిలకు మహారాజు మహారాష్ట్రమున అరెస్టయిననాడే - ఆంధ్రదేశంలో - శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావు గారు రాజద్రోహకరమైనవ్యాసములను "స్వరాజ్య" అనే తెలుగు వారపత్రికలో వ్రాసినారని అరెస్టుచేసి - విచారణ సల్పి 9 నెలలు శిక్ష విధించిరి. హైకోర్టులో అప్పీలుచేయగా 3 సం॥ ల కాశిక్ష హెచ్చించినారు. శ్రీ హరిసర్వోత్తమరావుగారు అంతకు ముందు సం॥ము రాజమండ్రిలో వందేమాతరోద్యమ విద్యార్థులకు నాయకుడై నడిపి, తనతోపాటు చాలమంది విద్యార్థులను విద్యాలయంలోనుంచి వెళ్లగొట్టబడ డానికి మూలమైనారు. ఆ సంవత్సరమే యూరపియనొకడు వందేమాతర మన్నందుకు ఒక కుర్రవానిని కొట్టినాడని కాకినాడలో అల్లరులైనవి. విచారణలు శిక్షలైనవి. ఆ రాజకీయపు కేసులో ముద్దాయిల తరఫున వాదించిన వారిలో కూర్మా వెంకటరెడ్డినాయుడు గారొకరు. వారు 1917 వరకు కాంగ్రెసు వారేనట. ఇంకా ఆ కాలంలో ఆంధ్రదేశమున జరిగిన విప్లవ విశేషముల గూర్చి శ్రీ డా. భోగరాజు పట్టాభిసీతారామయ్యపంతులు గారు సంజవర్తమాన్ (బొంబాయి) అనే పత్రికలో ఇట్లు వ్రాసియున్నారు.

"1907 మే నెలలో కాకినాడలో జరిగిన అల్లరి భారతదేశమున యూరపియన్ చూపు పొగరుపోతుతనమునకు చక్కని జవాబు. కృష్ణాజిల్లాలో రాజకీయపు బందిపోటులు జరుగుననికూడా ప్రభుత్వమువారు అనుమానించిరి." "ఆంధ్రదేశమున బంగాళా జాతీయోద్యమ ప్రతిధ్వనులు గమనింపదగినవి. గుంటూరుజిల్లా కతవర గ్రామమున రెండు ఉపయోగార్హమగు బాంబులు పట్టుబడినవి. యువకులు కొందరు విప్లవోద్యమమున వ్రేలుపెట్టి 1912-13 లలో అది అదృశ్యమగునంతవరకు దానిలో జోక్యము కలిగియుండిరి."

1907 రాజమండ్రి విద్యాలయంలోనుంచి వెళ్ళగొట్టబడ్డ ఎల్. టి. విద్యార్థులొక్క జాతీయ కళాశాల పెట్టినారు. దీని ప్రిన్సిపాల్ వెంకట్రావుగారే. పిదప పూరీ శంకరాచార్యస్వాములవారై కరాచీ ఖిలాఫత్ తీర్మానమునకై అలీసోదరులతో 1921లో శిక్షపొందినారు.

1908 లో ఆంధ్రజాతీయ కళాశాల బందరులో స్థాపింపబడినది.

ఎమ్. ఏ. బియల్ పట్టమునందిన శ్రీ కోపల్లె హనుమంతరావుగారు ప్లీడరు పట్టా చించివైచి - ఆంధ్ర జాతీయ కళాశాలాభివృద్ధికై 2-2-27 న చనిపోవువరకు పాటుపడినారు. ఆ ప్రాంతంలోనే ఆంధ్రవిద్యార్థి సంఘము స్థాపితమై సాంవత్సరిక సమావేశములు జరుపజొచ్చిరి. బిసెంటు నిర్బంధమప్పుడు—"విద్యార్థులు రాజకీయముల పాల్గొనరాదు" అని—నిషేధింపవలసినంతటి బలీయముగా ప్రబలినది. అప్పుడప్పుడే విజ్ఞానచంద్రికా మండలివారు శ్రీ చిలుకూరి వీరభద్రరావుగారు— "ఆంధ్రులచరిత్ర" నచ్చువైచిరి. ఆంధ్రభాషాభివర్ధనీ సంఘంవారు అంతకు ముందే కొన్ని గ్రంథములను ప్రచురించినారు. అప్పటికి ఆంధ్రదేశ గ్రంథాలయోద్యమమేర్పడి సాగుతున్నది. 1914 లో ఆంధ్రగ్రంథాలయ సంఘం ఏర్పడ్డది. కలియుగభీమ కోడి రామమూర్తి గారి బలప్రదర్శనాలు, కలియుగార్జున కొండవరపు అప్పారావుగారి ధనుర్విద్యా ప్రదర్శనాలు ఆంధ్ర యువకులను ఆత్మవిశ్వాసపూరితులను గావించినవి. శ్రీ బులుసు రామజోగారావుగారు ఆ యువకులను ఆంధ్ర

లేచారు. "ఇతర రాష్ట్రవాసులు ఈ తీర్మానంచూస్తే నవ్వుతారు; మనలను పిచ్చివారని హేళన చేస్తారు. ఇట్టి సంఘములో సభ్యునిగా ఉండడంనా పొరబాటు" అంటూ గంభీరోపన్యాసం చేశారట. కాని అధిక సంఖ్యాకులచే ఆ తీర్మానము నెగ్గినదట. ఇది పంతులవారికి న్యూనత కల్పించను వ్రాయడంలేదు. ప్రథమంలో - వయసు ముదురుతున్న పెద్దలు ఏవిధంగా ఈ వాంఛపట్ల యోచించారో చెప్పడానికి తార్కాణంగానే దీనిని ప్రస్తావించినాను. ఈ ప్రస్తావన ఆంధ్రోద్యమానికై వారు గావించిన మహోత్తర కృషికి కళంకంకాదు కదా! మరోవన్నెకూడా పెట్టగలను. ఈసంగతి అప్పటికే చెన్నపట్నంలో గుప్పుమన్నది. సభాధ్యక్షత వహించడానికని - సాయంకాలము మెయిలెక్కి సంకల్పించుకొన్న శ్రీ రామదాసు పంతులుగారు ప్రార్థన కొట్టుకువచ్చి మెయిలెక్కుతున్నారు. వెనుకపాటున మెయిలెక్కుతూ జస్టిస్ సుందరయ్యర్ గారు వెటాకోళంగా నవ్వుతూ - "ఏమండి ఆంధ్రుడుగారు" (What mister Andhra ?) అంటూ పంతులుగారి వీపున చల్లగా మెల్లగా చరిచారట. చెన్నపురికివచ్చి ప్రాక్టీసు పోగుచేసుకుంటూ పైకిరావలెనని ఉత్కంఠతతోనున్న శ్రీ పంతులుగారికి ఆమాటకు ఆ చరుపునకు, వళ్లు జలదరించి ఉంటుంది. ఆ జలదరింపు నిడదవోలులోకూడా వదలలేదు. ఆ తీర్మానం ప్రవేశపెట్టవద్దు ! గుంటూరు యువకులను బ్రతిమలాడారు. లాభంలేక పోయింది. ఏదో సాంకేతికమైన సాకుపెట్టి చర్చకే రానీయకుండా త్రోసివేశారు. ఆ తీర్మానం పెట్టినప్పుడు సభాపతుల భావతరంగములనిట్లని శ్రీ వెంకటప్పయ్య పంతులుగారు - 1988 లో తాము వ్రాసిన - ఆంధ్రోద్యమము (The Andhra movement) అనే చిన్న గ్రంథంలో ఇట్లు పల్కించారు:—

"ఈ తీర్మానంవల్ల సభలో చాలా సంచలనం కలిగింది. చాలమంది ఈ తీర్మానం అనాలోచిత మనుకున్నారు; మరికొందరు ఇది ఇప్పుడు తీసుకురా దగ్గది కాదనుకున్నారు. అధ్యక్షు డీ తీర్మానానికి కటకటపడ్డాడు; ఏదోసాకుపెట్టి, క్రమభంగమని ఈ తీర్మానాన్ని త్రోసివేసి బయటపడ్డాడు - తీర్మానం త్రోసివేయబడినా - ప్రజలు దీని విషయమై తీవ్రంగా యోచింపసాగినారు."

1913 లో (మే నెల) బాపట్లలో ప్రథమ ఆంధ్ర మహాసభ సమావేశమైనది. శ్రీ దేశభక్త కొండ వెంకటప్పయ్య పంతులుగారే - ఆహ్వాన సంఘాధ్యక్షులు; శ్రీ బయ్యా నరసింహేశ్వర శర్మగారధ్యక్షులు. శ్రీ వేమవరపు రామదాసు పంతులుగారే ఆంధ్రరాష్ట్ర తీర్మానము నుపపాదించిన వారు - ఇల్లలకగానే పండుగ గాలేదు. శ్రీ ముట్నూరి కృష్ణారావుగారు తీర్మానము నామోదిస్తే, - శ్రీ ముట్నూరి వెంకట నారాయణయ్యగారు తీర్మానము నెదిర్చినారు. వారితోపాటు చాలామంది పెద్దలు ఎదిర్చినారు. కడకు శ్రీ ముట్నూరి కృష్ణారావుగారే సవరణ ప్రతిపాదింపగా - తీర్మానము - మరుసటి సంవత్సరం సమావేశానికి వాయిదా పడినది. ఆలోపల తగిన ప్రచారము చేయుటకై స్థాయిసంఘమేర్పరింపబడినది. మరుసటి సంవత్సర సమావేశమున తీర్మానము నెగ్గినది. అయితే - సంవత్సర సంవత్సరమునను - ప్రతికూల వర్గమును - ఆంధ్రనాయకులనే - క్రమక్రమముగా సుముఖుల నొనర్చుకోవలసి వచ్చినది. ఆ చరిత్ర వొక్కింతచెప్పి ఆ పిదప - ఆ సంకల్ప మీనాటికిన్ని నెరవేరక పోవుటకు గలకారణముల నరయవలయును.

పై చరిత్ర అంతా పరిశీలిస్తే ఆంధ్రోద్యమము - దాని యందలి జీవతంతులైన ఆంధ్రరాష్ట్ర వాంఛనహా ప్రత్యేకతాభావ సమన్వితమైన సంకుచితతత్వ పూరితము కాదని, భారతదేశంలోని రాజనీతిచతురుల స్వాతంత్ర్య స్వరూప నిర్వచనానుగుణ్యంగా, బ్రిటిష్ ప్రభుత్వంవారు తత్ఫలసిద్ధికై ప్రసాదింపదలచిన సంస్కరణానుకూలంగా, దేశంలో ప్రబలుతున్న తీవ్ర రాజకీయవాద కార్యక్రమములు, దోహదప్రాయం కాగా,—సర్వతో ముఖాభ్యుదయాభిలాషులై, తత్కార్యసిద్ధి కనుగుణ్యమైన కార్యకలాపాసక్తులు, యత్నప్రారంభకులునై — మెరయుచుండిన యువకుల నవశక్తితో పుట్టిపెరిగిన విశాల భావోపేతమైన - మహోద్యమమది. కావుననే భారతదేశముయొక్క రాజకీయ సమస్యయొక్క పోటుపాటులతోపాటు ఆదరణ నిరాదరణల పొందుతూ - దానితోపాటే పరిష్కరింపబడుటకై వేచియున్నది అని నా మతము.

# ఆంధ్రరాష్ట్రము: రాయలసీమ ఔత్తరాహుల కర్తవ్యము

శ్రీ బూదూరు రామానుజులు రెడ్డి



ఆంధ్రోద్యమము సదుద్యమ భరితమగు మహాదుద్యమ మనిపించుకొన్నది. 1918 వ సంవత్సరమున గుంటూరు మండలాంతర్గతమగు బాపట్ల యిసుక పఱ్ఱలలో ఉద్భవించిన నీయుద్యమ దేవత ఆంధ్రుల కోర్కెలనీడేర్చి ఆంధ్రత్వమును నిలువబెట్టి ఆంధ్రుల ప్రత్యేకరాష్ట్ర వాంఛను నెరవేర్పజాలక పోవుటలోగల అంతరార్థము ఆంధ్రుల ఆరంభశూరత్వము - ఇందుకుమూల మాంధ్రుల అలసభావము - అనైకమత్యము అని చెప్పుటకు సిగ్గుపడవలసియున్నది.

అలనాడు ఆంధ్రరాష్ట్రోద్యమ మారంభింపబడినప్పుడు చిత్తూరు - దత్తమండలములని చెప్పబడుచుండు నేటి రాయలసీమలోని వారుమాత్రమేగాక ఉత్తర సర్కారులవారును నీ ఆంధ్రోద్యమము వినాశహేతువని చెప్పుచుండిన దినములును కలవు. ఈనాడు ఉత్తర సర్కారులవారు కాకున్నను మా పడమటి జిల్లాలలోని వారనేకులు ఆంధ్రరాష్ట్ర నిర్మాణమునకు వ్యతిరేకులుగ నున్నారని చెప్పక తప్పదు. ఆంధ్రరాష్ట్ర నిర్మాణము - రాష్ట్ర ప్రధాన కేంద్రము - ఆంధ్ర విశ్వవిద్యాలయ ముఖ్యస్థానము - ప్రాజెక్టుల నిర్మాణము మున్నగు విషయములలో ఉత్తరసర్కారులలోని నాయకుల యభిప్రాయములను శంకించుచు రాయలసీమవారు భిన్నాభిప్రాయులై యింకను తమకోర్కెలు తీరుటకు ప్రత్యేక సభలలో ఆందోళనము సలుపుచునే యున్నారు. ఉత్తర సర్కారులవారు బహు స్వార్థపరులనియు, రాయలసీమ వాసులను లక్ష్యపెట్టుట లేదనియు, తమ కడుపు నిండించుకొనుట తప్ప కఱవు కాటకాదులతో నిండియున్న రాయలసీమ వాసుల గమనించుట లేదనియు, ఆంధ్రరాష్ట్ర సమస్య వచ్చినపుడు మాత్రము వారిని కూడగట్టుకొనుటకు మాత్రమేవో తాత్కాలికతంత్రములు పన్నుచున్నారనియు వారుద్దేశించుచున్నారు. తుంగభద్ర ప్రాజెక్టు విషయమున ప్రప్రథమమున అనుకొన్న రీతిని రాయలసీమ మొత్తమునకు నుపయోగపడెడి తీరునగాకుండ, నేకొద్ది జిల్లాలలోని భూములకు నుపయోగపడెడి పథకములో నిర్మాణ ప్రదేశమును సైతము మార్పుగావించి అనేకకోట్ల రూపికల వ్యయముతో గోదావరి రామపాద సాగర నిర్మాణము ప్రారంభించి మోసము జేసిరనెడి వాదముగూడ కలదు. ఇంకను గ్రంథకర్తల విషయముననేమి? భాషావిషయిక ప్రచారముననేమి? వార్తాపత్రికల ప్రచురణాదికములందేమి? అన్నిటను రాయలసీమ 'రాళ్ళసీమ'గ గుర్తింపబడుచున్నదనెడి ప్రవాదముగూడ కలదు. రాయలసీమలో కడప-మహానంది-అనంతపురము - చిత్తూరులాదిగాగల ప్రదేశములలో ఆంధ్ర మహాసభలు, ఆంధ్రరాజకీయ సభలు జరిగినప్పటికిని వానిలో రేకెత్తిన ఆంధ్రరాష్ట్ర వాంఛ సత్వర రాష్ట్ర సంపాదనమునకు త్రోవచూపకున్నది.

శ్రీభాగు ఒడంబడికలుగాని, పెద్దల హితవచనములుగాని, ఔత్తరాహికుల వినయపూర్వక సందేశములుగాని ప్రత్యేకాంధ్రరాష్ట్రస్థాపన విషయమున రాయలసీమవాసులకు తృప్తిని కలిగించుటకు బదులు భయసంశయాస్పదములు వ్యాపింపజేయుటకు తోడ్పడుచున్నవి. ఔత్తరాహులతో మాకేమి పని? రాయలసీమ కొక ప్రత్యేకరాష్ట్రమును, విశ్వవిద్యాలయమును సాధించుట కేల ప్రయత్నింపరాదని కొందరు వాదించుచున్నారు. తిరుపతి దేవుని ద్రవ్యముతో స్థాపింపదలచిన శ్రీవేంకటేశ్వర విశ్వవిద్యాలయ నిర్మాణమును ఆపివైచి ఆంధ్ర విశ్వవిద్యాలయ ప్రాపకమును రాయలసీమలో వ్యాపింపజేసి అతుకులు కూర్చుటకు పెద్దలు

